# గోదావరి కథలు

బి.వి.ఎస్. రామారావు



నవోదయ పబ్లిషర్స్ విజయవాడ-2
గుంటూరు-2

GODAVARI KADHALU (Stories)

– B. V. S. Ramarao



FIRST EDITION
APRIL 1989

NAVODAYA PUBLISHERS
VIJAYAWADA - 520 002

Cover Design
BAPU

PRINTED AT
ANILA PRINTERS
*VIJAYAWADA-520 002*

Price :
POPULAR EDITION Rs. 30-00
LIBRARY EDITION Rs. 45-00

# సీతారాముడేమన్నాడోయ్!

ప్రతి రచయిత జీవితంలోను, మనిషి జీవితంలో శీతాకాలం, ఎండాకాలం, వానాకాలాల్లాగ కథల్రాసేకాలం, నాటకాల్రాసేకాలం, మీటింగులూ - ఉపన్యాసాలకాలం వగైరా వగైరా ఉంటూ వుంటాయి. కలాలు కూడా ఒకప్పుడు రాస్తాయి, మరొకప్పుడు రాయవు. శిశిర వసంతాల్లాగే కథకులకు కూడా శిశిర హేమంత వసంత ధ్వాంత కాంతులూ వుంటాయి. పూసేకాలం వస్తే చింతచిగుర్పు కూడా

పూయవా? అలానే కలాలు కూడా పూస్తాయి, కలాలు నిప్పుల్నీ నిజాల్నీ కూడా పూస్తాయి.

మరొక డవుటు- యివన్నీ - నీళ్ళలాటి కథలు, నిప్పుల్లాటి కథలు వీట్ని మనమే రాస్తున్నామా? మనచేత ఎవరైనా రాయిస్తున్నారా అని. అప్పుడు నాకనిపిస్తుందీ-బాధలు, కష్టాలు, కన్నీళ్ళు మనచేత రాయిస్తా యని. జీవితం మనచేత రాయిస్తుంది. జీవితమంటే కాలం, కాలాను గుణ్యంబుగన్ అన్నట్లు కాలాను గుణ్యంబుగా ఎవరో చెప్పినట్లు మనం రాస్తాం. కొందరికి కోపంవచ్చి రాస్తారు, కొందరు ఆకలేసి కేకలేసి రాస్తారు, కొందరు నీళ్ళతో కూడా రాస్తారు. ఆ నీళ్ళతో రాసినవాడు సీతారాముడు- ఆ నీళ్ళు గోదావరి నీళ్ళు. అంచేత 'సీతా రాముడేమన్నాడోయ్' చూడమంటున్నాను.

గోదావరి గురించి కూడా నాకు అనుమానం కలుగుతూ వుంటుంది. ఈ గోదావరి తెలుగు గోదావరా సంస్కృతపు గోదావరా అని. నన్నయగారి భారతం చదివితే రెండూనూ అనిపిస్తుంది. అది అలా వుంచితే, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారివి గౌతమీ గాథలు, సీతా రాముడివి గోదావరి కథలు. వెన్న కాస్తారు. కాచినపుడు గోకుడు వస్తుంది. దాన్నికూడా గోదావరి అంటారు. ఆ గోదావరికుండే రుచి (వెన్న కాచినపుడు వచ్చే గోకుడుకి వుండే రుచి) యీ కథలకు వుంటుందని చదవగానే పాఠకులు యిట్టే గ్రహిస్తారు. అందాలరాముడి సినిమాలో సావాలమ్మ పెసరట్లకు వుండే రుచి, పుష్కరాల రేవులో పుల్లట్లు కథకు వున్న రుచి యీ పుస్తకంలోని కథలన్నిటికీ పాకింది.

మనిషి మంచివాడు కాకుంటా మంచి కథలు రాయలేడు. ఒక మంచి మాట అనడానికెంతో సత్తా కావాలి. ఒక మంచి కథ రాయడానికెంతో

సత్తా. యింకెంతో మంచితనం కావాలి. జీవితాన్ని సాహిత్యంగా మార్చడం పచ్చిపాలలోంచి వెన్న తీయడం లాటిది. పెద్దమనసుతో రాసినవి పెద్ద రచనలయి తీరుతాయి. మనిషి ఒక ప్రాంతానికి చెంది అక్కడ గాలిపీల్చి, అక్కడ నీళ్ళు తాగి తన బతుకు పండించు కుంటాడు. అలా బతుకుల్ని పండించుకున్న కథలిలాగే గోదావరి కథల్లా వుంటాయి. రాగిడబ్బుతో ప్రారంభమయి పుష్కరాల రేవులో పుల్లట్లు కథతో ముగిసిన యీ సంపుటిలో గోదావరి కథలు డజన్ కి ఒకటి తక్కువగా వున్నాయి. బంతిపూల తోటలో పరికిణీలు కట్టుకున్న చిన్నారి పొన్నారి కన్నారి ఆడపిల్లల్లా యీ కథలు మీ మనసులో చిట్టిపొట్టి అడుగులేసి ఆడుతాయి.

మనుషులు మనుషులేకాని అందరి ముఖాలు ఒకలా వుండనట్లే, కథలన్నీ ఒకలా వుండనక్కర్లేదు. గొప్పకథలు గొప్పవాళ్ళు రాస్తారు. (మంచి కథలు రాకుండా గొప్ప కథలు రావు). ఈ సీతారామ కథా సంగ్రహంలో గొప్ప కథల్లాటివీ వున్నాయి. మంచి కథలూ వున్నాయి. రచయిత తన మాటల్లో చిన్న హెచ్చరిక చేశారు. అది యిది- "ప్రవాహంలో తరంగాల్లా ఎన్నో జీవితాలు కాలప్రవాహంలో సాగి పోతుంటాయి. తరంగానికి దిగువ మనకు కనబడని మరొక తరంగం వుంటుంది. ఆ తరంగశక్తే మనం చూస్తున్న తరంగాన్ని నడిపిస్తుంది. అలాగే మనమెరిగిన వ్యక్తుల జీవితాల వెనుక మనమెరుగని ఎన్నో కథలు దాగి వుంటాయి. ఆ సాగే కథలకు పారే గోదావరి సాక్షి." గోదావరి వరదపై వచ్చిన 'గుండెల్లో గోదారి' అనుమంటి కథ. వరద బీభత్సాన్ని, ఆ బీభత్సం మధ్యలో ఒక పెళ్ళి, ఆ ప్రవాహంలో వారి వియోగ సంయోగాలు కథంతా చిత్రకల్పనలా వుంటుంది. కెమేరాలు చెప్పలేని గోదావరి కథ. ఈ కథంతా గోదావరి ఛందస్సు

మీద నడిచింది. బీభత్సం మధ్య ఆశ, చీకటిలో కాంతిరేఖలా తళుకు మంటూ వుంటుంది.

'త్రిలోకసుందరి' గోదావరి చైతన్యంతో కూడుకున్న రచన. కూనవరం సంతకు వెళ్ళి రావడానికి యీ లాంచి ఏకైక తరణోపాయం. పాపికొండలనడుమ మెలికలు తిరుగుతూ ప్రవహించే గోదావరి స్పృహ, గోదావరి సంఘర్షణతో రాసిన అపురూప రచన. ఈ కథలో లాంచి యజమాని దృక్పథం మానవ విలువలకు చోటివ్వని దోపిడీ తత్వానికి ప్రతీక. డాక్టర్ అవధాని ప్రజల మనిషి. గాంధేయవాది. హింస రేపే ప్రతిహింస సమర్థనీయమా కాదా యీ కథ చదివితే తెలుస్తుంది.

'అద్దరి-యిద్దరి' మపాసా కథంత చిక్కగా చక్కగా మనిషి ఎంత ఎత్తుకు ఎదగగలడో, మరి ఎంత లోతుకు దిగజారగలడో 'కంపేర్ అండ్ కాంట్రాస్ట్' చేసి చెప్పగలదు. గొల్లకిష్టయ్య, గొల్లకిష్టయ్యని పోశమ్మ సాక్షిగా పెళ్ళాడిన అతని భార్య, ఫారెస్ట్ రేంజరు, దున్నపోతు ఆఫీసరు వీరిలో సందర్భానుసారంగా మానవాతీతులై పోగలవాళ్ళు, కళ్ళు మూసుకుని కామాంధులై పోగలిగినవాళ్ళ సోమర్ సెట్ మాం కథల్లో 'క్రీచర్స్ ఆఫ్ సర్కమస్టెన్స్' లాటి వారుగా తేలిపోతారు. ఇది యీ సంపుటిలోకెల్ల తలమానికం అనదగిన స్థాయికి ఎదిగిన కథ.

గోదావరి కథల్లో 'నావ కల్చరు'కు అద్దంపట్టే రచన బైరాగి. ఈ కథ యావత్తూ గోదావరి తీర ప్రజల నిత్యవ్యవహారికాన్ని రేవు నావమీద కెత్తించి చూపుతుంది. ఏ తీరుగ నను దయచూచెదవో అని పాడుకునే గుడ్డి బైరాగి చుట్టూ రోజూ తిరిగే ప్రపంచాన్ని, దాని గమనాన్ని కథకుడు క్షణంసేపు ఆపి - మనకు, మనకు తెలియని

నిజంతో చకచ్చకితుల్ని చేస్తాడు. పబ్లిక్ రిలేషన్స్ ఎలా నడపాలో ఈ కథలోని నావలో బైరాగి నుంచి మనం గ్రహించవచ్చు.

ఈ సంకలనంలోని మరో మహత్తరమైన రచన 'అది-వాడు-చేప'. కొంత దాచడం, కొంత చెప్పడం, చెప్పిన దానికన్న చెప్పనిదే ఎక్కువ. నీటిమీద బతికే జలపుష్ప విక్రేతలు - గోదాట్లో చేపలు పట్టడంలోని మెళకువలు- అందులో జాలరిజంట కువకువలు - పట్టి సీమలో శివరేత్తిరి సంబరాలు- దాని పూసల ముక్కుపుడక - వాడు దాన్ని ముద్దెట్టుకున్నపుడల్లా పాఠకుల్ని కూడా గిరేస్తుంది. దానికి వాడికి మధ్య చేప గాకుండా సింగారి, రబ్బరు చెప్పులు, తీర్థంలో కొన్న నల్లకళ్ళజోడు- అవి గోదాట్లోపడి కలవాల్సిందే తద్దోషపరిహారార్థం. ఈ కథలో సత్యభామ అలక వుంది, సెంటునూనె వాసనేసే సింగారితో అఫైర్ వుంది. వలచి వలపించుకోలేక ఆడది గుర్రయ్యేదగా వుంది, ప్రేమలోని అమాయకత్వం వుంది, నావకి చేపకి మధ్య జరిగే పోరాటంలో వల విసరడం వుంది. దాన్ని గురించి వినండి- 'వల విసరడంలో దానికదే సాటి. విల్లులా శరీరాన్ని వంచి గిర్రున తిరుగుతూ వల విసిరితే అది గురి తప్పక సూటిగా పువ్వులా విచ్చుకుంటుంది' విచ్చుకోదా మరి! ఆడది వల విసిరితే అది మగాడి మనసులో గురి తప్పక సూటిగా పువ్వులా విచ్చుకుంటుంది. ఆ సింగారి నంజకి ఈ కథ చదివే పాఠకులు కూడా ఏమీ కాంప్లిమెంట్లు యివ్వకూడదు. ఇస్తే వాడికీ దానికీ సీతారాముడికే యివ్వాలి.

గోదారి పొడుగునా వుండే యిసుక తిప్పలమీద బతికే ఉప్పరి బంటాలు సగరపుత్రులట. బంటా మేస్త్రీలంతా యీ సాగరపుత్రుల కథే విప్పుతారు. ఈ కథలో బం. మే. ఆడబతుకు గురించి ఎలా అంటున్నాదో చూడండి-

....బాబుగోరూ యింకో యినయం- అసలు మడిసి ఆడదై పుట్టకోడదండి. పుట్టినా ఉప్పరి కులంలో సత్తే పుట్టకూడదు. ఓ మూల కాపరం సక్కపెట్టుకుంటూ, మరో మూల పొద్దత్తమానం రెక్కలు ముక్కలు సేసుకొని తట్టలు మోత్తారండి మా ఆడోళ్ళు. నెలబు వింది ఇంకా పేపటికి పెసవిత్తుందన్న ఆడది ఆ స్సెణందాకా తట్ట మోత్తది బాబూ. అందుకే నెత్తిమీద గుడ్డసుట్ట తీసి సూత్తే మా ఆడోళ్ళకు ఎంట్రుకలుండవండి. బాబుగోరూ పనికోసం వొళ్ళు వంచుతారేకాని, సత్తే వొళ్ళప్పగించరండి.

ఈ ధర్మం, ఈ న్యాయం గుర్తించనందువల్లే కంట్రాక్టరు బామ్మరుదులు కర్చయిపోతూ వుంటారు.

ఎసరూ - అత్తిసరూ బ్రాహ్మణ కథ. భాస్కరం, కమల కొత్త జంట. వర్ధనమ్మగారు వర్ధనమ్మగారే. గోదాట్లో పుడకలు, కట్టెలు కర్రదుంగల్ని యేరి తెచ్చే సత్తిగాడు. నీళ్ళపొయ్యిలో కుంచం గిన్నెలో మరుగుతున్న ఎసరు. వీటితో విలియం సారోయిన్‌గాని, ఎర్నెస్ట్ హెమ్మింగ్‌వేకాని కథ రాయలేరు. రాస్తే ముళ్ళపూడి రమణ గారు రాయాలి, సీతారాముడు రాయాలి. ఎందుచేతనంటే వారెవరికీ గోదావరి లేదు. మాగాయపచ్చడి చెయ్యడం రాదు. నీళ్ళపొయ్యి మీద కుంచంగిన్నెలో ఎసరు పెట్టడం రాదు గనుక.

'పుల్లలుకొట్టుకు బతికేవోణ్ణి, నాకు పెళ్ళేటండి. అది నన్నుంచు కుందండి' అంటాడు ఓపెన్‌గా బామ్మగారితో సత్తిగాడు. ఈ కథ మధ్యలో ఉప్పుజాడీలో దాచేసిన బొంత అరిటిపండు స్టోరీ ఒకటుంది.

"ఇలా అన్నం అమ్మి పుల్లలు కొనడం మా యింటా వంటా లేదు" అంటుంది కమల. ఈ ప్రపంచంలోకెల్లా గొప్ప అనర్థం ఏవి

అంటే ఒకే కొంపలో ఒకే చూరుక్రింద వుంటున్నా ఒకరికొకరు యెంత మాత్రం అర్థం కారు. ఈ కథలోని సొగసులన్నీ యీ కథకు సీతారాముడు యిచ్చిన ముగింపులో వున్నాయి. ఈ కథ ఐహిక ఆముష్మికాలకు వంతెన.

'ఇదంబ్రాహ్మం' కథ గవర్మెంటు వారి అస్థి విమజ్జనం ఫార్సు మీద కొట్టిన బాణం. 'రాగిడబ్బు' కథ గోదార్లో డబ్బులెయ్యడం గురించిన సెంటిమెంటు మీద అల్లిన వినోదవల్లరి.

'ఆఫీసులో ఆవకాయ' కథ కూడా నేటి ఆఫీసుల పనితీరుమీద, ఆఫీసర్ల ప్రవర్తనమీద చిలికిన వ్యంగ్యం. ఇది గోదావరి కథల్లో యిట్టే కలిసిపోయింది- గోదావరి వాసనల కంటె ఆవకాయ వాసనలు ఎక్కువైనా.

ఎసరూ - అత్తెసరూ కథలో బామ్మగారు వండిన అన్నానికి జోడయిన మాగాయి పచ్చడిలా వున్నాయి బాపుగారు చిత్రించిన బొమ్మలు.

పాఠకులు సత్తిగాడిని చిన్నచూపు చూడకపోతే, యీ గోదావరి కథలు చదివాక బాపుగారి సాయంతో సీతారాముడి కథల వంటంతా జుర్రేసి గోదారంతా యీదేసినట్లుగా ఫీలవుతారు.

నేనొక సత్యాన్ని కనిపెట్టాను. ఈ కథలను సీతారాముడే రాశాడు. బి.వి.యస్. రామారావుగారెవరో నాకు తెలీదు. నమస్కారం!

— పురాణం సుబ్రహ్మణ్య శర్మ

13-3-'89
విజయవాడ

# ఇదీ వరుస...

# రాగిడబ్బు

ఆనాడుదయం

"ఏమండీ! లేవండీ! చూడండి-ఎంత పొద్దెక్కిందో."

"అబ్బ! వుండవే! ఇంకా తెల్లారందే!"

"ఇంకా నయం."

"అబ్బా! చలి........"

"ఛీ! పాడు. పరగడుపునే ఈ బుద్ధులేమిటండీ, నా జుట్టు రేపేస్తున్నారు.... అయ్యో, దుద్దులు గీ చేస్తున్నాయి. రాను రాను మీకు కుచ్చేష్ట లెక్కువయిపోతున్నాయి."

"అబ్బా!! కాఫీ!"

"సరే కాఫీ పట్టుకొస్తాను. మీరు నాకో హామీ ఇవ్వాలి."

"ఏమని?"

"మన అమ్మాయికి మూడు ముళ్ళు పడేదాకా మీరీ వ్యాపారానికి సెలవుపెట్టి, ఇంటిపట్టు నుంటానని."

"ఎందుకని?"

"ఎందుకేమిటండి? బోల్డు పనులుంటాయి."

"ఏమిటో? ఆ బోల్డు."

"శుభలేఖ లేయించాలి...."

"అవెప్పుడో ప్రింటయి, ఎడ్రస్సులతోసహా వున్నాయి. సాయంకాలం నీకు చూపించి, నువ్వెప్పుడు 'సై' అంటే అప్పుడు పోస్టులో వేయమని మన గుమాస్తాకు పురమాయించాను."

"బేండు, సన్నాయివాళ్ళని మాట్లాడాలి...."

"అడ్వాన్సులు కూడా యిచ్చేశాను."

"వంటవాళ్ళని కుదర్చాలి."

"కుదిర్చేశానుగా."

"విడిదీ అదీ ఏర్పాటు చెయ్యాలి. ఈ విశాఖపట్టణంలో ఇళ్ళు కూడా దొరకవు."

"అదుగో! ఆ ఎదురుగా వున్న కొత్త మేడంతా వాడుకోమని నాకు తాళాలెప్పుడో ఇచ్చేశారు."

"పందిళ్ళు, గట్రా వేయించాలి."

"సాయంత్రానికి వేయించమంటే వేయించేస్తాను. సరేనా!"

"అయ్యో రామ! అమావాస్య దాటనీయండి."

"మరైతే నన్నింట్లో కూర్చొని ఏంచెయ్యమంటావు?"

"మీకేం. మీరు మారాజులా ఫోన్లమీద పన్లు జరిపించేస్తారు. నాకెక్కడ తెములుతుంది. పసుపు కొట్టించాలి, అటుకులు దంపించాలి, సున్నిపిండి ఆడించాలి."

"నువ్వు 'ఊ' అంటే రేపీపాటికి అవన్నీ యిక్కడుంటాయి. నువ్వు అనవసరంగా హైరానా పడకు."

"అలాంటే ఎలాగండీ. ఒక్కగానొక్క కూతురు. దాని పెళ్ళికీ మాత్రం కష్టపడకపోతే ఎలా?"

"సరే కష్టపడు."



"మీకన్నీ వేళాకోళంగానే వుంటాయి. లగ్నం పట్టుమని నెల్లాళ్ళు కూడా లేదు. కుర్రాళ్ళిద్దరికీ ఉత్తరాలు రాసి కోడళ్ళిద్దర్నీ అమావాస్య వెళ్ళేక విదియనాడు పంపించమనండి."

"అమావాస్యనాకా ఎందుకు? దశమినాడే పంపించమని నిన్ననే ఫోన్లు చేశాను. సరేనా?"

"లగ్నం ముంచుకువస్తోంది. వియ్యాలవారికి లాంఛనాలు ముందుగా అందజేస్తే బావుంటుంది. వాళ్ళసలే మొహమాటస్తులు. పోనీ! మీరోసారి హైదరాబాదు వెళ్ళి వాళ్ళకి యిచ్చేసి రాకూడదూ."

"వెళ్తాను."

"ఎప్పుడు ?"

"ఇవ్వాళే."

"బజాయి."

"ఆ పేంటు జేబులో చూడు. టిక్కెట్టు రిజర్వు చేశానో, లేదో."

"వియ్యపురాలికి, ముగ్గురాడబడుచులకి లాంఛనాలు ఎంతిస్తే బావుంటుందంటావు?"

"అయిదువేలు."

"అదేం బావుంటుందండి. మన యిద్దరి కుర్రాళ్ళ పెళ్ళిళ్ళకి రెండు వేల అయిదువందల చొప్పున నాకు ముట్టాయి. మనం కూడా అంతే యివ్వాలి. వాళ్ళు ఎంతో మంచివాళ్ళండి. ఆ మాటకొస్తే వాళ్ళకింకా యెక్కువ ఇవ్వాలంటాను."

"సరే నీ ఇష్టం."

"అయినా ఇవ్వాళ ఆదివారం. మీకు బ్యాంకులో డబ్బెవరిస్తారు?"

"నిన్ననే డ్రాఫ్టు తీసుకున్నాను. చొక్కా జేబులో వుంది చూడు."

"ఇరవై వేలే!"

"వియ్యపురాలికి అయిదు, ముగ్గురాడబడుచులకీ మూడైదులు"

"ఏమండీ! మీది చాలా మంచి మనసండీ."

"…. …. …."

"ఛీ! వదలండి, పట్టపగలు మీ దగ్గరికి రావాలంటే భయంగా వుంది."

"మన అమ్మాయికి రాజాలాంటి సంబంధం దొరికింది."

"దానికేం లోటు. అందంలో నీ పోలిక, తెలివితేటల్లో నా పోలిక."

"అంటే నాకు తెలివితేటలు లేవనేగా మీ అర్థం."

"అంటే నేనందంగా లేననేగా నీ అర్థం."

"నేనలా అన్నానా!"

"పోనీ నేనలా అన్నానా!"

"అబ్బ! వుండండి. ఇన్నేళ్ళొచ్చినా మీ చిలిపిచేష్టలు పోనిచ్చుకోలేదు. ఎదిగిన ఆడపిల్ల యింట్లో వుంది."

* * *

"ఏ ట్రయిను కెళ్తారు."

"గోదావరి ఎక్స్‌ప్రెస్ సాయంత్రం అయిదు."

"అయిదుగంటలకి చవితి వచ్చేస్తుంది. మూడు గంటలకే బయలుదేరండి."

"అలాక్కానీ."

"అంత ముందుగా వెళ్ళి ఏంచేస్తారండి."

"అప్పుడు ఏంచెయ్యమంటావు?"

"మీ సామాన్లు సర్దుకోండి. ముందుగా 'నిష్యం' పెడతాను."

"అయితే ఇంకా బోల్డు టైముంది. ఇలారా."

"వద్దులెండి. రైల్లోకి ఏం వండమంటారు."

"పూర్ణంబూర్లు, రసగుల్లా, పాయసం, సంతర్పణకూర - పప్పు ధప్పళం వగైరాలు, మామూలే."

"బరాయి. కాస్త మజ్జిగపులుసు, పాటోళీ వండిస్తాను. కేరేజి మాత్రం మరిచిపోకుండా తెండి."

## ఆనాడు సాయంత్రం

"ఏవండీ! ఇవ్వాళ ట్రయిను చాలా రద్దీగా వుందండి."

"బెర్తు రిజర్వేషనుండగా ఎంత రద్దీగా వుంటే నాకేం."

"ఏవండీ! రైలు గోదావరి బ్రిడ్జి ఎక్కినపుడు, గోదాట్లో ఈ రెండు రాగిడబ్బులు పడేసి దండం పెట్టండి. మనకంతా శుభం జరుగుతుంది."

"ఎందుకూ? నా దగ్గర ఈ రూపాయి కాసు వుంది, ఇది పడేస్తా."

"ఇంకా నయం. డబ్బుంది కదా అని నోట్ల కట్టలు పడేస్తాననలేదు. గోదావరి తల్లికి రాగిడబ్బే వెయ్యాలి."

"రెండు రాగిడబ్బులు ఎందుకిస్తున్నావు?"

"మీరు విసిరినప్పుడు ఒకటైనా గోదావరిలో పడుతుందని."

"సరే! అలాగే! ఇంక నువ్వు ఇంటికెళ్ళు."

"ఏవండీ! మీరా బెర్తు మార్పించుకొని మరో బెర్తు అడిగి పుచ్చుకోండి."

"దానికేం లోయరు బెర్తు. బ్రహ్మాండంగా వుంటే."

"ఆ ఇద్దరు ఆడాళ్ళతోనూ మీరు ప్రయాణం చెయ్యడం నాకిష్టం లేదండి. చూడండి, మిమ్మల్ని నవిలేటట్టు ఎలా చూస్తున్నారో. పైగా మీ బెర్తుమీదే కూర్చున్నారు.

"వాళ్ళా ముసలాయనకి సెండాఫ్ ఇవ్వడానికొచ్చారు. నువ్వు ఇదై పోకు."

"అయితే మిగతా రెండు బెర్తులూ ఖాళీయేనా?"

"అవి అనకాపల్లి కోటా."

"అక్కడ ఆడాళ్ళు ఎక్కరని గేరంటీ ఏమిటి?"

"అంటే నీ ఉద్దేశ్యం ఆ ఆడాళ్ళని పట్టిగ్గా ఏదో చేస్తాననేగా."

"ఛ! ఏమిటా మాటలు. వాళ్ళే మిమ్మల్నేదైనా చేస్తారని."

"అంటే నే నొట్టి వాజమ్మననేగా నీ ఉద్దేశం."

"చూశారా! నేనలా అన్నానా!"

"సరే. నువ్వింటికెళ్ళు. నేను పోయి కూర్చుంటాను."

"ఉండండి. ఆ పిల్లల్నిద్దర్నీ దిగనీండి."

"పోనీ, నువ్వెళ్ళి వాళ్ళని దిగమను."

"ఏమండీ! ఆ ముసలాయన హైదరాబాదేనా, లేక మధ్యలో దిగి పోతాడా!"

"అనకాపల్లిలో యెక్కబోయే ఆడాళ్ళ మానాన్ని సంరక్షిస్తూ వాళ్ళని నా బారినుంచి తప్పించడానికి హైదరాబాదు దాకా వస్తున్నాడు. సరేనా!"

"పొండి. మీరు మరీనూ."

"ఆ రాగిడబ్బు మాట మర్చిపోకండేం. అది నాకు సెంటిమెంటు."

"ఎందుకు మరిచిపోతాను. నీ సెంటుమెంటు నా సెంటిమెంటు కాదా?"

"ఏవండీ. నన్ను చూస్తే ఒక్కక్షణం ఊరుకోలేరు. మరి మూడు రోజులు ఎలా వుండగలరండీ?"

"ఉండలేను. పెట్టె, బెడ్డింగు దించేసుకొని యింటికి పోదాం పద."

"అబ్బ మీకన్నీ వేళాకోళాలే."

"..... ..... ....."

"మీరు తింటే నిద్దరోతారు."

"..... ..... ....."

"రాగిడబ్బులు గోదాట్లో వేసేదాకా కేరీరు విప్పొద్దు."

"అసలు కేరీరే విప్పను, సరేనా."

"అలాగయితే ఆకలేసి, నీరసంవచ్చి నిద్దరోతారు. పోనీ ఆ ముసలాయన్ని జ్ఞాపకం చెయ్యమనండి."

"ఎవరు? ఆ మానసంరక్షకుణ్ణా?"

"నే నిందాకట్నించి చూస్తున్నాను, ఆ ముసలాయనంటే మీకు ఎందుకంత అక్కసు పాపం!"

"సర్లే, నేను గుడ్లప్పగించి చూస్తూ కూర్చుంటాను. బ్రిడ్జి రాగానే ఈ రాగిడబ్బులు రెండూ పడేసి నీ పేరుమీద దండం పెడతాను సరేనా?"

"ఏదో ఒక బ్రిడ్జి రాగానే ఇవి పడేసి మొక్కుబడి తీర్చేసుకుంటారు. నాకు తెలుసు."

"రాజమండ్రి స్టేషను దాటాక గోదావరి బ్రిడ్జెక్కి రైలు మోత ఎక్కించినపుడు, నడి గోదాట్లో ఇవి పడేస్తాను. ఒట్టు."

"మీవెళుతున్నది శుభకార్యం మీద. ఈ విషయంలో అశ్రద్ధ చెయ్యవద్దు."

"సిగ్నలు యిచ్చేశారు. వెళ్ళు."

"హమ్మయ్య. ఆ పిశాచాలు రెండూ దిగాయి. ఇంక మీరెళ్ళి కూర్చోండి."

"ఇదిగో.... మంచినీళ్ళ చెంబు, గ్లాసు, కేరీరు - అన్నీ బుట్టలో వున్నాయి. జాగ్రత్త!"

"త్వరగా వచ్చేస్తారు కదూ!"

".... .... ...."

"మీరు చేరగానే ఫోను చెయ్యండి."

".... .... ...."

"ఇదిగో నేను దిగడుతున్నా! గోడాట్లో రాగిడబ్బులు వేయడం మరచిపోవద్దు."

## ఆనాడు రాత్రి

"హలో! హలో!"

"ఎవరు?"

"నేనే! నీ మొగుణ్ణి."

"ఇందాకనే కదండీ ట్రయినెక్కింది. అప్పుడే హైదరాబాదులో ఎలా వాలారు?"

"నేను రాజమండ్రినుంచి మాట్లాడుతున్నాను."

"రాజమండ్రీనా!"

"అవును. నువ్వన్నట్లే జరిగింది. గోదాట్లో రాగిడబ్బ పడలేదు."

"మీరు రాజమండ్రి దాటకుండా గోదావరి ఎలా వచ్చిందండీ. ఇందులో ఏదో తిరకాసు వుంది."

"అబ్బ! చెప్పేది వినవే."

"నాకర్థమయిపోయింది. మీరేదో ఇలాంటిది చేస్తారని నాకు మొదట్నుంచీ అనుమానంగానే వుంది."

"నేను నిడదవోల్లో దిగి వెనక్కి వచ్చేశానే."

"ఎందుకుట పాపం?"

"రైలు లేటయింది. నాకు నిద్ర ముంచుకు వచ్చింది. బ్రిడ్జి మోతకు లేచి డబ్బు విసిరేద్దామంటే, ఆ ముసలి పీనుగ కిటికీ తలుపు లేసేసి మేకులు కొట్టేశాడు. ఎంతకీ ఊళ్ళేదు."

"డబాయించకండి. ముందర చెప్పండి. అనకాపల్లిలో ఎంతమంది ఎక్కారు?"

"ఇద్దరే."

"ఎన్నేళ్ళుంటాయి."

"పద్దెనిమిది, ముప్పైరెండు."

"యింకా ఎందుకు బుకాయిస్తారు- ఆ ముసలాయన్ని ఆడిపోసుకుంటూ?"

"ఏమిటే నువ్వనేది?"

"ఇంతకీ మీ పక్కనున్నది పద్దెనిమిదేళ్ళదా? ముప్పై రెండేళ్ళదా?"

"అబ్బా! వాళ్ళిద్దరూ మగాళ్ళే."

"నామీద ఒట్టే."

"ఒట్టు."

"మీకు చాలా బాధగా వుందికదూ."

"నీ బొంద."

"కిటికీ తలుపులు మేకులేస్తే, తలుపు తీసుకొని బయటి కిటికీలోంచి విసరవచ్చు కదా!"

"ఆ పనే చేశా! అప్పటికే గోదావరి దాటేసి గట్టు వచ్చేసింది."

"పోనీ తిరుగు ప్రయాణంలో వెయ్యొచ్చుకదా."

"ఏమో! నువ్వన్నిసార్లు గుచ్చి గుచ్చి చెప్పావు. నేనేదో సెంటిమెంటుగా ఫీలయ్యాను. నిడదవోల్లో రాజమండ్రి వెళ్ళే ట్రయిను సిద్ధంగా వుంటే ఎక్కేశాను."

"ఉద్ధరించారు. మీ మకాం ఎక్కడ?"

"అప్సరా హోటల్, రూమ్ నంబరు—101."

"హోటలా! తలుపులు గట్టిగా బిగించుకోండి. ఫేను వేసుకోవద్దు. మీకిట్టే జలుబు చేస్తుంది. రేపుదయమే ఫోనుకొట్టి లేపుతాను."

"ఎక్స్టెండ్ ప్లీజ్."

"ఇంకా యేమిటండీ అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలు."

"ఏదో ఒకటి మాట్లాడవే, నాకు నిద్దరట్టేదాకా."

"గోదావరిలో రాగిడబ్బు యెప్పుడేస్తారుట?"

"పొద్దున్న లేచీ లేవడంతో ఆ పని చేసి ఊస్టుకోస్టు యెక్కేస్తా."

"పాటోళీ పూర్తిగా తిన్నారా?"

.... .... ....

"మజ్జిగ పులుసులో ఉప్పు తక్కువైనట్టు వుంది. విడిగా పొట్లంలో కట్టి వుంచా, వేసుకోలేకపోయారా?"

.... .... ....

"ఇదిగో, మిమ్మల్నే .... ఇంతలోనే మొద్దునిద్ర .... మిమ్మల్నే.. ఫోను పెట్టేస్తున్నాను."

## మర్నాడుదయం

"హలో! హలో!"

"నేనే నే."

"ఏవండీ! నిజంగా మీరు మీరేనా?"

"ఒట్టు-నీతోడు."

"హమ్మయ్య, పొద్దుట్నుంచి ఎంత కంగారు పెట్టేశారండి. ఇది మూడోసారి మీకు ఫోను చెయ్యడం. అసలు మీరు బయటికెందుకెళ్ళారు?"

"ఎందుకేమిటీ? గోదాట్లో స్నానం చెయ్యడానికి, బ్రాహ్మడిచేత సంకల్పం చెప్పించుకొని, నువ్విచ్చిన రాగిడబ్బులు పడేసి దండం పెట్టడానికి."

"ఇంకా నయం. రాత్రికి రాత్రి మీరు ఏ టాక్సీయో కట్టించుకొని నిన్నటి పాపిష్టి రైలును బెజవాడలో పట్టుకొని యెక్కేశారేమోనని ఎంతో భయపడిపోయాను. మీరెంతకేనా సమర్థులు."

"ఇంతకీ యేమైందే?"

"ఏమవటమేమిటండీ? మీరు రేడియో వినలేదా?"

"లేదు."

"నిన్న మీరెక్కిన్న రైలు, కాజీపేట ఇవతల గూడ్సుబండిని ఢీకొట్టి తిరగబడిందట. అందులోని ప్రయాణీకులు బతికి బట్టకడతారన్న నమ్మకం లేదట."

"అయ్య బాబోయ్."

"అవునండి. ఆ గోదావరి తల్లే మిమ్మల్ని రక్షించింది."

"కాదే! నీ సెంటిమెంటే నన్ను కాపాడింది."

# ఎసరూ – అత్తెసరూ

గోదావరిగట్టు. ఆ గట్టు నానుకొని ఒక వీధి. ఆ వీధిలో ఒక చిన్న పెంకుటిల్లు. ఆ యింట్లో వర్ధనమ్మ అనే ఒక బామ్మగారు. ఆ బామ్మగారికి భాస్కరం అనే వారసుడు. ఆ వారసుడికి కమల అనే ఇల్లాలు.

నాలుగు రోజుల ముసురు తర్వాత తొలిపొద్దువేళ.

'వర్ధనమ్మగోరూ! వర్ధనమ్మగోరూ!' ఇంకా పూర్తిగా తెల్లార కుండానే ఎవరిదో పిలుపు.

"మీ బామ్మగారి నెవరో పిలుస్తున్నట్టున్నారు" అంటూ భర్తను లేపింది కమల.

"అబ్బా! నువ్వే లేపవే" వళ్ళు విరుచుకొని ముసుగు మరింత బిగించాడు భాస్కరం.

"పవగడుపునే బోడి మొహం ఎలా చూడనంటీ. మీరే లేపండీ."

పెంచి పెద్దచేసి ఓ ఇంటివాడిని చేసిన బామ్మను నిన్నగాక మొన్నొచ్చిన ఇల్లాలు బోడిమొహం అన్నందుకు మనస్సు చివుక్కుమంది భాస్కరానికి.

"వర్ధనమ్మగోరూ! వర్ధనమ్మగోరూ!"

"ఎవరువారూ" అంటూ వర్ధనమ్మ పలికింది ఈసారి. తన స్థూల

కాయాన్ని అదపులోనికి తెచ్చుకొని కిటికీకేసి జరిగి చిడతను తప్పించి ఓ రెక్కను మెల్లిగా తెరచింది వర్ధనమ్మ.

కిటికీకి అడ్డు తగిలి "మామ్మగోరూ" అంటూ మళ్ళీ పిలిచాడు సత్తిగాడు.

"ఒరి నువ్వట్రా సత్తిగా."

"అదేంటి మామ్మగోరూ ఇంకా తొంగున్నారు. లెగండి గోదారి పొంగేసినాది. వడి మంచి పోటుగా వుంది."

"అలాగట్రా. అడ్డులే. ఏసీ చూడనీ" అంటూ కిటికీ రెండోరెక్కని ఛళ్ళున తెరిచింది.

గోదావరి నురగలతో గలగలమంటూ పరవళ్ళు తొక్కుతోంది. దూరాన్నించి ఆనకట్ట హోరుకు సాయం. గాలి హోరు తోడై చెవులు గింగిర్లెత్తిస్తున్నాయి. గోదావరంచున దూరంగా ఉదయసూర్యుని తొలికిరణాలు కాంతిని పుంజుకుంటున్నాయి. వర్ధనమ్మకి కళ్ళు మెరిశాయి.

"ఒరే పుల్లలేమైనా కొట్టుకొచ్చాయిరా గోదాట్లో."

"అందుకే కదమ్మా నేనొచ్చింది. జాలరి పేట జనమంతా తెప్పలిచ్చుకొని ఏట్లోకి దూకేశారు. సుక్కపొడవకుంటా ఆరు నేరేడు దుంగల్నె, మూడు మద్ది దూలాల్ని అంకాలమ్మ రేవుకాడికి సేరేశారు. తుమ్మమోళ్ళ సంగతి సెప్పనేక్కర్లేదు. బొడ్డూడని కుర్రనాయాళ్ళు సైతం కర్రకి దొంకిణీ కట్టి లాగేత్తున్నారు"

గోదావరికి వరదొస్తే చాలు వర్ధనమ్మకి కాళ్ళు నిలబడవు. వరదలో కొట్టుకువచ్చే కంప, కలపనీ ఈది పట్టుకోడానికి కూలీల్ని పురమాయించి ఏడాదికి సరిపడే వంటచెరకు చేరేసుకుంటుంది. పొద్దున్నే ఓ కుంచెడు బియ్యంవార్చి పాతచింతకాయో, మాగాయి పచ్చడో వేసి కూలీలకి పెట్టడం, వాళ్ళు ఈది పట్టిన దుంగల్ని గట్టుకు చేరెయ్యడం, వాటిని నరికించి పెర

ట్లోకి సర్ధించడం పవదరోజుల్లో ఆవిడ వ్యాపకం. కిరాయి ఎంత యిస్తే అంత పనిపెట్టుకోడం కూలీలకు రివాజు.

"నాకసలు డబ్బేవద్దు. సందేశే మరోసారి వేడిగా వట్టెడన్నం పెడితే చాలు" అనే వాళ్ళలో సత్తిగాడొకడు.

"మామ్మగోరూ! అన్నం యేడిగా వండండి. మాగాయి పచ్చడి వద్దే సెయ్యండి. తినేసి గోదారంతా ఈదేత్తాను. ఈలోగా రేవుకాడకెళ్ళి కాత్త పుక్కిలించి వచ్చేత్తాను. ఈ ఏడు చింత, తుమ్మ కాకుండా టేకు, ఏగిస మీ పొయ్యిలో మండాల" అంటూ మెరుపులా మాయమయ్యాడు సత్తిగాడు.



[illegible] నాలుగు రోజులుగా ముసురు మరుగునపడి పొద్దు నియమంగల తనని పస్తులుపెట్టిన సూర్యభగవాన్ణ్ణి కోపంగా చూసి వాలాయితీగా ఓ దండం పెట్టి గుడికేసి తిరిగి శిఖర దర్శనం చేసుకొని ఆ చేత్తోనే మరో దణ్ణం పెట్టి కార్యాచరణ కుపక్రమించింది వర్ధనమ్మ.

* * *

నీళ్ళపొయ్యి అంటించడానికి పెరట్లోకి వస్తున్న కమల గుమ్మంలోనే ఆగిపోయింది ఆశ్చర్యంగా. ఇన్నాళ్ళూ చిందర వందరగా వున్న పెరడు అద్దంలా అలకబడి వుంది. నీళ్ళ పొయ్యిమీద కుంచం గిన్నెలో ఎసరు మరుగుతోంది.

వర్ధనమ్మ కూనీరాగాలు తీస్తూ మానేడు బియ్యం ఎసట్లోకి దేపు తోంది. "నాలుగురోజుల ఉపవాసం బాపతు తిండి ఇప్పుడొక్కసారే లాగించేస్తుంది కామోసు ఈవిడ" అని దవళ్ళు నొక్కుకొని చటుక్కున గదిలోకి వెళ్ళిపోయింది కమల.

నీళ్ళకోసం పంపుంపుల్లను నవులుస్తూ పెరట్లోకి అడుగుపెట్టిన భాస్కరం కూడా ఆశ్చర్యపోయాడు- బామ్మ యింత పెందరాళ్ళే స్వయం పాకంలోకి దిగినందుకు.

"అవును పాపం. నాలుగు రోజులుగా వస్తుంది. ఆకలి వెయ్యదూ మరి" అని జాలిపడి "బామ్మా! అసలే నీరసించిపోయావు. ఇవ్వాళ కూడా స్వయంపాకం దేనికి. కమలచేత మడికట్టించి యింత అత్తెసరు వేయించుకో కూడదా? ఎంతని కష్టపడతావు" అన్నాడు.

ఈ మాటలు విన్న కమల అదిరిపడింది- చలిలో తనెక్కడ తల తడుపుకోవలసి వస్తుందోనని. పైగా ఆ కుంచం గిన్నె తనెక్కడ వార్చాలో నని మొగుడి పురమాయింపులకు చివాట్లు వెయ్యడంకోసం "ఏమండీ! ఇలా రండి, కాఫీ చల్లారిపోతోంది" అని కేకేసింది కమల- ఇంకా కుంపటికూడా అంటించకుండానే.

* * *

"మామ్మగోరూ!" అంటూ రెండుబారల అరిటాకు కోసుకొని పెరట్లో సిద్ధమయ్యాడు సత్తిగాడు.

"ఒరే ఒక్కనిమిషం కూర్చో. అన్నం వారుస్తాను" అంటూ పొయ్యిదగ్గరికి వెళ్ళింది వర్ధనమ్మ.

మరుక్షణంలోనే మాగాయి పచ్చడితోబాటు సెగలుకక్కుతున్న వేడి వేడి అన్నాన్ని గిన్నెలో సగానికి పైగా విస్తట్లో గుమ్మరించింది.

ఆవిరి సెగకు ముఖం దగ్గరగా వుంచి అన్నంబాపతు ఘుమఘుమని ఒక్కసారి పీల్చి ఆవురావురుమంటూ ముద్దను నోట్లో కూరుకొని "మామ్మ గారూ! మీ చేతిముద్దకోసం గోదారితల్లి ఎప్పుడు పొంగుద్దా అని కాసు కూర్చున్నాను" అన్నాడు దెక్కుతూ.

"ఒరేయ్! నెమ్మదిగా తిను. ఇంకా కావలసినంత వుంది" అంటూ నీళ్ళచెంబు సత్తిగాడి పక్కనవుంచి వాడికెదురుగా చతికిలబడింది.సత్తిగాడు తల ఎత్తకుండా విస్తట్లో సరుకు లాగించేస్తున్నాడు.

"ఆ కరుడలా పక్కకు లాగు. ఇంకాస్త అన్నం వడ్డిస్తా" అంటూ గిన్నెను పూర్తిగా వంచేసి పచ్చడి మారొడ్డించింది వర్ధనమ్మ.

సత్తిగాడు ఆకు మధ్యకు అన్నాన్ని ఠాపీగా దేవుకొని మఠం మార్చి దూకుడు తగ్గించి చిన్నముద్దల్లోకి దిగాడు.

"అదేమిట్రా. అన్నం పారేస్తావా ఏమిటి?"

"సచ్చినా పారెయ్యను. ఈ రుచి సానాసేపు నాలికమీద వుండాలని నెమ్మదిగా తింటన్నానమ్మా"

"ఒరేయ్ ఘత్తాయాసంగా వుంటే అరుగుమీద కూర్చొని కాస్సేపు పోయాకే వెళ్ళి ఈదు. పుల్లలు ఇవ్వాళకాపోతే రేపేరుకోవచ్చు"

"తిండానికి నాకాయాసమేటి తల్లి! ఇంకో ఇంత తినెయ్యగలను. ఆ సత్తుగిన్నెలో ఏముంది?"

"వార్చిన గంజిరా"

"అదికూడా ఇల్లా ఇచ్చేయండి. కాసింత ఉప్పేసుకుని తాగేత్తాను"

"మా నాయనే, మానాయనే. ఉండు ఉప్పు తెస్తాను" అంటూ భారంగా లేచి వంటింటికేసి వెళ్ళింది.

* * *

వంటింటి వసారాలో కమల ఏం వండాలో తేల్చుకోడానికి కూర గాయల బుట్ట ముందేసుకుంది. అందులో రెండరటికాయలు దోరగా ముగ్గు న్నాయి. "ఇవి ముసలావిడ కంటపడితే ఏ దారినపొయ్యే దానయ్యకో ఇచ్చేస్తుంది" అని భయపడి ఆ రెండు బొంతరటి పళ్ళూ చటుక్కున ఉప్పు జాడీలో పడేసి వచ్చి కూర్చుంది.

వర్ధనమ్మ కాళ్ళేడ్చుకుంటూ వంటింట్లోకి వచ్చి జాడీలో చెయ్యి పెట్టింది. చేతికి మెత్తగా ఏవో తగిలితే తీసి చూసింది. అవి బొంతరటి పళ్ళు. "సత్తిగాడు యింకా ఆకలితో వున్నాడు. వాడికిప్పుడో వేసి మరోటి సాయంత్రం పెట్టచ్చు. అయినా యివి ఈ ఉప్పుజాడీలో పడేసుకుంటారా. తెలివి" అని విసుక్కొని ఓ పండు పుచ్చుకొని మరో పండు బియ్యం డబ్బాలో పడేసి చారెడుప్పు తీసుకొని పెరట్లోకి నడిచింది.

సత్తిగాడు ఆఖరి ముద్దకు రాగానే "ఒరేయ్ ఇది కూడా తిను" అంటూ బొంతరటిపండుని విస్తట్లో పడేసింది.

"బొంతరటిపండే. అయ్యబాబోయ్ ఇదంటే నాకెంతో ప్రాణం" అంటూ దాన్నందుకున్నాడు సత్తిగాడు.

"ఒరేయ్ సత్తిగా, ఆయనక్కూడా యిదంటే ఎంతో ఇష్టంరా"

"ఎవరండీ, భాస్కరం బాబుకా?"

"కాదురా ఆయన."

"హో. పోయిన పెద్దాయనా?"

"ఛ. నీ మొహం. ఆయన పెద్దాయనేం కాదు. చాలా చిన్న వయస్సు"

"నా వయస్సుంటదాండి"

"నీ వయస్సు పాతిక వుండదూ? నీకన్నా నాలుగేళ్ళు తక్కువే! కండలు తిరిగిన శరీరంతో పుష్టిగా వుండేవారు."

ఇంత ముసలావిడకి అంత చిన్నోడితో పెళ్ళేంటి అనిపించింది. "ఆరు మిమ్మల్ని బాగా చూచుకునేవారా" అని పరామర్శించాడు.

"నన్నొక్క క్షణం కూడా వదిలిపెట్టేవారు కాదురా. ఎప్పుడూ నా కొంగట్టుకే తిరిగేవారు" అంది కంటతడి తుడుచుకుంటూ. "ఏరా! ఇంకో పండు తింటావట్రా!"

"వద్దమ్మా. ఆ ఉప్పు కొత్త గంజిలో యేసియ్యండి తాగేత్తాను."

గంజిగిన్నె ముందుకు నెట్టింది.

గిన్ని చప్పరిస్తూ "మామ్మగారూ! ఎన్నాళ్ళకో ఇలా కడుపునిండా తిన్నా. ఇయ్యాల సూడండి గోదారంతా గాలించి మీ జన్మలో యింక పుల్లల్ని కొనక్కర లేకుండా చేత్తాను" అంటూ గంజిని గడ గడ తాగేశాడు.

"ఏరా. మీ అమ్మ కూడు సరిగా పెట్టడం లేదేమిట్రా."

"ఇంకెక్కడమ్మ తల్లి! నన్నీదిలో వదేసిపోయింది."

"మరి నువ్వెక్కడుంటున్నావు?"

"పైడమ్మతో."

"ఎవరూ! ఆ పిడకలమ్మకునే పైడమ్మా? దాన్ని చేసుకున్నావా?"

"పుల్లలు కొట్టుకు బతికేవోణ్ణి, నాకు పెళ్ళేటండి. అది నన్నుంచుకుందండి" అన్నాడు సిగ్గుతో.

"ఓరినీ! నీకన్నా రెట్టింపేళ్ళుంటాయి దానికి. ఇదేం పొయ్యే కాలంరా?"

మేమిద్దరం యిట్టపడితే మద్దిన ఈవిడకెందుకు అనుకొని వెకిలిగా నవ్వేసి, మడిచిన ఆకుని చేత్తో పట్టుకొని వీధితలుపుకేసి చెంగున గంతేసి మాయమయ్యాడు సత్తిగాడు.

వాడి అమాయకత్వానికి జాలిపడింది వర్ధనమ్మ.

*  *  *

"ఉప్పు జాడీకోసం వెళ్ళింది ముసల్ది. అరటిపళ్ళు కాజేసిందేమిటి చెప్మా" అని జాడీలో చెయ్యెట్టి తడిమింది కమల. అనుకున్నంతా జరిగినందుకు దీని శిగతరగా అనుకొని దీని శిగెప్పుడో తరిగేశారు అని గుర్తొచ్చి మనసులోనే మరేవో తిట్టుకుంటూ అత్తిసరుకు బియ్యం కోసం బియ్యపుడబ్బాకేసి తిరిగి దానికి మూత లేకపోవడం చూసి "అసలే ఇల్లంతా ఎలకల మయం. ఈ ముసల్ది మూతలన్నీ గడియ గడియకీ తీసిపడేస్తుంది" అంటూ డబ్బాలో చెయ్యెట్టి ఏదో మెత్తగా తగిలితే అది కదిలినట్టుగా భ్రమ కలిగి ఎలకేమోనని భయపడి కెవ్వున కేకేసి ఎగిరి గంతేసింది కమల.

కమల కేకవిన్న భాస్కరం వీధి అరుగుమీంచి వంటింటి వసారాలోకి ఎకాఎకీ దూకాడు. వర్ధనమ్మ కూడా కంగారుగా వచ్చింది. ఏమైందర్రా అంటూ భాస్కరం అసలు విషయం తెలుసుకోకుండానే చిందులు తొక్కేస్తూ కంగారుపడుతున్నాడు. భాస్కరం కంగారు చూసి "ఏమిట్రా, చింబోతులా. ఏమైందంటే పలకవే" అని గొంతుకు చించుకొంది బామ్మ.

బామ్మ చింబోతు అన్నందుకు కాదుగాని, పెళ్ళాం విన్నందుకు కోపమొచ్చింది భాస్కరానికి. చిరాకు ఒక్కసారిగా కట్టలు తెంచుకోగా పంకలేనమ్మ డొంకట్టుకు వేళ్ళాడినట్టు "ఏమిటి బామ్మా, అడ్డగాడిద లందర్నీ పిలిచి సంతర్పణ చేస్తున్నావు. దున్నపోతులా వున్నాడా సత్తిగాడు. వాడికి వండి ఎందుకు పెట్టించావ్" అని కేకలేశాడు భాస్కరం.

"వాడేం అప్పనంగా తింటంలేదు గద్రా, కూలి డబ్బులు బదులు ఇన్ని మెతుకులు పడేస్తే ప్రాణాలకు తెగించి గోదాట్లో ఈది మనకి ఏడాది పొడుగునా సరిపడే వంటచెరకు లాక్కొచ్చి పడేస్తున్నాడాయిరి."

"అయినా రూపాయి పడేస్తే బండెడు పుల్లలొస్తాయి. వాటికోసం ఈ ఎడ్డిచాకిరీ ఎందుకు మధ్య?"

"రూపాయికో మోపు కూడా రాదురా నాయనా! నువ్వు కొనడం మొదలెడితే ఇంతోటి నీ రెండొందల జీతం పుల్లలకే సరిపోదు."

"ఇలా అన్నం అమ్మి పుల్లలు కొనడం మా యింటావంటా లేదు" అని చెప్పి పొడిచింది కమల.

ఆ మాటలను విన్న భాస్కరానికి మరింత అహం తలకెక్కి- "చెప్తే వినవూ. నీకు తోచదు. కావలసిన పుల్లలు డబ్బిచ్చి కొనచ్చులే" అంటూ విరుచుకుపడ్డాడు.

"నే పోయాకలాగే చేద్దువుగాన్లే నాయనా!" అంటూ వీధిలోకి నడిచింది వర్ధనమ్మ.

వర్ధనమ్మకు మనస్సు కష్టపడినపుడల్లా రేవుకేసివెళ్ళి గోదావరిని చూస్తూ కూర్చొంటుంది. చల్లని గోదావరి ఇట్టే ఆమె మనస్సును కుదుట బరుస్తుంది. అలా ఎన్నో ఏళ్ళుగా భరింపలేని కష్టాల నెదుర్కొనే శక్తి ఆమెకు ఆరు పుష్కరాలుగా ఆ గోదావరే యిచ్చింది.

పొద్దుట్నించీ వంట చెరకు వ్యాపకంలో క్షణం తీరిక లేకుండా హైరాన పడడంతో మరింత అలసి తులసికోటకు జేరపడింది వర్ధనమ్మ. ఎసట్లో తనకో గిద్దెడు బియ్యం పడేసుకోడానికి కూడా ఓపిక లేకపోయిందావిడకి.

"వర్ధనమ్మగోరూ!" అంటూ పెరటి తలుపు తట్టింది పైడమ్మ.

"తర్వాత రావే మడిగట్టుకున్నాను"

"తెల్లారనగా పోయాడా సత్తిగాడు. నాలుగు రోజులనించి లంఖ జాలతో మంచాని కంటుకుపోయినోడు. నిన్న రాత్రే కాత్త జొరం తగ్గి మణిసయ్యాడు.

ఆ మాటలను విన్న వర్ధనమ్మ సమాధానం చెప్పడానికి కూడా ఓపికలేక చెపులప్పగించి వూరుకొంది.

"మామ్మగారి కాడకెళ్ళి కాసింత ఊరగాయ పట్రావే. నోరు చేదుగా వుంది అని రాత్రంతా ఒకటే గోలెట్టాడమ్మా. ఈడక్కాని వచ్చాడా అని సూసిపోడానికొచ్చాను. కాసింత ఊరగాయ పెట్టు తల్లీ మళ్ళా వత్తాను" అని వెళ్ళిపోయింది పైడమ్మ.

"అన్నప్రాసననాడే అర్ధశేరు బియ్యం తినిపించినట్లు పత్యంరోజునే అడ్డమైన తిండీ వాడిచేత తినిపించాను. వాడికేం బెడిసికొట్టదు గదా" అని కాస్త ఇదయింది వర్ధనమ్మ "నాకా విషయం ముందుగా తెలిస్తేకదా బాధ పడవలసింది" అని సరిపెట్టుకుంది. తన చేతి పట్టెడు మెతుకులకోసం ఇన్ని లంకణాలు చేసి కూడా సాహసించి గోదాట్లో ఈదడానికి సిద్ధమైనాడు. పాపం అని జాలిపడింది "ఓపిక లేకపోతే వాడు ఎందుకు ఈత్తాడు. నరు ధోకాయిచ్చి ఎక్కడో ఊరేగుతూ వుంటాడు. చచ్చినాడు" అని నిర్ధారణ చేసుకొంది. "వెర్రిబాగులాడు నిజంగా ఈదడానికి పోయాడేమో అప్రదిష్ట" అనుకొని అనుమానం పడింది. ఆ అనుమానం కాస్తా భయంగా మారింది. ఏదో కీడు శంకించి ఆందోళన పడసాగింది.

సత్తిగాడు గోదావరి ఒడిలో ఎదురీదడం, దూకుడుగా వస్తున్న దుంగను పట్టుకోవడాని కష్టపడ్డం, అమాంతం నీరసం ఆవహించి ఈద లేకపోవడం, దుంగ బలంగా సత్తిగాడిని ఢీ గొట్టడం, ఆ దెబ్బతో సోషొచ్చి వాడు నిలువునా మునిగిపోవడం, ఈ చావుకు కారణం నువ్వే

ఊరటూ వూరంతా నిలదీయడం, పైడమ్మ శాపనార్థాలూ, భాస్కరం కమలతి దెప్పి పొడుపులూ వంటి వూహలు మనస్సులో పదే పదే తరంగాల్లా మెదలసాగాయి.

"వాడు నిజంగా ఈతకెళ్ళాడేమో పాపం. వాడిని ఆపకపోతే నిష్కారణంగా ఓ నిండు ప్రాణాన్ని తీసిన దాన్నవుతాను" అని కంగారుగా ఉన్న ఓపికను కూడగట్టుకుంటూ పెరటి తలుపు తీసి గోదావరొడ్డుకేసి నడచింది.

కుండపోతగా కురిసిన వర్షానికి అడుసు దిబ్బలా తయారైన గట్టు మీద కాలుతీసి కాలెయ్యడమే కష్టంగా వున్నా, గోదావరంతా కలయజూస్తూ బరువుగా శరీరాన్ని గట్టమ్మట నడిపించసాగింది వర్థనమ్మ.

గోదావరిలో కొన్ని వందలమంది పుల్లలకోసం ఈత్తున్నారు. ఎవడ్ని చూసినా సత్తిగాడిలాగే కనపడ సాగాడు వర్థనమ్మకి. 'సత్తిగా' అంటూ గొంతుక చించి అరుచుకొంటూ సత్తిగాడికోసం దేవురించసాగింది.

అలా గంటలు గడిచాయి. సత్తిగాడెక్కడా కనపడ్లేదు. వాడు గోదాట్లో మునిగిపోయాడని నిర్ధారణ చేసుకొంది. సర్వం కోల్పోయిన దానిలా, నిస్పృహా, నిరాశ ఆవరించి తిరుగుముఖం పట్టింది.

గోధూళివేళ కావస్తోంది. పొద్దు వాలిపోతోంది. బామ్మగారి నవనాడులూ పట్లు తప్పాయి. నోరు పిడచకట్టుకుపోయింది. కళ్లు పైర్లుకమ్మాయి. భారంగా పాదాలు ఇంటికి లాక్కొచ్చాయి. మనసు మనసులో లేదు.

"మామ్మగారూ! చూశారా ఎంత పెద్ద మద్దిమంగని పట్టుకున్నానో" అన్న సత్తిగాడి కేకకు ఈ లోకంలో పడింది వర్థనమ్మ.

నవ్వుతూ తనవైపుకి వస్తున్న సత్తిగాడ్ని కన్నీటి పొరకుండా చూసింది. నవనాడులూ జలదరించాయి. సంతోషం, దుఃఖం ఒకేసారి ఉప్పె

నేలా పొంగాయి. బరువైన దిగులు దూదిపింజలా ఎగిరిపోయింది. మనస్సు తేలిక పడింది. వణుకుతున్న చేతులతో సత్తిగాడి తల నిమిరింది.

"ఏమైందే బామ్మా" అంటూ అరుగు దిగాడు భాస్కరం.

"మామ్మగారూ! మీరు బేగా యేడన్నం పెట్టాలి. నేనీలోగా ఈ చిన్న పేళ్ళను నరికేత్తాను" అన్నాడు సత్తిగాడు.

తల వూపి కొంగుతో కళ్ళ నీళ్ళొత్తుకుంటూ యాంత్రికంగా పెరట్లోకి నడిచింది.

"అయ్యగోరూ! ఈ దుంగిస్తే షావుకారు రెండొందలిస్తానని అటకాయించబోయాడు. బామ్మగారి చేతి వణ్ణంముందు అదో లెక్కా."

ఈ మాటలు విన్న భాస్కరానికి మతోయినట్టయింది.

* * *

పేళ్ళను నరికి, కుప్పగా పోగేసి చెమటొత్తుకుంటూ పెరటి గుమ్మం కేసి నడిచాడు సత్తిగాడు.

పెరట్లో తులసికోట వారే చెంపచరచుకొని పడుకునుంది పద్దనమ్మ.

పొయ్యి మండుతోంది. ఎసరు అత్తిసరై ఇగిరి మాడుతోంది.

"మామ్మగారూ!" అని పిలిచాడు సత్తిగాడు. మళ్ళీ పిలిచాడు. మళ్ళీ పిలిచాడు. మళ్ళీ మళ్ళీ పిలిచాడు.

గంగా భాగీరథీ సమానురాలైన పవ్వత పద్దనమ్మ శాశ్వతంగా కన్ను మూసిందని ఇరుగు పొరుగువారు నిర్ణయించినదాకా సత్తిగాడు కాని, భాస్కరంకాని నమ్మలేదు.

ఆనాడు జేబులో పైసాలేని భాస్కరంచేత ఆ దుంగ నమ్మగా వచ్చిన రెండొందలతో సత్తిగాడు కొట్టిన కట్టెపేళ్ళే చితిని పేర్చింపాయి అంత్యక్రియలకి.

# తిప్పలు

తిప్పలు....తిప్పలు....తిప్పలు. ఎటు చూసినా తిప్పలు.

గోదావరి పొడుగునా తిప్పలు—ఇసుక తిప్పలు, గోదావరికి వరద లొస్తే చాలు ఇసుక మేటలు పేరుకుపోతాయి.

ఏటేటా ఈ మేటలు ఇంతింతవి అంతంతై పర్వతాల్లా ఎదిగిపోతాయి.

అందుకే ఎగువ గోదావరి చూడ్డానికి దిగుడుబావిలా వుంటుంది.

నిర్మాణాలకి ప్రశస్తమైన గండ్రు ఇసుక దొరికే తిప్పలు గట్టు పొడుగునా కోకొల్లలు.

ఈ తిప్పలు తవ్వి ఇసుక ఎగుమతి చేయడం ఏటి పట్టున సాగే వ్యాపారాల్లో కల్లా గొప్పది. కాంట్రాక్టర్లు పోసేపత్రే పనుల్లోకెల్లా పెద్దవి.

అలాంటి వ్యాపారం చేస్తున్న ఓ కంట్రాక్టరు ఇసుక తవ్వకం పనీ బాపతు అజమాయిషీని తన బావమరిదికి అప్పగించాడు- అచ్చోసిన ఆంబోతులా తిరుగుతున్న జులాయి వెధవని దార్లోకి తీసుకురావడంకోసం.

దాంతో తన బావగారి నుద్ధరించడానికి ఉప్పరి బంటా [ముఠా]లని వేయి కళ్ళతో అజమాయిషీ చేయడాని కుపక్రమించాడు- కంట్రాక్టరు బావమరిది గట్టువార నీడలో కూర్చుని.

పక్కనే బంటా [ముఠా] మేస్త్రి వెంటిపూల కొలత కర్రను చంకలో పెట్టుకొని గోతికాడ నక్కలా కూర్చున్నాడు- నుంచున్న పళంగా కొలతలను కొలిపించుకుని బట్వాడా తీసుకోడానికి.

ఆడ, మగ వావి వరస లేకుండా బంటా జనానా కిటకిటలాడుతూ కుప్పంతా కప్పేసి ఇసుకను కసకసా తవ్వేస్తూ లారీకి చకచక ఎగుమతి చేస్తోంది.

"మనిషన్నాక కాస్త కళాపోషణ ఉండాలి" అన్న డైలాగు గుర్తు కొచ్చింది కంట్రాక్టరు బావమరిదికి. ఆ డైలాగే పైకనేశాడు యథాలాపంగా- బంటా బాపతు ఆడ జనాభాలోని ఒక పడుచుపిల్లకేసి దృష్టి సారిస్తూ.

"సిత్తం!" అన్నాడు బంటా మేస్త్రి వినయంగా విషయం అర్థం కాకపోయినా.

తట్టను లారీలో దిమ్మరించి, ఖాళీ తట్టను నేలకేసికొట్టి దులిపి, వెదురు దండేలకు కట్టిన గుడ్డ ఉయ్యాలల బాపతు తడపలను వరుసగా లాగి ఊగుతున్న ఉయ్యాలలలోని పసిపిల్లలను పలకరిస్తూ, కిలకిలమంటూ బంటాకొలెం చేరింది ఆ పడుచు పిల్ల.

తుమ్మమొద్దులాంటి ఓ గోచీరాయుడు పళ్ళికిలిస్తూ తట్ట లాక్కుని పారకొట్టి పూటుగా నింపేసి ఆ పడుచుపిల్ల నెత్తి కెక్కించాడు పరాచకా లాడుతూ.

'ఆ దున్నపోతుకా ఈ పిల్ల జోగ్!' కోపం ముంచుకొచ్చింది కం॥ బా॥ కి.

"కాకిముక్కుకి దొండపండు" అని మండిపడ్డాడు.

కం॥ బా॥ కి కోపమొచ్చినా, తాపమొచ్చినా మెదడు మొద్దుబారిపోయి మనసు ఆదోలా ఐపోతూ ఎక్కడికో పోతుంది. మరుక్షణం ఆ దున్నపోతులోకి పరకాయ ప్రవేశం చేసింది ఆ మనసు.



ఇసుక, చాకుతో కోసిన హల్వాలా తెగిపోతోంది. రెండుపార్ల కే తట్ట నిండిపోయింది. ఆ పడుచుపిల్లొచ్చి తన ఎదురుగా నిలబడింది. బరువు తట్టను ఆకాశం మీదకెత్తి విల్లులా వంగాడు అతను. దాన్నందుకోడానికి తనూ విల్లులా వంగిందా పిల్ల. ఛాతీ ఛాతీ రాసుకున్నాయి. వళ్ళంతా జలదరించింది. రివ్వున తిరిగి నెమలిలా నృత్యంచేస్తూ ఉయ్యాలలలోని చంటిపిల్లల బుగ్గలు మీటుతూ లారీకేసి నడిచిందా పిల్ల. ఆ మీటలన్నీ తనమీదే పని

చేసినట్లు నిలువునా గిలిగింతలు చెలరేగాయి కం॥ బా॥ మనసుకి. ముసిముసి నవ్వులతో మెలికలు తిరిగిపోయాడు.

కం॥బా॥గారు మంచి హుషారుగా ఉన్నారన్న సంగతి గ్రహించాడు బంటా మేస్త్రి. ఛాన్సు చూసుకొని మొదలెట్టాడు.

"ఈ వారం బట్వాడాలో రెండొందలు ఒద్దే యియ్యండి బాబుగారు. రేపు పున్నమిగందా. ఓ యేటపోతును కొనాలి. సత్తెమ్మ తల్లికి పూస్సేసి, మీ పేరు సెప్పుకొని నైవేద్దం పెట్టి పెసాదాలు తింటాం."

"అలాక్కానీ" అన్నాడు కం॥బా॥ వేట ఉధృతంలో పడి.

"రేపు ఆదివారం కదా. పొద్దుగాలే సంత సేసుకుంటాం. యీయాల సందేలకాడే కొలాలు కొలిసి బట్వాడా సేసేయండి బాబుగారూ."

"అలాక్కానీ" అందామనుకున్నాడు కం. బా. కానీ వారం పనీ కొలిచి శనివారం రాత్రికే బంటాకి డబ్బులిస్తే రాత్రికి టోకరాకొట్టి బిచానాలు ఎగవేసి ఉడాయిస్తారన్న సంగతి చటుక్కున గుర్తొచ్చింది. అందుకే అలా క్కానీ అనబోయి నాలిక్కరుచుకున్నాడు.

గతంలో యిలాగే మరోపిల్ల వేటలో పడి బంటాలకి శనివారం సాయంత్రమే బట్వాడా చేసి, ఆ పిల్లకోసం గుడిసెలకేసి తెల్లవార్లూ చూస్తూ కూర్చున్నాడు. గుడిసెల్లో దీపాలు వెలుగుతూనే ఉన్నాయి. కాని ఎవ్వరూ బైటకు రాలేదు. తెల్లారాక చూస్తే ఖాళీ గుడిసెల్లో రెపరెపలాడుతున్న గుడ్డి దీపాలు తన్ను వెక్కిరించాయి. చూస్తుండగా తన్నలా బుట్టలో వేసి ఎలా పరారైనారన్న విషయం ఇప్పటికీ తన కాశ్చర్యంగానే ఉంది. ఈ సార లాంటి పప్పులుడకవులే అనుకొన్నాడు.

తిప్పమీద లారీ నిండింది. కూచున్న తుండుగుడ్డను దులిపి డ్రైవరు బోనట్ ఎత్తాడు.

గోదాట్లో నీళ్ళుముంచి నిండుకడవను చంకనేసుకొని వయ్యారంగా వస్తోందా పిల్ల- కేలండర్లో బొమ్మలా.

కడవ నందుకొన్నాడు డ్రైవరు.

అది చూసి మండిపడింది కం. బా. మనసు. పడుచు పిల్లలతో పని చేయించుకోడం లారీ డ్రైవర్లకి జన్మహక్కయిపోయింది. ఏకంగా లారీ ఎక్కించి సరసాలాడతారు. రోడ్డు రోలర్ డ్రైవర్లు మరీను. అరడజను మందిని ఏరుకొని రోలరెక్కించేస్తారు- చక్రాలకంటుకున్న మట్టిని గోకడానికని- ఇంజన్లో బొగ్గను నింపడానికని.

కం. బా. మనసు విసిగిపోయి మరుక్షణం లారీ డ్రైవర్లో దూరిపోయింది.

పడుచుపిల్ల హాయిగా నవ్వుతూ, గెంతులేస్తూ అడ్డుపడ్డ ఉప్పరి పిల్లాళ్ళ తలలు తబలా వాయిస్తూ పుషరుగా తన దగ్గర కొచ్చింది నిండు కడవతో. టీవిగా రేడియేటర్ మూత తీశాడు. రేడియేటర్లో బుడగలొచ్చేస్తున్నాయి. ముఖంమీద ముఖంపెట్టి రేడియేటర్లో నీళ్ళోసిందా పడుచు. అవిరి సెగలు క్షణంలో ఐస్‌మీది సెగల్లా మారిపోయాయి. ఓరగా తనకేసి చూసి కవ్వించిరిదా పడుచు. దానికి సాయం ఆమె ముంగురులు తన చెంప మీద కెగిరి గిలిగింతలెట్టేశాయి. అమాంతం హైపెక్కి కౌంగలాగి ఇద్దరి ముఖాలని చటుక్కున కప్పేశాడు.

"అదేటి బాబు, నా తుండుగుడ్డ లాగేసి అలా కప్పేసుకున్నారు. ఏదెక్కి ఫోనాది కామోసు. ఇలా నీడలోకి రండిబాబు. గొడుగు తెచ్చుకోపోయారా" అంటూ గుడ్డ లాగేసుకొన్నాడు బం. పే.

తెల్లబోయాడు కం. బా.

"సందాకే కొలాలు కొట్టేసి బట్వాడా సేసేద్దురుగాని. మకాంకాడ కాసేపు తొంగుని రండిబాబు. షడమట గాలికి ఏదెక్కువ"

'ఆ పప్పులుడకవులే' అని మరొకసారి అనుకొని తిరిగి బంటాని సీరియస్‌గా కళ్ళతో ఆజమాయిషీ చేయసాగాడు- మనసుని అదుపులో ఉంచడానికి ప్రయత్నిస్తూ.

పని జోరుగా సాగుతోంది. వారం రోజులుగా పట్టిన కొలాలను కొలిపించుకోడానికి గోతులను హడావిడిగా సమమట్టం చేస్తున్నారు బంటా కూలీలు.

కొలాల నానుకొని తిప్ప వారే వాళ్ళ గుడిసెలున్నాయి. జోడాకి ఆరు వెదురు గడల, నలక్రై తాటాకుల చొప్పున వాళ్ళ మకాం ఇట్టే యించక్కా కుదిరిపోతుంది. వలయాకారంలో గెడలు పాతి వాటిని గోపురంలా పైన ముడేసి చుట్టూ ఆకులు నేస్తారు. బారెడు ఎత్తు గుడిసెకి జానెడే గుమ్మం. దూరి లోపల కెళ్ళాలి. అవి చూశాక ఒక సందేహం కలిగింది కం॥బా॥కి.

"ఆ గుడిసెల్లో గాలి ఎలా వెడుతుందోయ్ శాస్త్రి? ఉక్కపోయి చావరూ మనుషులు ?"

"గుడిసెలో తొంగుని తలకాడ పుల్లెట్టి ఓ ఆకుని ఒత్తిగిస్తే సాలు జోరుగాలి ముకాన్ని కొడుతుంది బాబు. కాసేపటికి ఒళ్ళంతా సల్లబడి బిర్రై పోద్దండి."

"మీది గొప్ప అదృష్టమోయ్. ఒకప్పుడు రాముడూ సీతా పెళ్ళయిన పచ్చాలుగేళ్ళు ఏ బాదరాబందీ లేకుండా విచ్చలవిడిగా హనీమూన్ గడిపారు. ఆ పనే మీరు జీవితాంతం చేయగలుగుతున్నారు"

"పోండి బాబు. మా యెట్టి అనాదిసత్యపు అడవి బతుకులు. రాము లోరికి మాకు సాపత్తెమా?"

"కాకుంటే మీరా వంశానోళ్ళో, అంశానోళ్ళో పుట్టుంటారు." అన్నాడు కం॥బా॥ గుంపులో పిల్లని పెయ్యికళ్ళెట్టి వెతుకుతూ.

వంశం గురించి అడిగితే చాలు. వెయ్యి తరాల చరిత్రను చెప్పే స్తాడీ బం॥ మే॥ ఆ మాటకొస్తే ఏ మేస్త్రీ నడిగినా ఆ చరిత్రే చెపుతాడు. అసలా చరిత్ర తెలిసినవాడే బంటా మేస్త్రీ ఔతాడు.

"నిజం బాబు. మాదీ రాములోరిసీ ఓటే వొంసెమండి. ఆ మాట కొత్తే రాములోరిదే మా వొంసెవండి. మమ్మల్ని ఉప్పరోళ్ళంటారు గాని మాది సగర వొంసెం అండి. అంటే రాజవొంసెం అన్నమాట. సగరుడు గోరు ఓ గొప్ప సెక్రవర్తండి"

కం॥బా॥ మనసు మనసులో లేదు. ఐసు రూము లాంటి ఉప్పరి గుడిసెకేసి పోయి ఏవో తిప్పలు పడుతోంది.

"సగరుడు గోరు మారాజన్నానాండి. ఆరికి సొంమానా యిద్దరు పెళ్ళాలండి" పురాణం విప్పాడు బం॥మే॥. మధ్యలో ఆపితే వంశప్రతిష్టకు గౌరవభంగం వస్తుందని చెప్పుకుపోతున్నాడు.

"అయి! యిద్దరు పెళ్ళాలన్నానండి. ఆరిలో ఒకరికి సివుడు కటాచ్చించి అరవై వేల కొడుకుల్ని పుట్టించేశాడండి".

కం॥బా॥ మనసు యీ లోకంలో ఉందేగా ! సెంటు రాసిన ఖద్దరు సిల్కు చొక్కా, తెల్ల పైజమా వేసుకుని గుడిసె చుట్టూ తారట్లాడుతోంది.

"మరి యింకో పెళ్ళాం ఉందాలి కదండి. దానికి సెంగులుగా ఓడే కొడుకు పుట్టాడండి. అయితేనేం బాబుగారూ అరవై ఏల నాయాళ్ళ సెయ్యనన్ని పాపాలు యీవొక్కడే సేసేసేవాడు. దాంతో సగర చక్రవర్తికి మా సెడ్డ పేరొచ్చేసిందండి".

బోర్లించిన గరాటాలా ఉండా చిన్న గుడిసె....అంతా చేసే లోపల ఎటుజూసినా రెండు బారల లోపుంటుంది. తాటాకు వాసె అంత ద్వారంలో

సీల్కు చొక్కా, పైజమా పీలైనంత నలక్కుండా చూసుకొని పట్టపగలే లోపలికి దూరబోతున్నాడు కం॥బా॥ తన పగటి కలలో.

"ఇంటున్నారా బాబు" అనిపాడు బం॥మే॥

కన్నంలో దూరుతున్న దొంగని పోలీసు తట్టినట్టయింది అరుపు. "ఛ. నోర్మయ్" అన్నాడు కం॥బా॥

బం॥మే॥ చిన్నబుచ్చుకొన్నాడు. సగర చక్రవర్తికి చెడ్డ పేరొచ్చే డాకా చెప్పి ఊరుకోడం మహాదారుణం అనుకొన్నాడు. అందుకని బల వంతాన చెప్పుకుపోతున్నాడు. ఆ సెడ్డపేరు తుడిసెయ్యడంకోసం అశ్వ మేధయాగం సేశాడండి. పూస్సేసి గుర్రానొగ్గేత్తారు సూడండి, అదన్న మాటండి. అశ్వమంటే గుర్రమండి."

అక్కడ సగర చక్రవర్తి అశ్వమేధ యాగం మొదలెట్టే లోగా ఎలాగో కష్టపడి గుడిసెలోకి దూరుతూపుంది కం॥బా॥ మనసు.

"గుర్రం సేత దౌడు తీయించి దానెనకాలే కొడుకుల్ని లగెత్తి దాన్నట్టుకు రామన్నాడండి సగర సెక్రవర్తి. పూస్సేసిన గుర్రం కదండి, అంత సులాగ్గా దొరుకుద్దామరి! లగెత్తి, లగెత్తి సక్కగా సముద్రం కాడ కెళ్ళి మాయమైపోనాదండి. ఓరి దీనమ్మ యిదేవో మాయ గుర్రంలా ఉంది రోయ్ మనూరెళ్ళి మనయ్యకు సెప్పొద్దాం అని తిరిగి దౌడు తీశారండి రాస కుమారులు" సస్పెన్స్ థ్రిల్లర్‌లాగా సాగిపోతూంది కథ.

పట్టపగలే రంగుల కల్లో షికారుగా గుడిసెలోకి వెళ్ళిపోయాడు కం॥బా॥

తాటాకుల గుండా పడపోసిన సూర్యకాంతి గుడిసెలో వెన్నెల కురిపిస్తోంది. మెత్తని మట్టిమీద సున్నగా అలికిన నేల, పట్టు పరుపులా ఉంది. కొత్త తాటాకులూ, పచ్చి పేడళ్ళ వాసనలూ మనసుకు మత్తెకిస్తు న్నాయి. ఆబగా గుటకేశాడు.

నిద్రలోలా వినీ వినపడకుండా సాగిపోతోంది- బంటా మేస్త్రీ వంశ చరిత్ర.

"అగ్గదండి గుర్రాన్నొగ్గేసి సేతులూపుకుంటూ కనబడ్డ కొడుకుల్ని సూసి, స్సే! యదవనాయాళ్ళారా! యీ వంసెంలో పెడ బుట్టారు, గుర్రాన్నట్టుకొత్తేనే మీకు దానా పడేత్తాను, పోండి." అని పొలిమేర దాకా తన్ని తరిమేశాడండి సెక్రవత్తి. ఇంటున్నారా?" అడిగాడు బం॥ మే॥

తన్మయత్వంలో ఉన్న కం॥బా॥ను చూసి కథలో తన్మయత్వం చెందేశాడని అపోహపడి చెప్పుకుపోసాగాడు మిగతాది.

"సముద్రం కాడ మాయమైన గుర్రం యేడ పోతుంది సెప్మా? అని బుర్రెట్టి ఆలోసించి పాతాలానికే పోయుంటాలహేస్! ఈ గెడ్డంతా తవ్వేద్దారి. పనిమొట్లట్టుకురండోస్ అన్నారండి, మా అరవై యేల కుల పెద్దలు. అంతే! శ్సణంలో పార, గునపాలు అట్టుకొచ్చి కొలాలెట్టేసారండి పాతాలానికి దారెయ్యటానికి. ఇప్పుడా పనిముట్లేడవండి, అన్నీ నెలతక్కువ సరుకులే. ఆ పెట్టిన కొలాల్ని లోతు సేసుకొంటూ పోనారండి"

మేస్త్రీ కథలో, వాళ్ళలా లోతుచేసుకొంటూపోతున్న సమయంలో కం॥బా॥ మనసు గుడిసెంతా కలయజూసింది

గుడిసంతా కనుల పండుగగా వుంది. కలగా పులగంగావున్న పికాసో చిత్రాన్ని చూసినట్టు ప్రతీ అంశాన్ని వెతుక్కొని చూడసాగాడు. సూదంటు రాయిని బలాదూరు చేస్తున్న పెద్ద కళ్ళు కనపడ్డాయి చిలిపిగా ఒక మూల. వాటిమధ్య కాస్త దిగువగా ఇత్తడి ముక్కు సింగారాన్నిచ్చేలా తీర్చి దిద్దిన ముక్కు సిగ్గుతో షోకా లెగరేస్తూ కనపడింది. దానికి మరి కాస్త క్రింద ముత్యాల తళుకులను మూసీ మూయకుండా ఊరిస్తూ మత్తెక్కిస్తున్న పెదవులు వున్నాయి. గిర్రున తిరిగి మరోవైపు చూశాడు. వంకీలకు, మట్టెలకు

అందాన్నిచ్చిన చక్కని పాదాలు కనపడ్డాయి. దృష్టిని మరికాస్త అటు మళ్ళించాడు. చీరకట్టుకు శృంగారాన్నిచ్చిన వంపులు తిరిగిన భాగం పిక్క నుండి నడుం దాకా కనబడింది. తిరిగి ఓ చివరికి పోనిచ్చాడు చూపుని. పర్వతాన్ని కప్పిన జలపాతపు జిగితో ఉన్న వత్తైన కేసరాలు, చెదిరిన దారలులా ఉన్న ముంగురులు కనపడ్డాయి. దృష్టిని మరోవైపుకు త్రిప్పాడు. కంచుపోతలా మెరుస్తున్న బోసి కాళ్ళు కనపడ్డాయి. ఎత్తుగా ఏదో కదలడం చూసి అటు కేసి చూశాడు. పమిటను పొంగించిన ఛాతీ కనబడింది. దానితోపాటే ఇత్తడి నానుతాడు సాగుతోంది. దానికి బంగారు ఛాయలిచ్చిన పాలరాయిలాంటి నున్నని కంఠం కనబడింది. ఇవన్నీ ఇరుకు చోటులో తన చుట్టూ వున్నాయి. వీటిని విడివిడిగాను జమిలిగాను చూశాడు. వీటి మధ్య ఇమడటానికి ప్రయత్నిస్తున్నాడు కం॥బా॥

సగర పుత్రుల తవ్వకంలా అతని ప్రయత్నం జయప్రదంగా సాగుతోంది.

"మడిసికో గజం సొప్పున అరవై యేల నిలువు తవ్వేసి పాతాలానికి సొరంగమెట్టేశారండి మా వోళ్ళు. అంటే ఆ కాలం నుండీ ఉంది మా వొంసెంలో ఉప్పురి విద్దె. ఆ విద్దే మాకియాల కూడెడుతోందనుకోండి. పత్త కట్టం ఉత్తినే పోద్దాండి? గుర్రం దొరికేసినాదండి. కాని దాన్ని కట్టేసి పక్కనే ఓ సన్నాసి కళ్ళు మూసుకుని తపస్సేత్తున్నాడండి. 'ఈడే గుర్రాన్ని కట్టేశాడు. ఈణ్ణి సంపేసి గుర్రానట్టుకుపోదారి' అని ఆడిమీద సెయ్యేసేసుకున్నారండి యాళ్ళంతమంసీనూ. ఆడు అగ్గిబుగ్గయి కళ్ళు తెరిశాడండి. స్సెణంలో మావోళ్ళందరూ బూడిదై పోనారండి. అంటే మా వొంసెంలో అరవైయేలమంది పడుసుపిల్లలు సెణంలో ముండమోశారన్న మాటండి" కథనక్కడాపాడు బం. షే. - కం. బా. శాను భూతి ఎలాగుందో కనిబెట్టటానికి.

రంగుల కలలోకొచ్చిన పడుచుపిల్ల బాపతు మనసు, శరీరం కాస్త ఒరిగాయి. దాంతో తనూ ఆమె ప్రక్కనే చోటు చేసుకొన్నాడు. చిన్న పుడక తీసి తాటాకును ఒత్తిగించింది. చల్లనిగాలి రివ్వున వీచింది. మనసుకు వెర్రెక్కింది. ఆమెను తన చేతుల్లోకి తీసుకొన్నాడు. ఆమె తనలో యిమిడి పోయింది.

అక్కడ వాళ్ళు మూకుమ్మడిగా ముండమోస్తుంటే చిరకాల వాంఛ తీరినట్టు కం.బా. ముఖం పెట్టేసరికి చిన్నబుచ్చుకొన్నాడు మేస్త్రీ. పౌరుషం వచ్చింది.

"అరవై యేల గామాల రాజ్యమండి అప్పుడు మాది. ఇప్పుడూ యీ యేటిపట్టున అరవై గామాలు మావేనండి. మా గుడిసెల పొలిమేరల్లో మా కాయకట్టాల మీద కామందులు మేడలు, మిద్దెలు కట్టేసుకుంటే అవి బెమ్మాండమైన ఊళ్ళయిపోనాయి. ఇప్పుడాటికి మా గుడిసెలే పొలిమేర్లయి పోనాయి" అని యిదయిపోయాడు.

చెదిరిన బొట్టు, రేగిన జుట్టుని సవరించుకుంటూ, తన ఛాతీ మీద వాలింది కం.బా. కలలో పడుచుపిల్ల. విరిగిన గాజులను బట్టలనుండి దులుపుతూ ఆ పిల్ల చెపుతున్న కథలను శ్రద్ధగా వింటున్నాడు కం.బా.

"మేము సెక్రవర్తులం కదండీ, అందుకే అట్టడుగువరగాల లిట్టులో లేము. కాబట్టే మాకీ కట్టాలు. ఆనాడు బగీరదుడు గోరు మా వొంసపోన్న పుట్టి గంగమ్మ తల్లిని తెచ్చాడు కనుక మాకు పుట్టగతులొచ్చాయండి."

కలలో పిల్ల చెబుతున్న కబుర్లు చెవులో గూడుకట్టి మేస్త్రీ చెబుతున్న కథ కలగా పులగంగా వింటున్న కం.బా.కి భగీరథుడంటే ఎవరు చెప్మా అన్న సందేహం వచ్చింది. ఆ! వాడే. తెల్లారకంకా కోడైకూసి తనలా గుడిసెలోకి చొరబడ్డాడు- వాడే- అనుకొన్నాడు. తరువాత శాపం

సంగతి గుర్తుకొచ్చి ఒళ్ళంతా తడిమేసుకొని వెదుక్కుంటున్నాడు కం.బా.

"ఏటిబాబు, అట్టా ఎతుక్కుంటున్నారు ? ఏ పురుగైనా సొక్కా లోకి దూరిందేంటి?" అంటూ చొక్కాలోకి చెయ్యెట్టి తనూ వెతకసాగాడు బం.షే. దాంతో ఈ లోకంలో పడ్డాడు కం.బా.

"సొక్కాలో లేదు, ఎటో పోయుంటుంది బాబు. మీరో అడుగు కొలాలకాడకొచ్చి కొత్తలేసేయండి. ఈ సంబాళే బట్వాడా గంద!" మళ్ళీ తన పాయింటుకొచ్చేశాడు బం. షే.

"సంబాళే డబ్బు చేతికిస్తే తప్పతాగి ఒకడి పెళ్ళాంమీద మరొకడు చెయ్యేసి రాత్రంతా కొట్టుకు చస్తారు. అందుకే రేపిస్తాను" ఖచ్చితంగా చెప్పేశాడు కం.బా.

"అయ్యబాబు ఎంతమాటన్నారు. ఎంత తాగినా అలా సెడం బాబు. అలాసేత్తే మా ఆడోళ్ళూరుకోరండి. మాలో తడికసాటు యవ్వారం జరిగితే పంచాయితీ పెద్దలు తప్పేసి వందలమీద జుర్మానాలేత్తారండి. ఆ పాలు కట్టాలంటే యీ జనమే సాలదండి. బాబుగారు యింకో యిసయం అసలు మడిసి ఆడదై పుట్టకోడదండి. పుట్టినా ఉప్పరికులంలో సత్తే పుట్టకూడదు.

ఓ మూల కాపరం సక్కెట్టుకుంటూ మరోమూల పొద్దత్తమానం రెక్కలు ముక్కలు సేసుకొని తట్టలు మోత్తారండి మా ఆడోళ్ళు. నెలలు నిండి ఇంకాసేపటికి పెనవిత్తుందన్న ఆడది ఆ స్నేణందాకా తట్ట మోత్తది. బాబు. అందుకే నెత్తిమీద గుడ్డసుట్ట తీసి సూత్తే మా ఆడోళ్ళకు ఎంట్రుక లుండవండి. బాబుగోరూ పనికోసం వొళ్ళవంచుతారే కాని, సత్తే వొళ్ళప్పగించరండి."

క్షణంలో అక్కడ ఆడాళ్ళందరూ బోడిగుళ్ళేసుకుని కనపడ్డారు అతని మనసుకు. కంగారుపడి కళ్ళు నులుపుకు మళ్ళీ చూశాడు. గుడ్డ

చుట్టల వెనుక కొష్పు సింగారాలు మామూలుగానే కనబడ్డాయి. మనసు స్థిమితపడి- 'ఆ—మా చెప్పొచ్చాడు వెధవబడాయి వీడూనూ! పచ్చనోటు గాలిలో ఊపితే రెక్కలు కట్టుకు వాల్తారు. వీళ్ళ సంగతి నాకు తెలియదా' అనుకొని, మళ్ళీ సీరియస్‌గా బంటాకేసి దృష్టి సారించాడు ఆజమాయిషీగా.

మరో లారీ నిండింది. డ్రైవర్ బోనట్ ఎత్తాడు. మళ్ళీ కడివెడు నీళ్ళతో ఆ పడుచుపిల్ల ప్రత్యక్షమైంది. తక్షణం రంగంలోకి దూకడానికి నిశ్చయించుకున్నాడు కం.బా.

"ఇదిగో మేస్త్రీ. ఆ పిల్లని ఆ కుండనిలా పట్రమ్మను. చిరాకేస్తోంది, ముఖం కడుక్కోవాలి" అంటూ చిరాకు నటించాడు.

బం.మే. ఉప్పరి భాషలో ఓ కూత కూశాడు. మరుక్షణం ఆ కడవ నందుకొని అంతవరకు కొలెంలో పారకొడుతున్న దున్నపోతు తనకేసి నడిచి వస్తోంది.

అది గమనించి నిజంగా చిరాకుపడి "దాన్ని తెమ్మంటే వీడెవడు తేడానికి" అని మేస్త్రీని కోప్పడ్డాడు.

"అదాడి సెల్లెండి. దాన్ని కట్టపడనీడండి. దాన్నో మంచయ్య సేతులో పెట్టటానికి డొక్కమాడ్చుకు డబ్బెనకేత్తాడండి. అదంటే ఆడికి వల్లమాలిన పానం."

కుండ దింపి యికిలించింది దున్నపోతు- గోచీ దులుపుకుంటూ.

ఆ పిల్ల, వాడి స్థానే కొలెంలో పార కొడుతోంది.

"బడితెలాగున్నావు. ఆ పిల్లచేత పార కొట్టించడానికి సిగ్గులేదూ?" కొట్టేటంత కోప్పడ్డాడు కం.బా.

"ఈ బంటా వోలు మొత్తంలో నా సెల్లిలా పారకొట్టే మొనగాడెవడో సూపెట్టండి. ఈ ఉప్పరి పారేఖాస—మెట్టపార, పొట్టిపార, గుబ్బెం

ఏదిచ్చినా సరే నా పెళ్ళిలా తిరక్కొట్టు, దడినరకు, కుడపొడుపు, సమ్మటం, పూడ్చడం సేసి సూపెట్టమనండి, శాల్లంజి!'' అన్నాడు ఛాలెంజిగా ఆ బడితె.

''అయినా దానిచేత పనిసేయనీడండి యీడు. దాన్నో దేవతలా సూసుకొంటాడు. ఆ మాటకొత్తే మా బంటా మొత్తం దాన్నో దేవతలా సూత్తామండి. అది స్తానంచేసి తడి జుట్టు యిరబోసుకుంటే సత్తెమ్మతల్లి, నూకాలమ్మతల్లి, గోదారి కాడున్న పోశెమ్మతల్లి దాన్ని పూనేత్తారండి. మెల్లబోత పెడితేగాని దేవతలు శాంతించి పూనకం దిగదండి, దానిజుట్టు ముడవదండి.'' విషయం పూసగుచ్చినట్టు చెప్పాడు బం.షే.

''మెల్లబోత అంటే ఏమిటి?'' అనడిగాడు కం.బా. అదేదో వింతగా తోచి.

''ఎర్రకూడు, పచ్చకూడు వొండి బలైదానికో సందిపిల్లను కొని బారికతన్ని (గ్రామదేవతల పూజారి) పిలిపించి, అతనికి త్తే ఆడు పూన్సేసి దేవతను మా జోలికి రాకుండా సేత్తాడండి. అదన్నమాటండి మెల్లబోత అంటే''

''ఓరి వెర్రి నాయాల్లారా! అలాంటివానికి అలిసిపోయే పనులు చెప్ప కూడదు. మనిషలసిపోతేనే పూనకాలొస్తాయి. అలాంటోళ్ళు హైక్లాసు పనులే చెయ్యాలి. బంటాలో చంటిపిల్లలకు కాపలా వుండడం, దాహానికి నీళ్ళంది వ్వడం, కొలాలు నేను కొలుస్తున్నప్పుడు టేపు పట్టుకోడంలాంటి పనులు''

''అలా సేత్తే దాని కూలికట్టి వొంతులేసుకోడానికొప్పుకోరు మా వోళ్ళు ఒక్క మేస్త్రీ కూలికే పాలి కడ్తారు.'' అన్నాడు ఆ పిల్ల అన్న.

''సరే. దాని కూలీకి రెట్టింపు నేనిస్తాను. నా మకాం కాడికి పంపించు. అక్కడ కాపలా వుండి నాకు నీళ్ళివ్వడం, కారేజి కడగడం లాంటి పనులు

కడుపులో చల్ల కదలకుండా చేస్తుంది.'' ఆ పిల్ల నుద్ధరించేవాడిలా అన్నాడు కం.బా. తన అసలు టెక్నిక్ ఉపయోగిస్తూ.

"అది మీ మకాంకాడ కూకుంటే, నా సారకొట్టుకి తట్టెవరెత్తుతారు? నే ఖాళీగా కూకుండిపోనా? అప్పుడు నా కూలీ సెడద్ది కదా!''

''నీ కూలీ నే కట్టుకుంటాను. లారీలన్నింటికి డోర్లు తీయడం, యింజన్లలో నీళ్ళోయడం లాంటివి నువ్వు చూసుకో. అంటే క్లీనరు పని అన్నమాట.''

బిత్ర గోక్కో-సాగాడు పిల్ల అన్న- ఇందులో తిరకాసేమన్నా వున్న దేమోనని.

''ఏరా కొండిగా! ఇంకా ఏటాలోసిత్తున్నావ్. యీ సిట్టం బానే వుంది. అయిగోర్ని మా లెష్మి సూసుకొంటుంది. లారీలను నువ్వు సూసుకో. యీ సిన్నాయి గారెంతంటె పెద్దకంట్రాటు గోరికంత'' సిఫార్సు చేశాడు బం.మే.

'మహాలక్ష్మి, ఆ పిల్ల పేరు? ఎంతచక్కని పేరు' సంబరపడి పోయాడు పేరు తెలుసుకోకుండానే- ఆ పిల్లంటే యిదిలోపడ్డ కం.బా.

''అయినా యీరికి నా సెల్లిమీదే ఎందుకింతికీ?'' సందేహిస్తున్నాడు కొండయ్య.

''ఇదిగో యీ పాతిక అర్వాన్సు తీసుకో, దాన్ని నా మకాం దగ్గరకి పంపించు. పనవ్వగానే వచ్చేస్తుంది. దాని గొడవ నాకొదిలేయి'' అని నోట్లందించి ''ఇందు యీ చీటీ తీసుకో. పక్కూరి సారా కొట్టతనికి చూపించు. నువ్వు తాగినంత సారా పోస్తాడు ఉట్టినేలే!''

చీటీ పుచ్చుకొని ఒక గెంతులో కొలెంలోకి దూసుకుపోయాడు కొండయ్య.

మనసు తేలికపడింది కం.బా.కి. తన ఎరకి చేప తప్పకపడుతుందనీ గట్టి నమ్మకం ఎప్పుడూ వుంది.

మేస్త్రీ కేదో అనుమానం కలిగింది. "బాబుగోరూ కన్నెపిల్ల మీద రంకడితే యేల మీద తప్పేస్తారు మా పంచాయతీ పెద్దలు. అందుకే సెరప డానికి సెయ్యేసినోడ్ని, నిలువు గోతిలో పీకదాకా పూడ్చేత్తారు మా పడుచు పిల్లలు. మీకేం మాటరాకుండా సూసుకోండి. అసలే మా లష్మికి మా సెడ్డ పొగరు"

పొగరు మోతంటే మనసు మరీ ఊరింది కం.బా.కి. కోతిలాంటి మనసు చటుక్కున మఠాం కేసి ఎగిరిపోయింది.

మహాలక్ష్మి సుబువుగా నిలువుగొయ్యి తవ్వేస్తుంది. ఒంపులు తిరిగిన అవయవాల కదలికల సొంపులు తాపీగా చూస్తున్నాడు అతడు. గొయ్యి పూర్తయింది. "సరే, పూడ్చేయ్" అంటూ తనే సరదాగా గోతిలోకి దూకాడు. పొగరుగా పారకొట్టి మట్టిని గోతిలోకి పోస్తోంది మాలక్ష్మి. నింపినమట్టి మీద కెగుర్తూ అలా అలా పైకొచ్చేస్తున్నాడు అతను. మరు క్షణంలో పూడ్చిన గోతిమీద గోపాలకృష్ణునిలా పోజెట్టి వెలిశాడు. తెల్ల బోయి చిన్నబుచ్చుకొంది మాలక్ష్మి. జాలిపడి, బుజ్జగించి మఠాంలోకి నడి పించుకుపోయాడు- అతను ముసిముసి నవ్వులు నవ్వుతూ.

ఆ నవ్వుచూసి "బాబుగోరు! నాకూ ఓ సీటీ యిప్పించండి. పెంద రాళ్ళే తొంగొని పొద్దుగాలే కొలతల కొస్తాను." అంటూ లేసాడు బం.మే. ఇవ్వాళ బట్వాడా ఎలాగూ లేదని ఖరారు చేసుకొని.

పార, గునపం భుజాన్నేసుకొని ఎదురుగా నిలబడింది కత్తిలా మాలక్ష్మి.

కం.బా. ముఖం చాటంతయ్యింది.

"పారగట్రా ఒగ్గేసి అయ్యగారి మకాం కాడుండి ఆరికి కావల్సింది సూసుకో. అల్లా తిప్ప సివర దుబ్బులు కాడుందే పాక, అదే యారి మకాం" అన్నాడు బం.మే. కం. బా. చేతిలో చీటీ లాక్కుంటూ.

"అట్లాంటి పనులు నాకు సేతకావు. నేసెయ్యలేను, నుయ్యో గొయ్యో తీయమను స్పెణంలో సేసేత్తాను" అంది మాలక్ష్మి ఖచ్చితంగా.

"ఆ పనే చేద్దువుగాని నడు" అన్నాడు కం. బా. ఇప్పటినుంచే వాదనెందుకని, తరువాత ఆ తిప్పలు ఎలాగూ పడొచ్చని.

"సరే, నెగండి. పనిసూసి సొమ్ముచ్చుకుని బేగిరమ్మన్నాడు మా యన్న"

కైపుగా లేచాడు కం.బా.

* * *

తప్పతాగిన మైకంలో తిప్పమీద పడున్న కొండయ్యని మలికోడి లేపింది.

అంతా అయోమయంగా వుంది. మత్తును చీల్చుకొని అతికష్టంమీద పరిస్థితిని అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

అంతా గ్యాపకాని కొచ్చింది.

తల విదిపి తన గుడిసెకేసి నడిసాడు.

మాలక్ష్మి గుడిసెలో లేదు.

ఎక్కడుందో అర్ధమైంది.

'అంటే ఆడి మకాంకాడ ఆడితో తొంగుని కులుకుతోందన్నమాట'

ఇంతవరకు మైకాన్నిచ్చిన కడుపులోని మంట బుర్రకెక్కి మా చిర్రెక్కిపోయాడు.

కొలాలు దాటి నీటంచుకు చేరాడు. తిప్పచివర మకాంలో దాన్ని నరికి పోగెట్టడానికి.

నాలుగడుగు లేసేసరికి పార, గునపం కాళ్ళకడ్డుపడ్డాయి. అవి మాలక్ష్మి పనిముట్లు. పార రేకుమీద మొలసంచి వుంది. దాంట్లోంచి తొంగి చూస్తున్న నోట్లకట్ట కనబడింది.

పిచ్చెక్కి గోదావరంతా కలయజూశాడు.

దూరంగా మాలక్ష్మి మొలలోతు నీళ్ళలో జలకాలాడుతోంది.

కిలకిలమంటూ సన్నని కూనిరాగాలు, తరంగాల చప్పుళ్ళతో బాటు లీలగా వినిపించాయి.

'పుషారెక్కి పోతోంది యీ గుడిసేటి లంజకు' అని మండిపడ్డాడు.

అహర్నిశలు దాని బంగారు భవిష్యత్తుకోసం తనుపడ్డ శ్రమ, కాయ కష్టం, పోగేసిన డబ్బు ఎదురొచ్చి తన్ను వెక్కిరించినట్టయింది.

ఉడుకుమోత్తనంతో నిలువెల్లా కాలిపోతున్నాడు. మాలక్ష్మి స్నానం బాపతు పిల్ల అలలు అతని కాలికిసోకి ఆవిరై పోతున్నాయి.

గునపం అందుకున్నాడు తన చెల్లెల్ని పొడవటానికి.

బట్వాడా కోసం పెందరాళే లేచిన బంటా జనం చుట్టూ చేరారు.

సూర్యోదయం పూర్తిగా అయింది.

ప్రవాహాన్ని చీల్చుకొంటూ మాలక్ష్మి అన్నకేసి నడుస్తోంది.

మోకాలి నీటిలో ఆగి, గునపం ఎత్తి బిగుసుకుపోయిన అన్నకేసి చూసింది.

అన్నచుట్టూ జనం కనబడ్డారు. అన్న తనకేసి తీక్షణంగా చూస్తు న్నాడు.

ఆగి ముడివిప్పి జుట్టు విరబోసి దులిపింది.

"అయ్యబాబోయ్! అమ్మోరు పూనింది మాలక్ష్మికి" అన్నారు చుట్టూ వున్న జనాభా.

మాలక్ష్మిలో అమ్మోరు కనబళ్ళేదు కొండయ్యకి- ఓ కామ పిశాచి కనబడింది.

మడమ నీటిలోకొచ్చి అన్న కేసి ఆశ్చర్యంగా చూసింది మాలక్ష్మి.

అన్న అదోలా చూస్తున్నాడు తన కేసి.

'ఏమైపోనాది మాయన్నకి' అనుకొంది హడావిడిగా కొప్పు ముడేసుకొని ఒడ్డును చేరుతూ.

కొప్పు ముడేసుకోడం చూసిన బంటాజనాభాకి మనసు తేలికపడ్డింది- అమ్మోరు పూనకం కాదులే అని.

గట్టుచేరి పార, డబ్బులసంచి తీసుకోడానికి వంగింది మాలక్ష్మి.

గునపం పట్టుకున్న కొండయ్య చేతులు బిగిశాయి.

గురిపెట్టడానికి గునపం ఆకాశంలోకి ఎత్తి వూపిరి బిగించాడు.

ఓ క్షణంలో ఆ గునపం మాలక్ష్మి శరీరాన్ని మట్టిలోకి దిగేయబోతుంది.

"ఓయ్ రండర్రా రండి. గోరం జరిగిపోనాది. కంట్రాక్టరుగోరి బామ్మర్దిని ఎవరో పీకదాకా పూడ్చేసినారు. సావుబతుకుల్లో వున్నాడు. తొరగా వచ్చి మట్టితవ్వి ఆడిని బైటికి తీయండి" పరిగెత్తుకొస్తున్న డ్రైవర్ల కేకలు స్పష్టంగా వినబడ్డాయి.

వాటిని ఇసుక తిప్పలన్నీ మారుమ్రోగించాయి.

# అది-వాడు-చేప

అది వాడ్ని కోరి చేసుకుంది.

వాడంటే పడి చస్తుంది. విడవకుండా వాడ్ని అంటిపెట్టుకుంటుంది.

వాళ్ళకున్నదల్లా ఓ చిన్న నావ.

అదే వాళ్ళకు నీడ నిచ్చే గూడు.

వాళ్ళకి తెలుసున్న దైవం తల్లిగోదారి. ఆ తల్లి వాళ్ళకి కూడు పెడుతుంది. కూటికి కావలసిన చేపలనిస్తుంది.

ఎప్పుడూ ఆ తల్లినే తలుచుకుంటారు.

రోజు గడిచేందుకు పట్టెడు చేపలు చిక్కితే చాలు. చేపలకొద్దీ డబ్బులు. డబ్బులకొద్దీ నూకలు, అందులోనే చీకిపోయిన వలకూ, చిల్లడు తున్న నావకీ చూసుకోవాలి.

ఆకాశమంత పందిరి వాడు.

భూదేవంత అరుగు అది.

వయసు, నావ, ఏకాంతం వాళ్ళకి ఖర్చులేని విలాసాలు.

పేలు కుక్కించుకోడం దానిక్కావాలి. వీపు గోకించుకోడం వాడిక్కావాలి.

పగలు గోదావరి, రాత్రి చీకటి వాళ్ళను కప్పుతుంది. అంచేత వాడికో గోచీ, దానికో రెండు బారల చీరా మినహా మరో నూలుపోగుతో పనిలేదు.



రోజులా పొద్దుపోకముందే చేప యిగురు, చిమిడిన అన్నం తిని, వార్చిన గంజిలో ఉల్లిపాయ నంజుకొని జుర్రేశాడు వాడు.

గిన్నెలు కడిగి జల్లిగంప సర్దడంలో పడింది అది.

కట్టుతాడు విప్పి, నావను వడిలోకి తోసి, చంకలో-చుక్కాని బిగించి అవరం తట్టుమీద చతికిలపడ్డాడు వాడు.

పొట్టికొంగును బిర్రుగా లాగి, రొమ్ములు వీలైనంత మేరకు కప్పు కొని, వాడిప్రక్కన చతికిలబడింది అది.

పాలరాయిమీద పాదరసంలా దూసుకుపోతోంది నావ.

వాడు చుక్కాని కాస్తేనే అంత.

తెడ్డు నౌకపద్ధతిలో కోలకర్రకు తాడేసి బిగించి విలాసంగా కూర్చు న్నాడు. నావ ఒడుదుడుకులు లేకుండా సాఫీగా సాగుతోంది.

ఇంకా చీకటి పడలేదు.

రివాజుగా దాన్ని వాడు ఒళ్ళోకి తీసుకుని పేలు కుక్కడం మొద లెట్టాడు. దాని తలలో పేలున్నాయో, లేవో వాడికి తెలియదు. అయినా దాని తృప్తికోసం వృత్తిత్తినే అప్పుడప్పుడు గోరుమీద గోరుంచి కిటుక్కు కిటుక్కు మనిపిస్తుంటాడు.

అలా కాసిని కిటుకులు వినడంతో తలభారం దిగినట్టయి మనసు కు సుటపడుతుంది దానికి.

చలిగాలి వేస్తున్నా వాడి ఒళ్ళో దానికి శమనగా వుండడంతో—

"మావా! శివరేతిరికి ముంగటేళ్ళా పట్టిసీమ సంబరానికెళ్దాం" అని మొదలెట్టింది.

ఆలోచనలో పడ్డాడు వాడు.

అసలే గోదావరికి తీతకాలం. చేపలన్నీ వరదకాలంలో వడికి ఎదు రీది ఎగువకు వెళ్ళిపోతాయి. ఈ శీతకట్టులో వేట సాగాలంటే గోదావరికి ఎగువకైనా వెళ్ళాలి. లేక సముద్రంలోకైనా వెళ్ళాలి. ఈ చిన్ననావ ఆ రెంటికీ పనికిరాదు. కనుక ఆటూపోటులుండే ఏటి మొగల్లోనే చేపలు పట్టాలి. శీతకట్టులో వేటంటే కూటిగింజలు మినహా పెద్ద సంపాదనుండదు. ఈ పరిస్థితిలో దాని కోరిక తీర్చడం కష్టం అని వాడికి తెలుసు.

వాడినేలా ఒప్పించాలో దానికి తెలుసు.

చటుక్కున లేచి వాడ్ని తన ఒళ్ళోకి తీసుకుని వాడి వీపు గోకడం మొదలెట్టింది. మత్తులో పడిపోయాడు వాడు.

"శివరాత్రికి నాలుగురోజులు కూడా లేదు. మనసేతిలో పైసా లేదు. పట్టిసీమంటే మాటలటేస్."

"కష్టపడి యేటాడదాం. బుట్టెడు సేపలుంటే సాలు. సొమ్ము సేసుకుపోవచ్చు. నువ్వు వూ అను మావ" అంటూ ముక్కుతో వాడి చెంప రాసింది లాలనగా.

"అబ్బా! వుండవే. నీ పూసల పుడక నా సెంప గీరేస్తోంది.... ఆ! అవునొసే! నీ ముక్కునున్న పూసలతీగ అమ్మేద్దారి. చిన్న మెత్తు బంగారం కదా! బోల్డు రూపాయలొస్తాయి" అంటూ దానికేసి చూశాడు.

అది ఆలోచనలో పడింది.

దానిచేత సై అనిపించడం ఎలాగో వాడికి తెలుసు.

చటుక్కున లేచి దాన్ని తన ఒళ్ళోకి తీసుకుని కిటుక్కు కిటుక్కు మంటూ పేలుకుక్కడం మళ్ళీ మొదలెట్టాడు.

అది యింకా ఆలోచిస్తూనే వుంది.

"అవునొసే! నిన్ను ముద్దెట్టుకున్నప్పుడల్లా అది నా మూతిని గీరేస్తోంది, ఈ తీగపుడక నొగ్గెయ్యి. వరదలొచ్చాక పులస సేప పడితే కడ్డీ పుడక తగిలించుకోవచ్చు."

అది చటుక్కున లేచి వాడ్ని తన ఒళ్ళోకి తీసుకుని వీపు నిమర సాగింది.

"అయితే మావ, కడ్డీ పుడకకి రాజ్జీంచాల మరి?"

"సింగారెట్టుకుంటుంది. అలాంటిది కొందారిలే" అన్నాడు వాడు-నాజూకైన సింగారి సోకులు నెమరేసుకుంటూ.

"స్సీ! ఆ గుడిసేటిదాని వూసెత్తమాక నాకాడ" అంటూ వాడ్ని ఓ తోపు తోసింది.

ధబుక్కుని వెల్లకితలా తొట్టిలో పడ్డాడు వాడు.

నావ తృళ్ళిపడింది.

కోపం ఇంకా చల్లారక చుక్కాని అందుకుని ఊపుగా తెడ్డేయడం మొదలెట్టింది.

నావ అదిరిపోయింది.

అది ఎప్పుడు తెడ్డేసినా అంతే. వంగులన్నీ వదులయినట్లు నావ ఊగిసలాడి పోతుంది.

"సింగారం టే ఎందుకే నీకంత కోపం" మళ్ళీ అవరం తట్టుమీద కెక్కుతూ అడిగాడు వాడు.

"అయ్యేల మన వల్లో పడ్డ పులసచేపని దాని సేతిలో పెడితే తస్సా తియ్యా! ముప్పయి రూపాయల చేపని మాయచేసి రెండొందల కమ్మింది గదేస్! దాని తెలివి మనకేడొస్తాది."

"సేపని సూసి కొన్నారా! ఆ మెత్రినాయాళ్ళు. దాన్ని సూసి కొన్నారు. 'నేనొట్టి గుడిసేటిదాన్ని' అని దాని సుకంమీద రాసుంది. అందుకే దాని సుట్టూ సేరతారు నాయాళ్ళు."

వాడికా మాటలు వినబడ్డం లేదు. వాడి మనసులో ఇంకా సోకుబొమ్మ సింగారే మెదులుతోంది.

"ఏం మావా! బండరాయయిపోయినావు" అంటూ వాడి ఛాతీమీద వాలి వాడి జుట్టు నిమిరింది.

'స్సీ! నీ దగ్గర తుప్పట్టిన యినపకడ్డీ వాసనొస్తుంది. సింగారి దగ్గర ఎప్పుడూ సెంటునూనె వాసనే' అనుకున్నాడు వాడు.

"మావా! నువ్వన్నట్టే కానీ. ఈ సుక్కపుడక నమ్మేద్దాం" వాడి చెంపను చరిచింది పగలుపోతూ.

తెలివొచ్చినట్టయింది వాడికి. "సరే! ఇయ్యి! సావుకారుకాడకెళ్ళి అమ్మేసొత్తాను రేపు."

"మావా! నా కెప్పటినుంచో ఓ బొట్టుపెట్టిమీద వుంది. సంబరంలో మంచిపెట్టెలు సవకగా వస్తాయటగా. కొనివ్వవా!"

"సరేలే కొంటారి!" అన్నాడు వాడు- సన్నాసి కోరిక కోరుకుందన్న చిరాకుతో.

"మిగిలిన డబ్బులెట్టి నాకో సీర, రైక, నీకో సెడ్డీ,బనీను కొనుక్కొ-వచ్చు."

"సరే సూద్దారి" అంటూ చుక్కాని లాక్కుని కోలకర్రకు వాటంగా బిగించాడు.

"సిలకాకు పచ్చ సీర, సింధూరం రయిక కొనాలి నాకు". అంది విరబోసిన జుట్టు పిడికిలిలోకి బిగించి కొప్పు చుట్టుకుంటూ.

"కొప్పెట్టుకుంటే సింగారికన్న ఇదే బాపుంటుంది" అనిపించింది వాడికి.

వలల్ని తొట్టిలో పరిచి, తను వాటిమీద కూర్చుని దాని చెయ్యట్టుకుని తనమీదకు లాక్కున్నాడు వాడు.

"సుక్కలు పడిపోతున్నాయి. ఇంకా చీకటి పడలేదన్న గేనం కూడ నేదు నీకు" అంటూ మీదికి వస్తున్న వాడి ఛాతీని అరచేత్తో ఆపి వాడి ప్రక్కన తనూ వాలికిలబడింది.

"మావా! పోయిన శివరేతిరికి సంబరంలో గడిగ కి కోసెడు దూరం నడిపించి రెల్లు దుబ్బులు కాడికి తీసుకుపోనావు. ఈసారట్టా సేస్తే సూడు మరి! నే పడవలోనే కూకుండిపోతా!"

వాడేదో ఆలోచిస్తున్నాడు.

"ఏటాలోసిస్తున్నావు" .... .... తన మీదకు లాక్కుంది వాడ్ని, చీకటప్పుడప్పుడే కప్పుతోంది.

# 2

గోదావరి నడుమ రాతికోటలాంటి ఓ దిబ్బ, దాని మీద ఎన్నో ఆలయశిఖరాలు, చుట్టూ ఎడారిలాంటి ఇసుక తిప్ప, ఆ తిప్పంతా కప్పేస్తూ తీర్థం.

చెప్పుకోతగ్గ తీర్థం అది.

పట్టిసీమ తీర్థం.

వరుసగా అంగళ్ళు, నేలపై పరిచిన పాత్ర సామానులు, మంచం మిఠాయి దుకాణాలు, అడుగడుగునా టీ కొట్లు, మరెన్నో వింతలూ, విడ్డూరాలు యాత్రికులకు ఆకర్షణ.

చెక్క భజన పార్టీలు, కోలాటం జట్లు, డప్పుల వరుసలు, ఆబోతుల వూరేగింపులు వగైరాలతో తిప్పంతా గగ్గోలుగా ఉంది.

జనాన్ని చేరవేసే పడవలు, లాంచీలతోనూ, సంబరం చూడ్డానికి వచ్చిన నావలతోనూ రేవు అంతా కోలాహలంగా వుంది.

దైవ దర్శనానికి కాకపోయినా చాలామంది సంబరం చూసేందుకు వస్తారు.

"మావ! ఈ చింకి సీరతో నేను రాను. నావలో కూకుని అంబలి దింపుతా, నువ్వు బేగెల్లి ఓ సీర కొనుక్కురా. సిలకాకు పచ్చది" అంది అది- చుట్టూ కలయచూసి కొంగుతో ఒళ్ళంతా కప్పుకుంటూ.

నావను తిప్పమీద కెక్కించి డబ్బుచ్చుకొని రివ్వుమంటూ గుంపులో కలిసిపోయాడు వాడు.

కాచిన అంబలి దింపి సరంజామా సర్ది పడిచెక్కమీద కూర్చుంది అది. అప్పటికే జాం పొద్దెక్కడంతో ఎండ చురకలేస్తోంది.

"యీడొచ్చేలోగా సంబరం అంతా అయిపోయేలా వుంది." అనుకొని క్షణం ఒక యుగంగా వాడికోసం ఎదురు చూస్తోంది అది.

గంట గడిచినా వాడి జాడ లేదు. "యాడ తిరుగుతున్నాడో ఈ సచ్చినోడు" అని విసుక్కుంది.

"ఓలాసి! ఆడ కూకున్నావేటే! సంబరం సూడకుండా" దూరా నుండి ఓ పొలికేక వినబడింది. అది సొట్ట మావది.

సొట్టమావది కూడా వేటపాలెమే. చిన్నప్పుడు దీన్ని వాడికిచ్చి కట్ట బెట్టాలని చూశారు. వయసొచ్చాక ఈ సొట్టాడు నాకొద్దని వీడ్ని కట్టుకుంది.

"ఓరి మావా! ఆ సచ్చినోడు నన్నొగ్గేసి పోయినాడు. సీరల కొట్టు కాడుంటాడు. నువ్వెళ్ళి సూపిరా. ఏ రంగేనా సరేనని సెప్పి కొనేసి బేగీ రమ్మను. పొద్దుకూకి పోనాది" అని కేకెట్టింది సొట్టమావ కేసి.

"సరే! నువ్వాడే కూకో" అని గుంపులో మాయమయ్యాడు సొట్ట మావ.

పొద్దు నెత్తికెక్కింది. వాడి జాడ లేదు. ఆరాటం పెరిగింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. చీర తడిసి ఒంటికి అంటుకుపోయింది. చుట్టూ వున్న

వాళ్ళు తనకేసి అదోలా చూస్తున్నారు. బిక్కచచ్చి గోళ్ళు కొరుక్కుంటూ కూర్చుంది.

అంబలి తాగుదామని గిన్నెలో పోసుకుంది. హితవు కాలేదు. గిన్నెని గోదాట్లో వంపేసింది.

నావ తట్టుమీద నిలబడి పాపాలెత్తి తీర్థం అంతా కలియజూసింది.

దూరంగా వున్న రంగుల రాట్నంలో గుర్రానెక్కిన ఓ కున్న పోతు, హంసనెక్కిన పడుచుదాన్ని కొంగట్టుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ దున్నపోతు పోవెనకే గిరగిర తిరుగుతున్న ఉయ్యాలలో బడితె లాంటి గోచీరాయుడొకడు నల్ల కళ్ళజోడు తగిలించుకొని ప్రక్కనున్న పచ్చచీరతో సరసాలాడుతున్నాడు. వాడే తన మొగుడేమో అనిపించినా 'ఛా! కాదులేనని' వూరుకొంది.

పొద్దు పడమటికి వాలింది. దానికి సహనం చచ్చిపోయింది. వాడ్ని వదిలేసి నావట్టుకు చక్కా పోదామనుకుంది. తిప్పను తప్పిస్తుంటే సొట్ట మావ వగురుస్తూ వచ్చాడు.

"ఓలోసి! నీ మొగుడు సింగారి కొంగట్టుకు ఏలాడుతున్నాడు."

కొయ్యబారిపోయి గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయింది అది.

"అవును అమ్మతోడు! నువ్వు సెప్పావని సీరల కొట్టుకాడికెళ్ళినా, ఆడక్కడ నేడు. ఓలంత దూరంలో మినను గానుగకాడ సెరుకురసం తాగుతున్నారు సింగారీ, ఆడూనూ. ఆళ్ళక్కడ్నించి గాజులకొట్టుకెళ్ళారు. అది గాజులు ఏసుకుంటుంటే ఈడు కొట్లో నల్ల కళ్ళద్దాలు ఎట్టేసుకొని సూసుకొన్నాడు. అది బాలేదని లాగేసి ఇంకో కళ్ళజోడు తగిలించిందాడికి. ఆడే రెంటికీ డబ్బులిచ్చాడు. ఎంతిచ్చాడో నాకెరికనేదు."

"దాని గుడిసేటికాపురం బుగ్గయిపోను" అంటూ గొల్లుమని కూలబడింది అది. కాసేపటికి తేరుకొని "అది ఏ సీర కట్టుకొంది" అని అడిగింది వెక్కుతూ.

"పచ్చరంగు."

"ఓరి నాయనో, ఓలమ్మోయ్! అందరి మొగుళ్ళు ఈ లంజకే కావాలి. ఇంకెవ్వరినీ తిన్నగా కాపురం సేయనీడులాగుంది. బాబోయ్ దాని సైపు మాడ.... దాని కళ్ళు కాకులు పొడవా.... దాని ఒళ్ళు దున్నపోతు కుమ్మ" అంటూ శాపనార్థాలు పెడుతూ మెలి తిరిగిపోయింది- చేతివేళ్ళతో ఇసుక దున్నేస్తూ.

సొట్టమావ యింకా చెప్పుకుపోతున్నాడు. "ఆడనుంచి చెరుగ్గడ తింటూ లబ్బరుసెప్పుకేసుకుని అల్లంత దూరంలో రెల్లుదుబ్బులు కాడికి పోతుంటే సూసా, తిరిగొత్తారుకదా అని సూసి సూసి నీకు చెప్పాలి కదా అని లగెత్తుకొచ్చేసా."

దానికి సివాలెత్తేసింది.

"ఓరి మావా! ఈ ఏలనుంచి ఆడికి నాకు సెల్లిపోనాది. ఆడి తాళి ఆడిమొగాన కొట్టేసి రేపు ఈ ఏలకి నీ చేత కట్టించుకొంటా. రా! నావెక్కు" అంటూ వాడి చెయ్యట్టుకుని బరబరా లాక్కెళ్ళి తొట్టిలో కుదేసి కట్టుతాడు వదిలేసింది. నావ రేవులోని పడవలను రాసుకుంటూ ప్రవాహంలోకి పడింది.

"ఓసెక్కడికే లాక్కుపోతున్నావు. పొద్దుగూకిందంటే రేపు నావ వదిలేత్తారు. నన్నొగ్గెయ్యి" గోడుపెట్టాడు సొట్టమావ.

వాడి మాటలేవీ వినిపించుకోటంలేదు. బుసలు కొడుతూ ఏక బిగిన తెడ్డేసి కొండ చాటుకు పోనిస్తోంది నావను.

"ఆడొక్కడినే ఎందుకు పోనిచ్చావు యెర్రి మొగమా! నువ్వూ ఆడెంటే పోవాల్సింది."

"కాదు మావా! సీరట్టుకు రమ్మన్నాను. ఆ సచ్చినోడు సేతిలో డబ్బడితే ఆడు ఏం సేత్తాడో ఆ దేవుడికే ఎరుక. నాగులసవితినాడు కోకట్టు కొస్తానని సీతానగరం కాడ సంతకెళ్ళి సత్తుగిన్నట్టుకొచ్చాడు. ఏటిరా, ఈ గిన్నట్టుకొచ్చావని నిగ్గీసి అడిగితే, 'నా కూడు ఈ గిన్నెలోనే పెట్టు. నేను నీ ఎంగిలి గిన్నెలో తినను" అని బిగిసిపోనాడు."

"అందులో తప్పేముందేస్?"

"ఎంగిలిట ఎంగిలి! సెమటెట్టి ఒళ్ళంతా సిరాకెత్తిపోతుంటే నా మూతి నాకే నంజకొడుక్కి ఎంగిలి పనికి రానేదేటి."

"పోనీలేపి! అయ్యన్నీ యిప్పుడెందుకు? నావ తిప్పేయి జేగీ పోదారి"

నావ కొండ మొదలికి చేరింది. చుట్టూ కనుచూపు మేరలో మరే నావా లేదు. తెడ్డొదిలేసి తొట్టి నడుమ సొట్టమావ ముందు నిలబడింది.

కొండగాలికి చెదిరిన పమిట తెరటాల్లా గాలిలోకి తేలిపోతోంది.

విరబోసిన జుట్టు విసురుగా ముఖమంతా పాకేస్తోంది.

"మావ! నిన్ను సేసుకోమంటే బుద్ధి గుడిసేటిదయి ఆడిని సేసుకొన్నాను. నాకు బాగా సాస్తి అయింది. నేనీ చనం నుంచీ నీ దాన్ని. నన్ను నీ యిట్టం వచ్చినట్టు సేసుకో" అంటూ చేతులు బారచాపి కళ్ళు మూసేసుకుంది.

వాడు తనపై పడి వాటేసుకోవాలని, దారుణంగా తనని చెరచాలని, కసికీరా తను చెడాలని ఆశించింది.

కానీ, నిముషాలు గడిచినా ఏమీ జరగలేదు. కళ్ళు తెరిచి చూసింది. నీరసంగా ముడుచుకు కూర్చున్నాడు సొట్ట మావ.

ఏటాలస్యం అన్నట్టు వాడికేసి సూటిగా చూసింది.

"ఓలొసి ! ఈయాల శివరేతిరి. నే నట్టాంటి ఎదవపన్లు సేయనే" అన్నాడు బెదురు చూపులు చూస్తూ.

"ఎదవ సన్నాసి— నువ్వూ ఇంతేనన్న మాట." అనుకొని గిర్రున తెడ్డును మరింత గిర్రుమని తిప్పుతూ నావను మళ్ళించింది.

నిమిషాలమీద నావ సంబరం చేరుకుంది.

# 3

అంతా చీకటిమయం. తెల్లని ఇసుక తిప్పల నడుమ నల్లని గోదావరి నిశ్శబ్దంగా పారుతోంది. పరిచిన గొంగళిలో గొంగళి పురుగులా మందకొడిగా సాగుతోందా నావ.

రేవులో దానికి, దాని మొగుడికి మధ్య జరిగిన ముష్టి యుద్ధాన్ని తనివితీరా చూసిన జనాభా ఆఖరికి కలగజేసుకుని చివాట్లెట్టి వారిమధ్య రాజీ కుదర్చడంలో విఫలమై "మీ వూరెళ్ళి అక్కడ తాపీగా తేల్చుకోండి" అని సలహా చెప్పి బలవంతంగా ఆ జంటని నావలో ఎక్కించి నావని గెంటారు.

బుసలు కొడుతూ పడిచెక్క నానుకొని తొట్టిలో కూర్చుంది అది.

బిగుసుకుపోయి అవరం తట్టుమీద కూర్చున్నాడు వాడు. పాదాలకు కొత్త హవాయి చెప్పులు, కళ్ళకి గంతల్లాంటి నల్ల కళ్ళజోడు వాడిని ఇంకా అంటిపెట్టుకొన్నాయి.

చుట్టూ చలిగా వున్నా ఆ ఎడముఖం పెడముఖం మధ్యనున్న గాలి భగ్గు భగ్గున మండిపోవడంతో చిరుచెమట్లు పట్టాయి దానికి, వాడికి.

గంటలు గడిచాయి. ప్రయాణం సాగటంలేదు. ఇంకా గమ్యానికి సగం పైచిలుకు దూరం వుంది.

చుక్క పొడిచింది. వెలుతురు మసగ్గా వుంది. ఒళ్ళు విరుచుకుని ఆవలించాడు వాడు.

ఏదో అలికిడి విన్నట్టయింది. తాటి దూలం లాంటిది నీటిలో దూసుకు పోతున్నట్లనిపించింది. ఏమిటో తెలుసుకోడానికి తొట్టెలో తన వల తీసి యథాలాపంగా విసిరాడు. వలతాడు బిగుసుకుంది. ఎంత లాగినా రాలేదు.

నీటిలో పెద్ద బుడగలు వచ్చాయి. ఆ బుడగలను చీల్చి రెండు గజాల ఎత్తుకెగిరింది ఏదో ఆకారం.

అదో పెద్ద చేపని పసికట్టాడు.

వల తాడుతో పాటు దానికి చిక్కిన గేలం తాడు కూడా తన చేతిలో వుండడం గమనించాడు. రెంటినీ మెలేసి గట్టిగా పట్టుకున్నాడు.

వలబావతు రాతి పూసలు, వాటితోపాటు గేలం, చేప తల ప్రక్కనున్న మొప్పలో ఇరుక్కుపోయాయి. వాటిని విడుల్చుకోడానికి చేప గిలగిల్లాడింది.

"అమ్మనీయమ్మ పండుగొప్ప" అని బిగ్గరగా అరిచాడు వాడు— తనలో తనే.

బారెడు పొడుగున్న ఆ చేపని పండు గొప్పంటారు. సాధారణంగా అలాంటి చేపలు ఆ ప్రాంతానికి రావడం అరుదు. మనిషంత బరువుండే ఆ చేపకి నీటిలో మనిషికన్న పదిరెట్లు శక్తుంటుంది. అలాంటి చేపల్ని పట్టడానికి ప్రత్యేకమైన వలలుంటాయి. వీడు విసిరిన గేలం ఆ చేప మొప్పలో తగులుకోడం అన్నది అరుదుగా జరిగే విశేషం.

తాళ్ళను బలంగా లాగి పడిచెక్కకు కట్టేశాడు. జలాంతర్గామిలా

చేప ప్రవాహానికి ఎదురు తిరిగింది. దానితో నావ అడ్డం తిరగగా, పెద్ద కెరటం లేచి నావలో పడింది. నావలో మడమదాకా నీళ్ళు చేరాయి.

అది చూసి విసుక్కుంది అది.

చేప తన వేగాన్ని రెట్టింపుచేసి ప్రవాహాన్ని చీలుస్తూ నావని లాక్కుపోతోంది.

చేపకీ, నావకీ నాలుగు బారలు దూరం వుంది. ఆ దూరాన్ని తగ్గించటానికి వల తాడుని లాగబోయి పట్టుతప్పి దభీమని తొట్టిలో కూలబడ్డాడు వాడు ! ఆ అదురులో పదిలంగా ముక్కు మీదకు జారిన కళ్ళజోడు ఎగిరి గోదాట్లో పడింది. రబ్బరు చెప్పుల పట్టీలు తెగిపోయాయి.



అది చూసి ఫక్కున నవ్వింది అది.

తెగిన చెప్పులను గోదాట్లో విసిరేశాడు వాడు, పౌరుషం వచ్చి.

ఆ రెండు వస్తువులూ అలా గోదాట్లో కొట్టుకుపోతుంటే సింగారే కొట్టుకుపోయి పీడ వదిలినట్లనిపించింది దానికి.

అప్పటిదాకా ఏమీ పట్టించుకోనిదల్లా ఆవలిస్తూ ఒళ్ళు విరిచి తన వల తీసి చేపకేసి ఒడుపుగా విసిరింది.

వల విసరడంలో దానికదే సాటి. విల్లులా శరీరాన్ని వంచి గిర్రున తిరుగుతూ వలవిసిరితే అది గురితప్పక సూటిగా పువ్వులా విచ్చుకుంటుంది.

ఆ వల పూర్తిగా కప్పేయడంతో చేప బెదిరి తన దిశ మార్చి అడ్డం తిరిగి వల తప్పించుకుంది.

దాంతో నావ కూడా వున్నట్టుండి అడ్డం తిరిగింది. ఆ క్షణంలో వల తాడు కాస్త వదులు అవడం గమనించి బిగియలాగి కొయ్య పెట్టెకి చుట్టేశాడు వాడు.

దానితో చేపకి, నావకిమధ్య దూరం రెండు బారల లోపులో పడింది.

చేప నావని గిరగిర తిప్పసాగింది. వలతాడు తెగిపోయింది. గేలం తాడు మాత్రం మిగిలింది. అదీ ఏ క్షణానయినా తెగిపోవచ్చు. చేజిక్కిన చేప జారిపోవచ్చు.

దక్షీమని చేపమీదకి దూకేశాడు వాడు. దానితో కలియబడి దాని తలని వాటేసుకుని మొప్పల్లో అరచేతులు రెండూ దూర్చేశాడు.

చేపకి భయంకరమైన కోపం వచ్చింది. పొలుసులన్నీ నిక్కపొడుచుకున్నాయి. సర్రుమని తోక జాడించి వాడి ఛాతీని మట్టెతో ఢీకొట్టింది.

వాడు గిలగిల్లాడి పోయాడు.

అపురికి గేలం తాడు కాస్తా తెగిపోయింది.

చేప వాడి వేళ్ళను కరవబోయింది. వాడు ఒడుపుగా దాని దవడలను సాగదీసి పట్టుకున్నాడు.

నావ దూరమై, నావ భారం వదలగానే చేప విజృంభించి వాడితో ముఖాముఖి యుద్ధానికి దిగింది.

అక్కడ గోదావరి రెండు తాళ్ళ లోతుంటుంది. వాడు దాని గెడ్డం పట్టుకుని వ్రేలాడుతున్నాడు.

వున్నట్టుండి వాడిని లోతులోకి ఈడ్చేసింది. వాడు బాణంలా దాన్తో పాటే దూసుకుపోతున్నాడు.

మరుక్షణం జువ్వలా నీటిమట్టంపైకి తేలింది. వాడూ పైకితేలి చుట్టూ కలియ చూశాడు.

నావ బాగా దూరమైపోయింది.

మళ్ళీ వాడిని లోతులోకి లాగేసింది. అలా పైకి, క్రిందికి ఈదుతూ వాడి పట్టు వదుల్చుకోడానికి ప్రయత్నిస్తోందా చేప.

కాలికో బండరాయి తగలటంతో దానిని తన్నిపెట్టి బలవంతాన చేపని వాలు ఈతకి మళ్ళించాడు.

దానితో నావ దగ్గరైంది.

వాడికోసం వేయి కళ్ళతో చూస్తూ కూర్చుంది అది- పైకి తేలగానే వాటంచూసి కట్టుతాడు విసరడానికి.

నాలుగైదుసార్లు ప్రయత్నించిన మీదట కట్టుతాడు వాడికందింది. అమాంతం ఒక చెయ్యి వదులు చేసుకుని తాడు కొసని చేప మొప్పలోకి దూర్చి రెండోచెయ్యి కూడా తప్పించుకొని పీటముడి వేసేశాడు.

అప్పటికే వాడెంతో అలిసిపోయాడు. తాడట్టుకు పైకి తేలి నావ ఎక్కాడు.

ఉన్నట్టుండి చేప లోతులోకి దూసుకుపోయింది. దాంతో నావ ఒక ప్రక్కకి వాలింది. మరికాస్త వాలితే తొట్టిలోకి నీళ్ళు ఎక్కి మునిగిపోతుంది. అప్పటికే తొట్టిలోకి చాలా నీళ్ళు ఎక్కేశాయి.

వాడు- అది నీటిలోకి దిగి నావ అవతల ప్రక్కన వ్రేల్లాడారు.... నావని తూకంగా వుంచడంకోసం.

చేప స్థిమితంగా పోయింది.

అది కాసేపు సేద తీర్చుకొని మళ్ళీ విజృంభిస్తుందన్న సంగతి వాడికీ తెలుసు, దానికీ తెలుసు!

"ఒసే! నువ్వు కోలేసి మెరకున్న కాడికి నావని పట్టించు. నేను తొట్టిలో నీళ్ళుతోడేస్తా" అనడమేమిటి ఇద్దరూ శక్తిమేర రంగంలోకిదూకారు.

అది ఒంటి కోలేస్తూ నావని తిప్పకేసి నడిపిస్తూంటే. వాడు జబ్బ పులిసిపోయేలా తాటాకు చేదతో నీళ్ళు తోడేస్తున్నాడు.

ఇంకో పదిబారల్లో మెరక తగుల్తుందనగా చేప మళ్ళీ విజృంభించి ఎదురు వడిలోకి నావని లాక్కుపోయింది.

"లాబంలేదు మావా. సేప అలిసిపోయేదాకా అంతే. దాన్ని నావ కాడికి లాక్కొచ్చి అలిసేటట్టు సేద్దాం."

దానిమాట నిజమేనని, చేపకి కట్టిన తాడు బలంగా లాగనారంభించాడు వాడు. అదీ వాడికి తోడైంది. ఇద్దరూ తొట్టిలో వంగలను తన్నిపెట్టుకొని తాడు లాగడం మొదలెట్టారు.

ఎంతో శ్రమపడితేకాని మూరెడుతాడు ముందుకు రాలేదు.

ఇద్దరికీ కసి పెరిగింది.

పళ్ళు బిగించి శక్తినంతా కూడదీసుకొని తాడును లాగారు.

కట్టుతాడు తెంపుకోడానికి చేప బారెడు ఎత్తు గాలిలోకి ఎగిరింది. దాంతో తాడు వదులవడం, దానిని బిగించెయ్యడం తృటిలో జరిగిపోయాయి.

ఇప్పుడు చేప నావకి గజం లోపులో వుంది.

తెడ్డుచ్చుకొని దాని నుద్దుమీద కొట్టాడు వాడు.

చేప తన దేహాన్ని చుట్టలా చేసుకుని బలంగా తోక జాడించింది.

అంతలా తోక జాడిస్తే, చేప అలిసిపోతుంది.

కాబట్టి కొయ్యకర్రతో దాని నుద్దుమీద తెగ బాదుడు బాదడం మొదలెట్టాడు వాడు.

కాసేపటికి చేప నిశ్చలమైపోయింది.

తక్షణం వాడు లేచి, అది కోల పుచ్చుకొని నావని ప్రవాహానికి ఏటవాలుగా ఇసుక తిప్పకేసి మళ్ళించాడు.

నావ బొపతు 'మాకు' తిప్పలోకి దూసుకుపోగానే కట్టుతాడు విప్పి చేపని తిప్పమీదకి లాక్కుపోదామనుకున్నాడు వాడు.

ముడి విప్పుతున్న వాడిని చూడగానే చేప ఉగ్రురాలైంది. బలంగా తోక జాడించింది. వాడి నీపు తట్టు రేగిపోయింది. దాంతో వాడికి రోషం వచ్చి మొప్పట్టుకొని కోల కొయ్యను దాని గొంతుకలో దిగేశాడు.

చేప చచ్చినట్టు ఊరుకుంది.

చేపని గట్టుకు చేర్చేసరికి వాళ్ళిద్దరికీ ఎక్కడలేని నీరసం ఆవహించింది.

ఏదో విజయం సాధించామన్న గర్వంకన్నా- అది పెట్టిన యాతనకు గండం తప్పినట్టయింది వాళ్ళకి.

రెప్పవాల్చకుండా రెప్పలులేని చేప కళ్ళను చూస్తూ వుండిపోయారు ఒగరుస్తూ చాలా సేపు.

"నా సామిరంగా! ఈ ఏడు మనకు శివరేతిరి.

సీరలు, రైకలు, గాజులు. పట్టీలు, ముక్కుపుడక, రింగులు, సెంటు నూనె, బొట్టుపెట్టె అన్నీ కొనితెత్తాలే" అంటూ లేచాడు వాడు.

"నువ్విలాగే అంటావు. అయన్నీ ఆ సింగారి నంజకే కొనిత్తావు" అంది కటువుగా.

"స్సీ! దానూ సెత్తమాక నాకాడ. దాని సోకుమాడ.అది పైనపటారం- అంతా ఎముకల గూడు. వది జనవలు ఎత్తినా దానికి నీ నిండు రాదసే" అంటూ తన పైపుకి తిప్పుకున్నాడు దానిని.

ఖళ్ళున తెల్లారింది.

# బైరాగి

రేవు దాటడానికి నావకోసం టిక్కెట్టు కొనబోతూంటే కట్టు తాడు కొరికేసి, దౌడుతీసింది కుక్కపిల్ల.

దానిని పట్టుకోవడానికి పరగడుపునే చెడుగుడు ఆటయిపోయింది మన్మథరావుకి. కుక్కపిల్లని చంకలో బిగించి, రొప్పుతూ రేవు చేరేసరికి, నావనికాస్తా వదిలేశాడు సరంగు.

"ఇదిగో సరంగూ. కాస్త ఆగు! నన్ను కూడా ఎక్కించుకో, అవతల రేవులో బస్సు వెళ్ళిపోతుంది. ఏయ్ నిన్నే! టిక్కెట్టు కొన్నాను. చిల్లర లేదంటే ముప్ఫై పైసలకి ఏకంగా రూపాయిచ్చాను రేవు గుమాస్తాకి. అప్పోయ్! బస్సు అందకపోతే ఆఫీసు టైమ్‌లో అందుకోలేను. కొంప లంటుకుంటాయి నాకు. ఇదిగో నిన్నే అదనంగా రూపాయిస్తాను. రెండు

పుచ్చుకుంది గానిలే.... పోనీ ఐదూ.... సరే! ఆగు. పదిరూపాయలిస్తాను"
అని ప్రాధేయపడ్డాడు మన్మథరావు.

"ఆ అబ్బాయిగారేదో పది రూపాయిలిస్తానంటున్నారు. వెనక్కి మళ్ళించి ఎక్కించుకోకూడదవా పోలయ్యా!" అన్నాడు నావ సరంగుతో-నావలో కూర్చుని తత్వం పాడుతున్న కళ్ళులేని బైరాగి.

తెరచాప దింపి తెడ్డేసి నావని వెనక్కి మళ్ళించాడు సరంగు. 'హమ్మయ్య' అనుకున్నాడు మన్మథం.

నావంతా ఆడా మగా, పిల్లా మేకలతో కిక్కిరిసి వుంది. దానికి సాయం ఆ ఫిర్కాలోని మైనరుబాబు ఒకడు సగం నావ ఆక్రమించేసి, సైకిల్‌కి స్టేండు వేసి పట్టుకు నుంచున్నాడు.

నావ మధ్య కూర్చున్నాడు గుడ్డి బైరాగి. చేతుల బనీను, గులాబి రంగు పంచె, నెరిసిన గడ్డం, గిరజాల జుట్టు, పంగనామం, చెవులో గన్నేరుపువ్వు, చేతిలో తంబురా. ఎప్పుడూ నావలో కూర్చుని అరిగి పోయిన గ్రామ్‌ఫోను ప్లేటులా ఒకే చరణాన్ని పదేపదే పొద్దస్తమానం పాడుతుంటాడు. బైరాగి లేకుండా రేవులో ఏ నావా కదలదు.

బైరాగి చుట్టూ కూరే నారే చేసుకునే జనం కూర్చుని పాటలను శ్రద్ధగా వింటున్నారు. 'ఏ తీరుగ నను దయచూసెదవో.... రామా' బైరాగి చరణం.

మన్మథం నావ పడి చెక్కమీద కూర్చుని, వాళ్ళోని కుక్కపిల్లని దువ్వుతూ, మచ్చిక చేసుకుంటున్నాడు.

తెరచాప విప్పి కొయ్యమీద కెక్కిస్తూ, "బాబుగారూ! తొట్టెలో కూర్చోండి. మెరకున్నకాడ గడెయ్యడానికి అడ్డొస్తారు" అన్నాడు సరంగు.

"పర్వాలేదు, నుంచుంటా" అని నుంచోబోయాడు మన్మథం.

"గాలిపోటు ముదిరిందంటే, పరమానుకాడు పీక్కి చుట్టుకుని తూలి గోదాట్లో పడగలరు తమరు. మీకు సాయం చంకలో కుక్క పిల్లొకటి. అది యీదెయ్యగలదనుకోండి. మరి మీకీతొచ్చో లేదో సూసుకోండి. అయినా మద్దెన నాకెందుకు. మీ యిట్టం" అన్నాడు తెరచాప తాళ్ళను కట్టడంలో సరంగుకి సాయపడుతున్న ఓ వైతన్న.

"బాబుగారూ! 'మాకు' దగ్గర తాళ్ళ చుట్ట ఒకటి వుండాలి. దాని మీద కూర్చోండి" అన్నాడు వై రాగి.

నావ ముందుభాగాన్ని తాళ్ళచుట్ట కట్టబడింది. రెండు అడుగులు ముందుకేశాడు మన్మథం.



"నిమ్మది నాయనా! యీ మడి జాడీ పట్టుకోగలవు. కాస్త అసుంటా నడు" అని హెచ్చరించింది. తాళ్ళకట్ట ప్రక్కన కూర్చుని, చిన్నసైజు జాడీని కాపలా కాస్తున్న, ఓ నడివయస్సు మనిషి.

తాళ్ళమీద చతికిలబడ్డాడు మన్మథం. స్థలం మార్పుకి విసిగేసిన కుక్కపిల్ల 'భౌ' మంది. దాని అరుపుకి అదిరిపడి 'మే' అంది పిల్ల మేక.

'ఫరవాలేదు. అది మన జోలికి రాదులే' అని మేక భాషలో 'మే! మే!' అని ధైర్యం చెప్పింది తల్లి మేక.

'ఏ తీరుగ నను దయచూసెదవో' చరణం ఆపి "బాబుగారూ కుక్కపిల్లను పెంచుతున్నారా ? మంచి జాతికుక్క కామోసు తమరిది" అడిగాడు బైరాగి.

"కాదు లెహెస్ ! అది వూరకుక్క. కరణంగారి జాగిలం డాక్టరు గారి సీమకుక్కతో క్రాసింగయింది, ఆ మధ్దిన. పిల్లల్ని వూరంతా పంచి పెట్టాడు కరణం. దాని బాపతే అయివుండాలి యిది" అన్నాడు మైనరు బాబు.

కుక్కపిల్ల ఘనాలు తడుముకోడాన్ని మన్మథం చూడలేదు. మైనరు దీన్ని ఊరకుక్క అన్నందుకు వొళ్ళు మండింది. ఈ పల్లెటూరి బైతుకి కుక్కల గురించి ఏం తెలుసులే అని వూరుకున్నాడు.

"అయితే బాబుగారూ, కరణంగారికి మీరు చుట్టమా ?" బైరాగి ప్రశ్న.

ఆ కరణం తన మామ అనాలో, లేక తను కరణం అల్లుడి ననాలో తేల్చుకునే లోగా "మీరు వారి అల్లుడుగారా?" అని అడిగేశాడు బైరాగి.

'ఊ!' అని టూకీగా సమాధానం చెప్పాడు మన్మథం, ఈ ముష్టాడితో కబుర్లేమిటని.

"కరణంగారి అల్లుళ్ళందరిపీ పెద్ద వుద్యోగాలని చెప్పుకుంటారు. తమరు కూడా ఏదో గొప్ప వుద్యోగం చేస్తూ వుండాలి."

"వీడికి యివన్నీ చెప్పడం ఏమిటి" అని వూరుకున్నాడు కాని, అందరూ తనకేసి కుతూహలంగా చూస్తున్నారని గ్రహించి గుమాస్తానని

చెప్పుకోడానికి నామోషిపడి "కాకినాడ స్టేట్ బ్యాంకులో పని" అన్నాడు కప్పదాటుగా.

"మేనేజరుగిరా బాబూ!"

"ఆ !" అన్నాడు యింతటితో పూరుకుంటాడన్న ఖరోసాతో.

"మరక్కడ కృష్ణమూర్తిగారు కదా మేనేజరు, వారికీ కోనసీమే లెండి. మారాజు, రేవు దాటినప్పుడల్లా పలకరించి ఓ రూపాయి దానం చేసేవారు."

"ఆయన కింద అసిస్టెంటు మేనేజర్ని" అని బుకాయించాడు మన్మథం.

"వారి అసిస్టెంటుగా భజగోవిందంగారు కదా పనిచేస్తూ వుంట ?"

గొంతులో వెలక్కాయ పడ్డట్టయింది మన్మథానికి. 'ఈ గడ్డి పీనుక్కి యిన్ని వివరాలు ఎలా తెలుసు చెప్మా?' అని ఆశ్చర్యపోయాడు.

"వారు పంటపూజుల లావాదేవీల్లో అప్పుడప్పుడు వస్తూ వుండే వారు లెండి. ఏమాట కామాటే చెప్పుకోవాలి. నా చేతుల్లో ఎప్పుడూ గుప్పెడు చిల్లర పోసేవారు."

వీడు డొంకంతా కదిపేస్తున్నాడు. కొంప తీసి బ్లాక్ మెయిల్ చేస్తా డేమోనని భయపడి పర్సులోంచి రెండు రూపాయల కాగితం తీసి "యిదిగో యింద" అంటూ రెండడుగులు ముందుకేసి, బైరాగి చేతిలో పెట్టాడు మన్మథం.

ఆ రెండడుగులూ ముందుకు వేస్తూంటే "అసుంటా, అసుంటా. జాడీ మట్టుకు తగలెయ్యగలరు" అంది బోడెమ్మ గొంతు చించుకుంటూ.

"ఎవరూ సూరమ్మగారా ! అమ్మాయిని చూడ్డానికి పట్నం వెళు తున్నారా తల్లీ!" అని పలకరించాడు బైరాగి.

"ఆవకాయ రోజులు కదా! అమ్మాయిది బొత్తిగా ఆడదిక్కు లేని సంసారమాయె. కాస్త సాయం చెయ్యడానికి వెళ్తున్నాను" అంటూ కొంగు ముడిలోంచి ఐదుపైసలు తీసి "అలా అతనికియ్యి" అని ప్రక్కనున్న షావుకారికి అందించింది. షావుకారు "యింద, ఆరికియ్యి" అంటూ అడ్డపొగ కాలుస్తూ, బండ కొడవలితో వీపు గోక్కుంటున్న గడ్డి మోపావిడకి అందించాడు. నోట్లోంచి చుట్ట తీసి, గుప్పున పొగవదిలి "యిదిగో సూసోక ఐదుపైసలు" అంటూ ఆ బైరాగి చేతిలో పెట్టింది- ఆ గడ్డిమోపు.

"ఎవరూ చిట్టెమ్మా! కమ్మని పొగవాసన తగలగానే అనుకున్నాను, నా పక్క కూర్చున్నది చిట్టెమ్మేనని. ఇందరు చుట్టలు కాలుస్తారు కాని, నీ దగ్గరున్న కమ్మదనం ఎవరికీ రాదంటే నమ్ము చిట్టెమ్మా" అని పొగిడాడు బైరాగి.

చిట్టెమ్మ ఐసైపోయి. బొగ్గోంచి నాలుగు పొగాకు పాయలు తీసి, ఓ పాయ ఇవ్వబోయి మూడుపాయ లిచ్చేసింది బైరాగికి.

అంటుకున్న పొగాకు బావతు ఘాటు పీలుస్తూ చిట్టెమ్మెప్పుడూ చిట్టెమ్మే అని మెచ్చుకున్నాడు బైరాగి.

అలా అనగానే ప్రక్కనున్న అప్పాయమ్మకి పౌరుషం వచ్చి, బుట్టి లోంచి అమ్మకానికి తీసుకెళుతున్న మామిడిపళ్ళను ఓ పుంజుడుతీసి, ఇంద అని బైరాగి వాళ్ళో వేసింది.

"అప్పాయమ్మ చేతికి ఎముకలుండవు. ఎంతండితే అంత. అప్పాయమ్మా, నిన్ను అందరూ చక్కని చుక్క అంటారు. నీ అందాన్ని, నీ మంచి మనసులో చూస్తున్నాను" అని తేరగా పొగిడాడు బైరాగి.

అప్పాయమ్మ మరింత పొంగిపోయి, మరో రెండు పళ్ళుతీసి, "పోలయ్యమామా వా యింద" అంటూ సరంగు చేతికి అందించింది.

"అలా నావని నమ్ముకు బ్రతుకుతున్నాడు పాపం: ఈ గుడ్డివాడు" అని ప్రతి వ్యక్తీ సానుభూతి జూపిస్తాడు బైరాగి మీద. నావకి కట్టవలసిన ముప్పై పైసలు కాక. బైరాగికో ఐదుపైసలు కూడా- తెక్కేసుకొని రేవు కొస్తారు అక్కడి జనాభా.

ఇంకెందుకు ఆలస్యం అన్నట్టు, తక్కినవారు కొంగుముళ్ళు, పంచె కుచ్చిళ్ళు తడుముకొని బైరాగికి వరసగా పుడుపు చెల్లింపారు.

"తిరిగొచ్చేటప్పుడు యిస్తా తాతా" అంది అలా యివ్వనందున బాధ పడిన ఓ పల్లెపడుచు.

"ఎవరూ నాగమల్లా! ఏంటి పిల్లా పల్లోకి యింత లేటుగా వెళు తున్నావు" బైరాగి పలకరింపు.

"ఇయ్యాల బట్టువాడా రోజు" అంది బిగ్గా కప్పుకున్న వోణీ కొస ముందుకి లాగి గాలికి ఎగరకుండా గట్టిగా పట్టుకు కూర్చుని. తెల్లదారంతో కుట్టిన నల్లరంగు జాకెట్టు, చాలీ చాలని చిలకాకుపచ్చ వోణీ, వెలిసి పోయిన పరికిణీ, దోసిమెడా, చెంపల్లో ప్లాస్టిక్కు సీతాకోకచిలుక, కొప్పులో మందార పువ్వు, దాయలేని నిండు యౌవనపు అంగ సౌష్టవంతో, పంచ కల్యాణిలా, ఏపుగా వుండా నాగమల్లి అనే పల్లెపడుచు. ఆ పడుచు పక్కనే నుంచున్నాడు మైనరుబాబు. ప్రతి కదలికలో ఆమెలోని అందాన్ని అడపాతడపా కళ్ళతో జుర్రేస్తూ, తెడ్డు పూపుకి నావ అల్లల్లాడగా కుసుపు కుసుపుకీ, తన మోకాలితో ఆమె వీపుని రాపాడించేస్తూ బులపాటం తీర్చేసు కుంటున్నాడు- ఏమీ ఎరగనట్టే ఆకాశంలోకి చూస్తూ.

ముందుకు జరిగితే పళ్ళుబుట్ట, వెనక్కి జరిగితే మోకాలు పోట్లు,

ఒక పక్క సైకిలు, మరొకపక్క మేకలు— పద్మవ్యూహంలో చిక్కడి నట్టు చిక్కచచ్చి బిగుసుకుపోయిందా పంచకల్యాణి. వీపు మధ్దనకి వొళ్ళు పులిసిపోయి యింక భరించలేక చెంప పిన్ను తీసి బలంగా మైనరు కాలి మడంమీద కసిగా పోటు పొడిచి, మేకలున్న కేసి జరిగి కూర్చుంది- ఏమీ తెలియనట్టు.

"అమ్మా" అన్నాడు మైనరు. పిల్ల మేకకు కొప్పుకోని మందారం నోటి కందడంతో, కొప్పుతోసహా మేసేస్తూవుంటే "స్, పాడు" అంది నాగమల్లి. ఈ రెండు పదాలా ఒకేసారి వినపడడంతో, ఏమిటా అని చూశాడు అటుకేసి వైరాగి. చరణం ఆపి తన చెవులటు సారించాడు. మైనరు భుజాలు తడుముకుని, ఆ చేత్తోనే జేబులు కూడా తడిమి ఓ రూపాయి కాగితం తీసి వైరాగికిచ్చాడు- ఎప్పుడూ యివ్వని వాడు.

"అదేంటిబాబూ, కూలాళ్ళమధ్య నించున్నారు, కామందులు. క్లాసుగా తాళ్ళ చుట్టమీద బాబుగారి పక్కన కూర్చోలేకపోయారా?" అన్నాడు వైరాగి— రూపాయి కాగితం మడిచి జేబులో వేసుకుంటూ.

పర్వాలేదని కాలరు సర్దుకొని హేండిల్ బారుమీద మద్దెలకొడుతూ, దిక్కులు చూడసాగాడు మైనరు- సూదిపోటుకి రక్తం కారి నెప్పెడుతున్నా, కిక్కురుమనకుండా.

"ఏ తీరుగ నను దయ చూసెదవో...." వైరాగి చరణం.

"కుక్క 'భౌ' మంది. పిల్ల మేక 'మే' అంది. తల్లి మేక 'మే! మే!!' అంది.

దూరంనించి బస్సు బావతు గేసు హారను గావుకేకలా వినబడింది. కంగారుపడ్డాడు మన్మథం— బస్సు వెళ్ళిపోతుందేమోనని.

"మీరేం కంగారుపడకండి బాబుగారూ! యీ నావ వెళ్తే కాని బస్సు కదలదు" అని గ్యారంటీ యిచ్చాడు వైరాగి.

"వీడికి కష్ట పిశాచం వుంది కాబోలు" అని ఆశ్చర్యపడ్డాడు మన్మథం.

కుక్కపిల్ల మళ్ళా "భే" మంది-పిల్ల మేక "మే" అంది.

"ఎందుకలా చెవికోసిన మేకలా అరుస్తావు?" అని మేకభాషలో "మే! మే!" అని కోప్పడింది తల్లి మేక.

"ఏ తీరుగ నను దయ చూసెదవో...." బైరాగి చరణం.

మన్మథరావు మనసు కుదుటపడింది. చల్లని గోదావరి, హాయిగా వీస్తున్న పైరుగాలి, అద్భుతమైన ప్రకృతి సౌందర్యం, అమాంతం అతన్ని వూపేశాయి. మైమరచి శూన్యంలోకి చూస్తూ వుండిపోయాడు.

కెవ్వుమని పిడుగులా కేకెట్టింది సూరమ్మనే బోడెమ్మ. ఆ కేకకు ఆకాశం అదిరింది. గోదావరి స్తంభించిపోయింది. సరంగు హడలిపోయి చీకుతున్న మామిడిటెంకను గుటుక్కున మింగేసి, చుక్కాని వదిలేశాడు. చుక్కానిలేని నావలా, నావ అటూ యిటూ వొల్లింది. ఆ కుదుపుకి సైకిలు అటు పడగా, దాన్ని పట్టుకోడం మానేసి, ఇటుపడి దొరికింది ఛాన్సు అని, నాగమల్లిమీద పడి వాటేసుకున్నాడు మైనరు. "ఏ ఓమ్మాడ" అని మైనరుని బలంగా ఓ తోపు తోసింది నాగమల్లి. దెబ్బతో అప్పాయమ్మ, చిట్టెమ్మల మధ్యనున్న మామిడిపండ్ల గంపమీద దభీమని బోర్లాపడ్డాడు మైనరు. మిగల ముగ్గినపళ్ళు చితికి చిందగా రసం కాస్తా చిట్టెమ్మమీద పడింది. కంగారుపడ్డ చిట్టెమ్మ అడ్డపొగ బాపతు నిప్పు నాలిక్కంటుకుంది. తుప్పుమని ఉమ్మేసిందా చుట్టని. అదెళ్ళి బైరాగి ముఖంమీద పడింది. బైరాగి బెదిరి తంబూరాను గట్టిగా మీటాడు. తీగతెగి ఎగిరి షావుకారి పీకకు చుట్టు కుంది. బాబోయ్ అంటూ డబ్బుల సంచీని గట్టిగా పట్టుకుని కళ్ళు మూసేసు కున్నాడు ఆ షావుకారు. యివన్నీ ఒక త్రుటిలో జరిగిపోయాయి.

"హయ్యో—హయ్యో!" అని మళ్ళీ గావుకేక పెట్టింది సూరమ్మ. అందరూ అటు చూశారు.

నున్నగా కనబడ్డ జాడీని చూసి ముచ్చట పడి, కాలెత్తి హాయిగా తడిపేస్తూంది ఆ కుక్కపిల్ల.

ఛీఛీ అంటూ కుక్కని పీక పట్టుకు లాగాడు మన్మథం.

"కై!" అంది కుక్కపిల్ల.

ఆ అరుపువిన్న పిల్లమేక మతిపోయి 'భా' మంది. అదివిన్న తల్లి మేక కన్ఫ్యూజు అయి భౌభౌ మంది.

అసలు ఏం జరిగిందో తెలియని గడ్డి బైరాగి "వోదసె చూయద నను గరుతీ ఏ" అని రివర్సు పాడేస్తున్నాడు తనూ కన్ఫ్యూజయి.

అలా నావంతా గగ్గోలయి సగ్గోలు అవడానికి కొన్ని క్షణాలు పట్టింది.

"నిక్షేపంలాంటి జాడీ కుక్క ముట్టుకుపోయింది. ఈ పాపం ఊరికే పోదు. రౌరవాది నరకాలు అనుభవిస్తారు - ఆ కుక్క మనుషులు" అంది సూరమ్మ.

"ఇంతోటి దానికి నరకాని కెళ్ళాలని శాపాలెట్టాలమ్మా సూరమ్మా" అని బొప్పట్టాడు బైరాగి.

"ఇంతోటి విషయంటయ్యా యిది!? నా పెళ్ళయిన కొత్తలో మా పుట్టింటారు యిచ్చిన జాడీ! పెయ్యికళ్ళతో మడిగా చూసుకుంటున్నాను యిన్నాళ్ళూ. కష్టపడి సంపాదిస్తేరాని, మళ్ళీ వస్తుందా ఈ జాడీ!"

"మా కష్టపడి సంపాదిస్తున్నావమ్మా. రూపాయికి రూపాయి వడ్డీ కట్టి...." ఏదో అనబోయాడు చైతన్య.

"మగదిక్కు లేనిదాన్ని ఏం చేయమంటావు. మొగుణ్ణొదిలేసిన మీ పెద్దమ్మాయిలా వీధులమ్మట తిరిగి పేడెత్తి, పిడకలద్దమంటావా? వుంత లమ్మటపోయి పుల్ల లేరమంటావా? లేక మీ ఆవిడలా పక్కింటి దడి పీకెయ్యమంటావా?" అంది ఏక బిగిని సాగదీస్తూ.

నోటికి హద్దూ పద్దూ లేకుండా పరువు తీసేస్తున్నందుకు, తన నోరు మూసేసుకున్నాడు చైతన్య.

తనకేం సంబంధం లేనట్టు ధీమాగా కూర్చున్నాడు మన్మథం.

"సర్లేవమ్మా! నువ్వేం నష్టపోకు. దానిఖరీదెంతో చెప్పు. బాబుగారు నీకిచ్చేస్తారు" అని తుని తగువు తీర్చాడు బైరాగి.

అదిరిపడి జాడీకేసి చూశాడు మన్మథం- దాని ఖరీదు ఏమాత్రం వుంటుందోనని. 'మహావుంటే ఐదో, ఆరో వుంటుంది. మొగాన్ని కొట్టె య్యొచ్చు' అని ఖరారు చేసుకున్నాడు.

"షావుకారూ! నువ్వు చెప్పవమ్మా ఆ జాడీ ఖరీదెంతుంటుందో" అడిగాడు బైరాగి.

"ఆ! వుండకేం, వుంటుంది. నేనీ మద్దినే తొమ్మిది రూపాయల ఏభై పైసలకమ్మాను కొట్టుకాడ" అన్నాడు. రెండు రూపాయలు ఎక్కువే పెలకట్టి.

"ఇంకా నయం. నిరుటేరోజుల్లో పాత రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగారి భార్య పందరూపాయలిస్తాను, ఆ జాడీ నాకివ్వమని జాళ్ళా పేళ్ళా పడింది. అవ్వొచ్చిన పిత్రార్జితం జాడీ కదా అని, ససేమిరా అన్నాను. యిది యీస్టిండియా కంపెనీనాటి జాడి! సిసలైన లండను సరుకు."

"అవును. మరే! యిప్పుడు లండను సరుకు బజారులో ఎక్క డుంకి" సాక్ష్యం చెప్పాడు షావుకారు.

ఆడంగులందరూ ఆ జాడీకేసి చూశారు. 'లంకసంటే యిలాగే వుంటుంది కామోసు' అనుకున్నారు.

"ఇది తరతరాలనాటి జాడీ. మా అమ్మ కర్మం కాలి ముండమోస్తే, మనోవర్తి లేకుండా ఎలాగో నన్ను పెంచి పెళ్ళిచేసి, ఈ జాడీ నాకిచ్చింది. నా తల చెడ్డా నేనెలాగో నెట్టుకొచ్చి మా పిల్లకి పెళ్ళిచేశాను. యిప్పుడీ జాడీ, దానికందజేద్దామనుకుంటే, పాపిష్టివాళ్ళు ముదనష్టపు కుక్కతో ముట్టించేశారు" అని భోరున ఏడిచింది చిర్రున చీదేస్తూ.

"అబ్బా—వూరుకోవమ్మా! ఆ పందా బాబుగారు యిచ్చేస్తారులే" అని వూరడించాడు బైరాగి - అత్త సొమ్ము అల్లుడు దానం చేసినట్టు.

అదిరిపడి, మరోసారి జాడీకేసి చూశాడు మన్మథం.

పందపెడితే ఆ సైజు వెండి జాడీయే వస్తుంది అనుకున్నాడు. బోడెమ్మ పేరాశకి మనసులోనే తిట్టుకున్నాడు. సతీసహగమన నిషేధ చట్టాన్ని రద్దుచేసి, యిలాంటివాళ్ళకు స్ట్రిక్టుగా అమలుపరచనందుకు గవర్నమెంటుమీద మనసులో కోపడ్డాడు.

ఆ పందా యిస్తాడా, లేదా అని అందరూ తనకేసే కనురెప్ప వాల్చకుండా చూస్తున్నారన్న సంగతి గ్రహించాడు మన్మథం. ఠపీమని జేబులో చెయ్యెట్టి పర్సు లాగాడు - ఓ పదో, పరకో పారేద్దామని.

"వెనకటికో దొరగారు పెంపుడు కుక్కకోసం తాజ్‌మహల్‌లాంటి గోరీ కట్టించాట్ట. పెంచిన మమకారం అంటే అలాంటిది. బాబుగారుమట్టుకు తక్కువా? కుక్కకోసం బ్యాంకినే పడెయ్యగలరు" అన్నాడు బైరాగి జనాంతికంగా.

ఆ మాటలను కుక్క జ్ఞానంతో కుక్క గ్రహించింది. అమాంతం మన్మథంమీద ప్రేమ, అభిమానం, భక్తి విశ్వాసం అన్నీ కలగాపులగంగా పుట్టుకొచ్చి, మన్మథం చేతులు నాకేస్తూ పర్సునికూడా నాకబోయి, పొరపాటున వేలు కొరికేసింది. ఒక్క విదుపులో పర్సు షావుకారు వొళ్ళో పడింది. నోట్లకట్టలు విచ్చుకున్నాయి. సూరమ్మ కళ్ళు మెరిశాయి.

"అలా డబ్బుని విసిరి కొట్టకూడదు నాయనా-కళ్ళోతాయి" అంది సూరమ్మ.

"ఇదిగో తీసుకోండి" అని వందరూపాయల నోటు సూరమ్మ కిచ్చాడు షావుకారు.

"చివర సున్నావుంటే అరిష్టం నాయనా. మాటవొకటి చెయ్యాలి, మరో రూపాయి యియ్యి" అంది సూరమ్మ.

మరో రూపాయి కూడా యిచ్చి పర్సుని మన్మథానికి అందించాడు షావుకారు.

"ఈ రూపాయి ఆ బైరాగాయనకిచ్చెయి నాయనా యిచ్చేవాళ్ళకే తప్ప పుచ్చుకున్నవాళ్ళకి వుండదు శంఖ" అనగానే అంచెలంచెలుగా బైరాగి జేబులో చేరింది ఆ రూపాయి.

జాడీకేసి చూశాడు మన్మథం. జాడీని ఆప్యాయంగా వేళ్ళతో నిమురుతూంది సూరమ్మ.

'ఆ జాడీ వదులు అది నాది' అన్నట్టు చూశాడు మన్మథం.

"కుక్క ముట్టుకున్న జాడీ తీసుకుంటావా నాయనా! నిక్షేపంలా వాడుకోవచ్చు. దాని మట్టులో చిన్న బీట వుంది. కాస్త చింతపండు పూస్తే, వూటకారినా పిండిమట్టుకు కారదు. యింద తీసుకో" అంది.

"చిల్లుజాడీ ఆరేంజేసుకుంటారు. యిలా యియ్యి, చిల్ల రేసు కుంటాను" అన్నాడు బైరాగి. మరుక్షణంలో జాడీ బైరాగిని చేరింది.

జుట్టు పీకేసుకుని గట్టిగా అరచి గోదాట్లోకి దూకేద్దామనుకున్నాడు— ఒళ్ళు కుత కుతలాడిపోతున్న మన్మథం. కాని పేంటు, షర్టు తడిసిపోతా యని మానేశాడు.

"పోలయ్యా! గేదెలకీ, ఆవులకీ పుచ్చుకున్నట్టు బాబుగారి దగ్గర కుక్కకి లగేజి పుచ్చుకోకు. వారసలే కొత్త. ఐదు రూపాయలే పుచ్చుకో. సరదాపడి యింకో రూపాయిస్తే పుచ్చుకో, కాని అడక్కు. వారు అదనంగా పదిరూపాయలు యిస్తానన్నారు కనక, మొత్తం పదహారే పుచ్చుకో. పొరుగూరి వారని మోసం చేశావా దేముడు క్షమించడు" సరంగుకి వార్నింగిచ్చాడు బైరాగి.

ఏడవలేక వూరుకున్నాడు మన్మథం. కుక్క నోరుమూసి, పీక పిసికి గోదాట్లో పడేద్దామన్నంత కోపం వచ్చింది. జీవహింస పాపం అని మానే శాడు.

"నా మామ కుక్కనెందుకు పెంచాలి? పెంచినా ఆ కుక్క ఎందుకు యీనాలి? యీనినా, కుక్క కావాలని మరదలు ఎందుకు రాయాలి? రాసినా, కుక్కను పెంచాలని సరదా నాకెందుకు పుట్టాలి? పుట్టినా శలవు చూసుకోకుండా, నేనెందుకు బయలుదేరాలి? దేరినా, ఆ కుక్కకి ఒక గొలుసు ఎందుకు కొనకుండా రావాలి? వచ్చినా, చంకలోని కుక్కను

ఎందుకు జారవిడాలి? డాలినా, ఆ కుక్క జాడీని ఎందుకు పావనం చెయ్యాలి? యిలా గొలుసుకట్టుగా ఆలోచించుకుంటూ .... నిశ్శబ్దంగా గొంతుకు చించుకుంటూ తనని తనే ఆడిపోసుకుంటున్నాడు మన్మథం.

కుక్క భౌ మంది సానుభూతిగా.

"ఛీ నోరుముయ్యి" అన్నాడు మన్మథం.

మాబాగా అయింది అనుకుని 'మే' అని నవ్వింది మేకపిల్ల.

"ఛా! పాపం తప్పు" అని 'మేమే' అంది నవ్వు బలవంతంగా ఆపుకుంటూ తల్లి మేక.

"పళ్ళన్నీ చితికి ముద్దయిపోయినాయి" అంది తట్టలో పళ్ళు కెలుకుతూ అప్పాయమ్మ.

నావ జనాభా యావత్తూ, మైనరుకేసి చూసింది—దీనికేం సమాధానం చెపుతావన్నట్టు.

"ఒ సేవ్ అప్పాయీ! సందాళ యింటికాడ కనబడు. తట్ట ఖరీదిచ్చేస్తాను" అన్నాడు మైనరు - జేబురుమాలతో పేంటుకంటుకున్న రసం తుడుచుకుంటూ.

"అయ్, యీ పళ్ళన్నీ రసం పిండి, తాండ్రచేసి, మీకే యిచ్చేస్తాను లెండి" ముఖం చాటంత చేసుకున్న అప్పాయమ్మ చుట్టూ చిందిన రసాన్ని తట్టలోకి పోస్తూ అంది.

"అక్కరలేదు. అదికూడా నువ్వే అమ్ముకో" అన్నాడు మైనరు—వుదారత వలకపోస్తూ.

"వాళ్ళిద్దరి మధ్యనా ఎలాంటి కనక్షన్లున్నాయో, మనకెందుకులే" అనుకున్నారు నావ జనాభా.

"ఈ రొంపిలోంచి బయట పడ్డానికి, యింకా పావుగంట పట్టొచ్చు" వాచీ చూసి అనుకున్నాడు మన్మథం.

ఆవతల రేవునుండి బయలుదేరిన నావ, యీ నావకి ఎదురయింది.

"ఒరేయ్ పోలిగా-పోలిగా, డమాను దింపు. డమాను దింపు. గోసు కాడ చేరతా" అని పడవభాషలో కూశాడు ఆవతల నావ సరంగు.

"ఓయ్ ఎహేస్. గోసుకాడికొద్దు. పయిల కాడికిరా— పయిలు కాడికి" అని పడవభాషలో సమాధానం కూసి, తెడ్డుని రైతన్న కందించి, తెరచాప తాళ్ళు వదులుచేసి, తెరచాప దింపాడు పోలయ్య. ఆవతల నావ సరంగు కూడా తెరచాప దింపాడు. రెండు నావలూ తెడ్లమీద దగ్గరకు చేరాయి. రెండింటినీ తాళ్ళతో బిగించారు.

బైరాగి లేచాడు. జాగ్రత్తగా ఆవతల నావలోకి నడిచాడు. అవతల నావలో అతని స్థానం కాళీ చెయ్యబడింది. తాపీగా చతికిలబడి, చరణం మొదలెట్టాడు. నావలో సంచలనం కలిగింది. అందరూ బొడ్లు, కొంగు ముడులూ తడుముకుని, చిల్లర్లు వెతుకుతున్నారు.

తాళ్ళు విప్పబడి నావలు విడిపోయాయి. కాస్త దూరం వెళ్ళాక, యథావిధిగా తెరచాపలు విచ్చుకున్నాయి.

దూరంనుంచి "వెళ్ళిపోతానోయ్" అంటూ బస్సు కారుకూతలు కూస్తూంది.

బస్సు దొరుకుతుందన్న ఆశ మన్మథానికి పూర్తిగా పోయింది. యీ

ముష్టి వెధవకోసం మరో పావుగంట ఆలస్యమయినందుకు వొళ్ళంతా కంపరమెత్తి పోయింది. ఒళ్ళంతా పాకేసి, ఆ కంపరాన్నంతా నాకేసిందా కుక్కపిల్ల. "నేనంటే దీనికి ఎంత యిదో" అని మురిసిపోయాడు మన్మథం. "దీనికేం పేరు పెట్టాలి చెప్మా" అని ఆలోచించాడు. దాన్ని చేరదీయగానే జాడీని కరాబుచేసి, చేతి చమురు వదిలించింది కనుక "జాడీ" అని పేరు పెడదామనుకున్నాడు. "ఛా! జాడీ అంటే బాగోదు. "జార్" అని పేరు పెడదాం" అనుకున్నాడు. "జార్" అని మెల్లిగా అన్నాడు. కుక్క క్రీగంటితో చూసి, టపా టపా తోకాడించింది. "జార్—జార్" అని రెండుసార్లు అన్నాడు. కుక్క ఛాతీపై కెగబ్రాకి, బుగ్గ నాకేసి ముద్దుపెట్టేసుకుంది. అయితే దీనిపేరు "జార్" అని ఖాయపరిచాడు మన్మథం.

ఎట్టకేలకు నావ రేవుచేరింది. బస్సుహారను మోగుతూంది. రేవులోకి దూకబోయాడు మన్మథం.

"బాబుగారూ ఆగండి" అన్నాడు సరంగు. నావలోని జనాభా యావత్తు రేవులోకి దిగుతున్నారు. మైనరు సైకిలు బెల్లువాయిస్తూ గట్టెక్కుతున్నాడు. అతని వెనకాలే అప్పాయమ్మ వయ్యారంగా నడుస్తూంది. నాగమల్లి కొప్పు సవరించుకుంటూ నావ దిగింది. మైనరు బెల్‌బాటమ్ మీద రక్తం మరకలు చూసి కసిదీరా ఆనందపడింది. చిట్టెమ్మ చీర దులిపి, గోచీ బిగించి, చుట్ట అంటించింది. పోలయ్య గడ్డిమోపు ఆమె నెత్తిమీద కెక్కించాడు. రైతన్న భుజానున్న తువ్వాలు దులిపి, తలపాగా కట్టి, సూరమ్మకేసి కోపంగా చూసి, గట్టుమీదకు దూసుకుపోయాడు. షావుకారు అంగవస్త్రం కుచ్చిళ్ళు బిగిస్తూ నడిచాడు. తల్లి మేక వడిచెక్క ఎక్కి వాటం చూసుకుని, గట్టుమీదకు దూకింది. పిల్లమేక కుక్కపిల్లని వెక్కిరించి, గట్టుమీదకు దూకబోయి, నీట్లోపడి నీళ్ళు దులుపుకుని పారిపోయింది సిగ్గేసి.

"వస్తాను నాయనా. జాగ్రత్తగా వెళ్ళు" అంది శూర్పణఖ అప్పగారైన సూరమ్మ-మనసులో యింకో రెండుజాడీలు తెచ్చి కుక్కకి ముట్టించలేకపోయానని బాధపడుతూ.

అందరూ వెళ్ళాక "బాబుగారూ పదహారు రూపాయలివ్వండి" అన్నాడు సరంగు.

చిర్రెత్తిపోయింది మన్మథానికి. "ఏం ఎందుకివ్వాలి? నేనివ్వను. కావాలంటే ఈ ఐదు తీసుకో" అన్నాడు కచ్చితంగా.

"అదేంటి బాబూ! పది రూపాయలిస్తామంటేకదా—కోసెడు దూరం నుంచి పడవ మళ్ళించాను. లేకుంటే పదినిమిషాలు ముందుగా చేరేవోణ్ణి యీ రేవుకి. యిచ్చెయ్యండి బాబు- పెద్దారు. మీకు మర్యాదకాదు!"

"టిక్కెట్టుకొన్న నాకు రెండు నిమిషాలు లేటైతే, పదిరూపాయలా? మరి ఆ గుడ్డినాయాలని, ఆ పడవలో కెక్కించటంకోసం అరగంటచేశావు. వానికేం చెబుతావు?"

"అయ్యబాబోయ్ అదేంటి బాబూ, యిస్తానన్నప్పుడు పెద్దతరంగా యిచ్చేయాలిగాని, ఏరుదాటి పేచీ పెట్టడం ధరమంకాదు బాబూ."

"ఏరా నా కొడకా—నేను ఆ ముష్టినాయాల కంటే తీసిపోయానట్రా?"

"అమ్మనాయనోయ్ నా కొంప ముంచేశారు. మీది పొరుగూరు కనుక నిజం చెప్పేస్తున్నాను. అరు మామూలు నాయాలు కాదండి. ఈ రెండునావలూ ఆరివే. ఆరే ఈ రేవులో నావలన్నిటికీ ఓనరు. సందాళ ఈ డబ్బు యివ్వకపోతే, నా జీతంలో తెగ్గొడతాడు. పేనోణ్ణి బాబా" అని కాళ్ళట్టుకున్నాడు సరంగు.

మన్మథరావు కొయ్యబారి పోయాడు. బస్సు బయలుదేరుతూ కొట్టిన హారను వినబడలేదు.

# అప్పుడు-ఇప్పుడు

అతడు ఆ మన్యానికి ఫారెస్టు రేంజరు. ఆ ప్రాంతమంతా అతనికి కరతలామలకమే! కాని ఆ రోజు పరిస్థితివేరు.

కొండ అవతల తోపులో వెదుళ్ళ వేలాన్ని అజమాయిషీ చేసి వంటరిగా తిరిగొస్తూంటే అనుకోకుండా తగిలిందా గాలివాన. రెండు కొండలు దాటితేగాని పోచమ్మ గండి రాదు. గండిదాటి తిప్పంతా నడిస్తేగాని గోదావరి తగలదు. గోదావరి దాటితేగాని తన మకాం చేరుకోలేడు.

అసలే ఎత్తయినకొండ. కొండకు తోడు దట్టమైన అడవి. అడవికి తోడు హోరున వాన. వానకుతోడు కటిక చీకటి. చీకటికి తోడు పురుగు పుట్ర భయం. గాలికి విరిగిపడిన కొమ్మలు, రెమ్మలతో నిండిన కాలిబాట, బాటమ్మట వర్షపు నీటి జలపాతం, బరువెక్కిన బూట్లు, తడిసి ముద్దయిన యూనిఫారం, అద్దం పగిలి ముల్లాడిన చేతి గడియారం. రిపేరులోపడ్డ బ్యాటరీలైటు, ఇదీ పరిస్థితి. ఏదో వయసులో ఉన్నవాడు గనుక సరిపోయింది గాని మరొకడైతే ఈ భీభత్సానికి తట్టుకోలేకపోను.

మెరుపుల వెలుతురులో దారిని పోల్చుకుంటూ నానా యాతనపడి పోచమ్మ గండిదాటి గోదావరి తిప్ప చేరేసరికి తల ప్రాణం తోకకొచ్చినట్లయింది.

ఇల్లు చేరాలంటే గోదారి దాటి అద్దరికెళ్ళాలి. ఈ వర్షానికి వాగులు పొంగి గోదారికి పోటొస్తుందన్న భయంతో ఇద్దరిని నావలు కట్టరు. కనుక నావ దొరకడం అసంభవం. ఆ సంగతి తెలిసికూడా కాళ్ళీడ్చుకుంటూ తిప్పలుపడి తిప్పంతా నడిచి రేవు చేరాడు అతను.

అనుకున్నట్లే అక్కడ నావలు లేవు. అన్నీ అద్దరినే కట్టేసి వున్నాయి.

వాన జోరు మరింత హెచ్చింది. దానికి సాయం ఈదురుగాలి ఒకటి. చినుకులు ముఖాన్ని సూదుల్లా గ్రుచ్చుతున్నాయి. మెత్తబడిన దొరటోపీని ముఖానికి అడ్డుపెట్టుకున్నాడు. తడిసిన యూనిఫారం శరీరాని కంటుకు పోవడంతో చలికి రక్తం ఘనీభవించే పరిస్థితి ఏర్పడింది. దారీ తెన్నూ తోచక మెదడు మొద్దుబారి తిప్పమీద చతికిలపడ్డాడు.

అలా క్షణాలు యుగాలుగా గడుస్తున్న సమయంలో చటుక్కున జ్ఞాపకం వచ్చింది అతనికి- గండి కానుకున్న చింతలతోపులో రెండుమూడు పూరి గుడిశలు తనెప్పుడో చూసినట్లు. రాత్రక్కడ గడిపేయ వచ్చనే ధైర్యం వచ్చింది. భారంగా కదిలాడు.

* * *

చింతతోపు అంతా చిందర వందరగా వుంది. కుండపోతగా కురిసిన జలప్రవాహంతో చిన్న మడుగులా వుంది. చుట్టూ కలియజూశాడు. తోపు నడుమ ఏవో గుడిసెలు కనబడ్డాయి. ముందుకు సాగాడు. కాని అక్కడ వున్నది ఒక్కటే గుడిశ. అది రెండు నిట్టాళ్ళ పాక. ఆ పాక కానుకుని

గొడ్లసావిడిలాంటి ఓ పందిరి వుంది. పందిరి గాలికి సగం కూలిపోగా గొడ్లను పందిరిబయట కట్టుకొయ్యకు కట్టేసినట్టున్నారు. అవి బెదిరి కంగారుగా తాళ్ళు మెలేసుకు తిరుగుతున్నాయి. పాకకేసి నడిచాడు. గుమ్మానికి కట్టిన తడికలోంచి వెలుతురు కనబడింది. అంటే లోపల ఎవరో ఉన్నారన్నమాట. ప్రాణం లేచొచ్చి గుమ్మంకేసి నడిచాడు. గుమ్మం చేరకుండానే చూరు చాటునుంచి ఓ కుక్క భౌభౌ మంటూ మొరగసాగింది.

"వచ్చావా మగడా! నీ ఆలి ఎలా సచ్చిందో సూద్దానికొచ్చావా! అసలు నీకు ఇంటేసు ఉంటేగదా! రా సూడు! కొంప ఎలా మునిగిందో!" అంటూ భళ్ళున తడిక తలుపు తెరిచిందో స్త్రీ ఆకారం.

నిలువెల్లా తడిసి ఒంటిబట్టతో ఉన్న ఆ స్త్రీ పసుపుకోక కట్టిన తుమ్మమొద్దులా కనిపించింది చీకట్లో. తటపటాయిస్తూ నిలబడ్డాడతను.

"ఎవరారు!" అడిగింది ఆమె.

అతనేమి జవాబు చెప్పాడో కుక్క మొరుగులో వినపడలేదు.

"ఛ! ఎదవ కుక్క" అనగానే కుక్క నోరు మూసుకుంది.

అతనిని ఎగాదిగా చూసి "ఎవరు బాబు మీరు" అంది ఆమె తడిక చాటుకు తప్పుకుని.

"గోదావరి అవతల నా మకాం. నావదొరక్క ఇక్కడ చిక్కడ్డాను వర్షంగా ఉంటే" అని నీళ్ళు నమిలాడు.

గుమ్మం గుండా వీస్తున్న ఈదురుగాలికి గుడ్డిదీపం రెపరెపలాడి ఆరే ప్రమాదం కలిగింది.

"లోనికొస్తారా" అంది సందేహిస్తూ.

అతనూ సందేహిస్తూనే గుడిశెలోనికి అడుగెట్టాడు.

అదొక చిన్న పాక. గట్టి గాలి వేస్తే ఎగిరిపోయేలా వుంది. అప్ప టికే నడికొప్పుమీద ఆకులు చెదిరి అక్కడక్కడా కురుస్తోంది. ఆ పంచలో ఒక మూల నెగడేసిన పొయ్యుంది. ఆ పొయ్యున్న భాగానికి పొగచూరిన దడి అడ్డుగా వుంది. కుండలు, తప్పాళాలు, పుల్లా పుడక దడివార పేర్చబడి వున్నాయి. మరో మూల నులకమంచమొకటి గోడ కాన్చబడి వున్నది. ఒక నిట్రాటకి రెండు లేగ దూడలు కట్టబడి వున్నాయి. ముట్టెలకు కట్టిన చిక్కాలను వదులుచేసుకోడానికి అవి మూతులు నేలకు రాస్తూ శాయశక్తులా ప్రయత్నిస్తున్నాయి. మరో నిట్రాటకి ఒక మేక కట్టబడి వుంది. దాని ముందు ఓ మోపెడు చింతరెబ్బ పడేసి వుంది. చింతాకును ఏకాగ్రతతో మేస్తూంది ఆ మేక. మరో మూల కోళ్ళ వూతలో కోడిపిట్టల బిలబిలలు, తల్లి కోడి రెక్కల టపటపలు వినబడుతున్నాయి. చిట్టూ, తవుడు బుట్టలతో, గోశెం గోతాలతో గుడిశంతా కిక్కిరిసి గగ్గోలుగా వుంది.

"అయ్యని, అమ్మని ఒగ్గేసి యీడమ్మట వచ్చేశాను బాగా సూసు కుంటాడని. యీడికి నా ఊసే లేదు. ఇంత గాలోనలో ఏమైపోతుందో ఆడసూతురు అన్న గేనం కూడ లేదు సన్నాసికి" పొయ్యి ముందు కూల బడిన ఆమె స్వగతం.

'ఇదేదో లేపుకువచ్చిన బాపతు లాగుంది. అందుకే ఈ నట్టడవిలో కాపురం పెట్టింది' అనుకున్నాడు అతను- ఆమె మాటల్లో కరుకుదనం చూసి ఆమె వికార స్వరూపాన్ని యిట్టే చూడకుండానే వూహిస్తూ.

"ఉత్తప్పుడు మెలేసుకుని తొంగుంటాడు. కట్టాలొచ్చినప్పుడు ఒగ్గే స్తాడు" అంటూ సణుగుడు.

"ఓహో! అదా సంగతి. దీనికో విటుడున్నాడన్నమాట. వాడెవడో రాక్షసుడై వుండాలి" అతని ఊహ.

"ఆ పోశమ్మ తల్లి ఆడికొక్కటే సొట్ట చేసింది. ఆడి రెండు కాళ్ళు తీసేసుంటె ఈడే పడుండేవాడు సచ్చినోడు."

"ఓహో! అదా సంగతి. ఇదే ఓ కుంటాడిని లేపుకొచ్చిందన్న మాట" విషయం అర్థమయింది అతనికి.

వర్షం హోరు మరీ పెరిగింది. ఉరుములు పరంపరలు చెవులు గింగురులెత్తిస్తున్నాయి. వాటిని మించి ఆ కంచు కంఠపు గొణుగుడు అత నిని కంపరమెత్తించేస్తూంది.

"కొంపలోకి ఎవడైనా దూరి చెయ్యేట్టుకు సెరిసినా దిక్కులేదు. కలికాలం. సూటు బూటు ఏసుకున్నోళ్ళే ఆడది కనబడితే సాలు అటకా యిస్తున్నారు. నాకిప్పుడేంటి గతి పోశమ్మ తల్లి" అంటూ చిర్రున చీదింది ఆమె, పొయ్యిలో మంట మరింత ఎగదోస్తూ.

దీని మాటలకు హద్దూ పద్దూ లేనట్లుంది. తెగ కూస్తూంది అని కోపం వచ్చిందతనికి. "నావల్ల నీ మానానికి ఏ హానీ కలగదు లేవమ్మా, తల్లీ?" అందామనుకున్నాడు.

అలాంటిదేదో అనే వుంటాడనుకుందామె. "అది కాదు బాబు! పాలిచ్చి రాడానికి సందేళని ఎళ్ళాడు. అర్ధరేతిరి దాకా ఆడు అద్దరి నూరే గితే నేనేమై పోవాల."

"హానీ లేవమ్మ! నాకు మల్లే నావ దొరక్క అద్దరిని చిక్కడ్డాడేమో. నీకేం భయం లేదు. నేనున్నాగా సాయం" అన్నాడు చలికి వణుకుతున్న కంఠంతో.

"అవేటి బాబుగారు! ఆడే నిలబడిపోయూరు" అంటూ తడికలోంచి రివ్వుమంటూ వచ్చి దూడన్ని, మేకని, తప్పించుకొచ్చి మూలనున్న

మంచాన్ని వాల్చి, "ఈడ కూకోండి!" అంటూ మెరపులా తడికలోకి మాయమైపోయింది ఆమె.

ఆమె చలాకీతనం చూసి 'వయసులో వున్న పడుచే పాపం' అనుకున్నాడు మంచంమీద చతికిలపడుతూ.

"బాబూ! మీరు పారెస్టోళ్ళా" అడిగింది తడికిలోంచి ఆమె.

"అవును. నేనీ అడవికి రేంజరుని" అన్నాడు వెలగని బ్యాటరీ లైటు రిపేరుచేసి వెలిగిస్తూ.

"ఈ కొంపని సూడుబాబు. కాసిని వెదురు పడితేగాని కాయదు. పారస్టోళ్ళకి భయపడతాడు మా సన్నాసి. నాలుగు వెదురు ముక్కలు ఏరుకోనీ బాబూ."

"ఏరుకోవడం ఏం ఖర్మ! నీకు కావలసినవి నరుక్కో. బస్తీ తీసుకెళ్ళి అమ్ముకుంటే నేరంగాని, ఈ అడవిలో గుడిసేసుకోవడానికైతే ఎవరూ కాదనరు."

పొయ్యి దగ్గర ఏదో పనిమీద వుంది కాబోలు కాసేపు సణుగుడు ఆగింది. తను వేసుకున్న కోటు నాని చిరాగ్గా వుంటే విప్పేయాలనిపించిందతనికి. పరస్త్రీ పంచనుండగా సబబు అనిపించలేదు. కడుపులో పైత్యం పరిగెత్తడంతో ఈ రాత్రి ఎలా నడుస్తుందా అని భయపడ్డాడు.

కొంగు కొనతో వేడి వేడి సత్తు చెంబు పట్టుకొని "ఈ పాలు తాగండి బాబు, ఒళ్ళు వెచ్చబడుతుంది" అంది ఆమె అతని ముందుకువచ్చి.

"అవ్వే వస్తు ఇన్ని పాలే" అన్నాడు మొహమాటానికి.

"తీసుకోండిబాబు. మాలాంటి పేదోళ్ళం ఏమివ్వగలం?"

మెరుపుల కాంతిలో అతని దృష్టి గ్లాసు పట్టుకున్న ఆమె వేళ్ళపై

పడింది సన్నని పొడుగాటి కొనదేరిన వేళ్ళు ముట్టుకోవాలనిపించేటంత అందంగా వున్నాయి. ముట్టుకుంటూ గ్లాసు నందుకున్నాడు.

కొంగు అంచు నడుముకు దోపుకుంటూ రెండడుగులు వెనక్కి వేసింది ఆమె. అతని చూపు నాజూకైన ఆమె నడుంమీద పడింది.

ఆమె కదిలింది.

అరటి దూటలాంటి నున్నని కాళ్ళు, చక్కని పాదాలు కనబడ్డాయతనికి.

"ఏటి బాబూ ఆలోసిత్తున్నారు తీసుకోండి. మేము కులం తక్కువోళ్ళం కాదు."

"అబ్బే అదేం లేదు" అంటూ కాస్త పైకి చూశాడు.

పమిటలో నిండుతనపు బిగువు, దాయలేని వంపు సొంపులు ఇనుమడి ఉండడం గమనించాడు. మతిపోయినట్లయింది.

మరి కాస్త పైకి చూశాడు. మునివేళ్ళతో ముంగురులు తోసి, మెడసాచి, వత్తుగా వున్న జుట్టును వేళ్ళతో వెనక్కి దువ్వి పొడుగైన కురులను ఒక దులుపు దులిపి సిగముడేసింది ఆమె.

చంద్రబింబంలాంటి ఆమె ముఖం, కెంపుల్లా మెరుస్తున్న ఆమె కళ్ళు, తీర్చిదిద్దిన ముక్కు, నిండైన పెదవులు, అందానికి అందమిచ్చిన ఆ తీరు తెన్నులు చూడగానే చిత్తైపోయాడు అతను.

"ఏటిబాబూ! వేడిగా వుందా" అన్న ప్రశ్నకి ఈ లోకంలో పడి పాలు చప్పరించాడు.

ఆనందంగా నిట్టూర్చి, చలికి గజగజ చిందులు తొక్కుతూ తడికి లోకి మాయమైంది ఆమె.

ఆ చిందులు నెమలి నృత్యంలా అనిపించాయతనికి.

ఆ పంచనున్నది రంభను తలదన్నిన చల్లభామ అని తెలిసింది. ఘనీభవించిన రక్తం కరిగి ఆవిరిగా మారింది. కోటిప్ప సాగాడు.

"బాబుగారు ఆ కోటు యిలా యివ్వండి. పొయ్యికాడ ఆరేస్తాను" అంటూ మెరుపులా వచ్చి ఆ కోటందుకొని, పిండి గట్టిగా దులిపి మళ్ళీ తడికలోకి వెళ్ళిపోయింది.

ఆమె ప్రతి కదలికలోని హొయలు హంస నడకలా కనబడింది అతనికి.



ఆమె చురుకుదనానికి ముగ్ధుడయ్యాడతను. 'ఎంతచక్కని చుక్క? ఆ యవ్వనం, ఆరోగ్యం అడివి కాసిన వెన్నెల్లా ఓ అవిటివాడికి అంకిత మవడమా' అన్న అసూయ కలిగింది. ఇలాంటి యింపైన యింతి ఈ వాతా వరణంలో కలకాలం ఇలాగే వుండిపోతే ఎంతబాగున్ను అని ఆలోచిస్తూ యాంత్రికంగా బూట్లిప్పసాగాడు.

"బాబుగారు ప్యాంటు కూడ ఒగ్గేయండి, పిండి ఆరేస్తాను" తడిక లోంచి నెమిలి కేక.

ఆ కేకవిన్న అతని ఆశ్చర్యానికి అవధులు లేవు. ఇది కలా నిజమా అనిపించింది. అయినా రవ్వంత సభ్యత అడ్డొచ్చి ఆలోచనలో పడ్డాడు.

తడికలోంచి ఓ తుండు మంచం మీదికి విసిరిందామె.

ఎంత తెగించింది అనుకున్నాడు.

ఆ తుండందుకున్న క్షణం అతనిలో ఆశలు రేకెత్తాయి.

మరుపురాని అనుభవం పొందుతున్నట్లు అనుభూతి కలిగింది. యాంత్రికంగా తుండుగుడ్డ నడుముకు చుట్టి, ప్యాంటు దులిపి తనే తడిక మీద పడేసి-మంచంమీద వాలాడు, ఆమే తన దగ్గరకొస్తుందని.

ఆమె ఎంతకీ రాలేదు.

ఉన్నట్టుండి తడికలోంచి ఏడుపు వినబడింది. తడికకేసి నడిచి తడిక మీదనుంచి ఆమెను చూస్తూ "ఎందుకమ్మా అలా ఏడుస్తావు" అని అడిగాడు.

"ఆడు నన్నొక్క-క్షణం ఇడిచిపెట్టి ఉండలేడు బాబూ! ఆడెక్కడై పోయాడో! ఏం కట్టాలు పడుతున్నాడో!" అంటూ భోరుమంది.

వాడెవరి గురించో ఆలోచిస్తున్నందుకు చిరాకుపేసి, "అసలు వాడెవడో చెప్పు?" నిలేసి అడిగాడు.

"పాల కిష్టయ్యని అద్దరిని పాలోస్తాడు. ఆడే బాబు నా మొగుడు. సందేశనగా వెళ్ళాడు."

పాల కిష్టయ్యనగానే బోడిగుండు, గుండుమీద నిటారుగా నిలిచిన పిలక, ముఖం కప్పేస్తూ పంగనామాలు, మెళ్ళో గవ్వలు చుట్టిన నల్లతాడు,

చెవిలో గన్నేరు పువ్వు, ముక్కుకి ఇత్తడి చుట్టు, చేతికి సత్తుకంకణం, కాలికి తీగ వంకీ, ఎముకలగూడులాంటి శరీరం, దానికి సాయం పొట్టినడక-ఇట్టే ఊహించి ఈ కోతినాయాలుకా ఇలాంటి చక్కనిచుక్క అని మనసులోనే కోప్పడి, తనంతందగాడు తానుగా ఆమెను కనికరించి జీవితంలో ఏమి కోలుపోయిందో దాన్ని రుచి చూపించబోతున్నానన్న ధైర్యం వచ్చి, చొరవ తీసుకుని తడికలోకి వెళ్ళి, ఆమెను సమీపించి, "పిచ్చిపిల్ల- ఎందుకలా ఏడుస్తావు? లే! ఇలారా! అంటూ భుజాలు పట్టుకుని లేవదీశాడతను. దాంతో ఆమె ఏడుపు మరింత రెచ్చిపోయింది.

"నన్ను నా మానాన్న ఒగ్గేయి బాబూ" అంటూ విదిలించుకుని అతనిని నెట్టి తడికవతలకి విసురుగా వెళ్ళింది.

అతనలాగే నిలబడిపోయాడు ఈ గొడవేమిటో అర్థంకాక.

చూరునున్న గుడ్డల మూటను తీసి, అతను రాకుండా హడావిడిగా చీర మార్చి జాకెట్టు బిగిస్తుంటే పిన్నీసు గుచ్చుకుంది కామోసు. పళ్ళు బిగించి మనసులోనే తెవ్వుమని, నెప్పిగా వుంటే చూపుడువేలు దులిపింది.

ఎక్కడనుంచి వూడిపడ్డాడో ఒక్కంగలో గంతేసి "అరె! గుచ్చుకుందా! వుండు చూడనీ" అంటూ ఆమె చెయ్యట్టుకుని ఎంత వారించినా నడిపించి మంచంమీద కుదేసి తనూ కూర్చున్నాడు ప్రక్కన.

"ఏదీ చూడనీ వేలు" అంటూ ఆమె చేతిని తన ఒళ్ళోకి తీసుకుని బ్యాటరీతో వెతికాడు. వేలుమీద నిజంగా ఒక రక్తంబొట్టు ఊరింది.

"అరె! అరె! ఎంత రక్తం? దీనికి మందెయ్యాలి" అంటూ మరింత దగ్గరికి జరిగాడు.

"హొండిబాబూ! ఈ చిన్నదానికి మందేమిటి? రేపు ఇంత సున్నం, బెల్లం కలిపి రాస్తే ఇట్టేపోతుంది" అని చెయ్యి లాక్కోబోయింది.

"ఛ ఛ అలాంటి పని చేయకు. సెప్టిక్ అయిపోగలదు" అంటూ చెయ్యి మరింత గట్టిగా పట్టుకున్నాడు.

"ఆ మధ్దిన ఎర్రావు ఆడిని పొడిస్తే సున్నం, బెల్లానికే తగ్గింది. కాపోతే కాలు కాస్త సొట్టోయింది. ఇప్పుడసలు నొప్పేలేదాడికి" అంది కాస్తదూరంగా జరిగి చెయ్యి లాక్కోటానికి ప్రయత్నిస్తూ.

చెయ్యి బిగింపులో రక్తంబొట్టు మరికాస్త పెద్దదయింది. దాన్నిచూసి కంగారు నటించి చటుక్కున ఆ వేలు నోట్లో పెట్టి చప్పరించాడతను.

ఆమె నిర్ఘాంతపోయింది.

ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

ఒకమూల కృతజ్ఞత, మరోమూల కంపరంతో కూడిన సిగ్గు పేళవించగా అనుమానంతో చూసిందతనికేసి.

నోట్లో వేలు తీసి ఆమె దగ్గరగా జరిగాడు.

బలంగా చెయ్యి విదిలించుకుని లేచి నిలబడింది.

"ఇక్కడ కూర్చో! ఎందుకలా పారిపోతావు. నిన్నేం చెయ్యనులే" అంటూ చేయందుకోబోయేడు.

అతని వాలకం పూర్తిగా అర్థమయిందామెకు. మరీ రెచ్చిపోతాడని భయపడి మంచం చివర కోడుమీద కూర్చుంది ఆమె.

కాసేపు ఇద్దరి మధ్య మౌనం.

"చూడమ్మాయి! నీ పేరేమిటో నాకు తెలియదు" అంటూ ఏదో చెప్పబోయాడు.

"నా పేరుతో పనేంలెండి. కిష్టయ్య పెళ్ళాన్ని నేను."

కిష్టయ్య పేరు వినగానే ఒళ్ళు మండిందతనికి. "చూడు యిలాంటిది

నాకెప్పుడూ కలగలేదు. ఇలా అడవిలో వొంటరిగా ఓ అడవిమల్లె మత్తె క్కిచ్చేస్తూంటే"....ఏదో అనబోయాడు.

"తప్పు బాబూ! మీరు పెద్దోళ్ళు. చదువుకున్నోళ్ళు. మీకలాంటి బుద్ధి పుట్టకూడదు"

"పిచ్చిపిల్లా! యిలాంటి సమయంలో మనం మడికట్టుకు వూరుకున్నా తెలిసిన వాళ్ళెవరూ నమ్మరు. ఎందుకో తెలుసా!"

"పోనీలేండి! మనం నీతిగా వుంటే అనుకున్నోళ్ళు ఆళ్ళపాపాన ఆళ్ళే పోతారు.

"నువ్వే అన్నావు, అయ్యని. అమ్మని వదిలేసి వాడెవడితోనో లేచి వచ్చానని. అలా చేయడం నీతా? పెళ్ళికాకుండా ఇలా సంసారం చేయడాన్ని ఏమంటారో తెలుసా?"

"మనసులు కలవాలిగాని మనువో లెక్కగాదు బాబు. అయినా, మేము పోశమ్మ సాక్షిగా పెళ్ళి చేసుకున్నాం. బతికినన్నాళ్ళు విడిపోమని ఒట్టేసుకున్నాం."

"ఈ రాత్రికి నా కోరిక తీర్చినంత మాత్రాన వాడితో విడిపోయి నట్టా?"

"మనస్సాచ్చికం అంటూ ఒకటుంది బాబూ. కట్టుకున్నోడికే కట్టు బడి వుండమని సెపుతోంది, నా మనసు. నేనాడికి అన్యాయం సెయ్యలేను."

"పింగినాదం. నాకూ పెళ్ళయింది. ఈ రాత్రికి నీతో వున్నంత మాత్రాన నా భార్యకు అన్యాయం చేస్తానా? ఈ నాలుగుగోడల మధ్య జరిగిన విషయం మరుక్షణం మర్చిపోతాం. తరువాత మామూలే. రా! ఇలారా! ఎవరు చూడొచ్చారు" అని చెయ్యందుకో బోయాడు.

"ఎవరు సూడకపోయినా ఆ పోశెమ్మతల్లి సూస్తుంది బాబూ."

"ఆ పోచమ్మ తల్లే ఈ గాలివాన, ఈ ఏకాంతం ఏర్పాటుచేసి నాలాంటివాడ్ని నీ కోసం పంపిందని ఎందుకనుకోకూడదు నువ్వు!"

"అలా అనుకోకూడదు బాబూ. ఈ మాయదారి తుపానులో హడిలి చచ్చేదానికి దేవుడులాంటి మిమ్మల్ని ఆ పోచమ్మ తల్లే తోడు పంపించిందనుకుంటున్నాను బాబూ. అందుకే మా ఇంటికొచ్చిన పెద్దమనిసిగా మీకు గౌరవం ఇచ్చి మర్యాద సేశాను."

ఇది కొరకరాని కొయ్యో, బడుద్ధాయో అర్థం కావటం లేదతనికి.

"చూడమ్మాయి! నీ అంచనాలన్నీ తప్పు. నేను నిన్ను అమాంతంగా బలాత్కరిస్తాను. నాకు లొంగక ఏమి చేస్తావు." అంటూ కాస్త ముందుకు జరిగాడు.

"మీ భార్యగారిని, అంటే మీ ఆడంగుల్ని ఎవరైనా యిలాగే చేస్తే ఆయమ్మ ఏం జేస్తుందో అదే చేస్తా" అంది అతనికేసి కటువుగా సూటిగా చూస్తూ.

చెళ్ళున లెంపకాయ కొట్టినట్టయిందతనికి. మీదికి దూకి దారుణంగా చెరచాలన్నంత కోపం వచ్చిందతనికి. కాని దాని పర్యవసానం ఊహించనంతటి అవివేకి కాడతను. దాంతో కుదేలై ఓపికపట్టి నిట్టూర్చాడు.

నువ్వో లెక్కా అన్నట్టు మౌనంగా తన చేతిగోళ్ళు చూసుకుంటూ కూర్చుందామె.

"నువ్వంటే నాకు జాలేస్తుంది" అన్నాడు ఆమె ధీమాకి ఉడికిపోతూ.

ప్రశ్నార్థకంగా చూసిందతనికేసి.

"నువ్విచ్చిన చనువు నాలో ఏవో ఆశలు రేకెత్తించాయి. నాకు పుట్టగూడని బుద్ధి పుట్టిందని, నాకు బాగా బుద్ధిచెప్పావని నువ్వనుకుంటున్నావు"

"బాబుగారు! అంతపెద్దమాటనకండి. మేము ఏమీలేని పేదోళ్ళం!"

"అదే నా బెంగ. నీ గుడిసెకోసం నాలుగు రాటలు, మోపెడు దొంగలు కావలసి వస్తుంది. అందుకోసం రేపు నువ్వు నా కాళ్ళట్టుకుంటావు. నాకు జరిగిన అవమానానికి నీకో చీపురుపుల్ల అయినా దొరకదు"

ఆమె ముఖంమీద చిరుచెమటలు పెరిశాయి.

"ఈ అడవంతా నాది. నన్ను కాదని ఇక్కడ బ్రతకడం కష్టం. నాతో విరోధం పెట్టుకొన్న నీవేమైపోతావన్నదే నా బెంగ" అంటూ బెదిరిస్తూ జాలిపడుతున్నట్లు ఆమె దగ్గరగా జరిగాడు.

ఆమె నిర్ఘాంతపోయింది.

"ఈ చుట్టుప్రక్కల గూడాల్లో వున్న కొండాళ్ళందరికి నేనెంతంటే అంత. చింతతోపుమీద ఓ కన్నెయ్యంద్రా అంటే రేపీపాటికి నీ పొట్టోడి పీక్కి ఓ తాడు బిగించి చింతచెట్టుకు వేళ్ళాడదీస్తారు. దాంతో ఊరుకోకుండా విప్పసారా పూటుగా పట్టేసి నిన్నే అఘాయిత్యం చేస్తారన్నదే నా బాధ" అంటూ ఆమెకేసి మరింత జాలిగాచూశాడు.

ఆమె పెదిమలు వణికాయి. అవి అతనిని ఆకర్షించాయి.

"బాబుగారూ! ఈ దిక్కు లేనోళ్ళమీద మీ...." అని ఏదో చెప్పబోతున్న ఆమె నోటికి అతని పెదవులు అడ్డుపడ్డాయి. ఆమె మూలుగుతూ అతని బంధాల్లోనుంచి విడిపించుకోటానికి శాయశక్తులా పెనుగులాడసాగింది. అతను తన బలాన్ని ప్రయోగించసాగాడు.

అదే సమయంలో భీకర శబ్దంతో చింతతోపు అవతల పిడుగు పడ్డం, క్షణంలో కొన్నివేల పక్షులు ఎగిరి భయంకరంగా కూయడం, గొడ్లు బెదిరి గావుకేకల్లా అరవడం, కట్లు తెంచుకు గెంతేస్తున్న లేగదూడల ఆర్తనాదపు అంబాలు, హడలి పడిగుండా పారిపోడానికి ప్రయత్ని

స్తున్న మేకపోతు ఢీ కొట్లు, ఆ ఫెళ ఫెళ శబ్దాన్ని మరింత భీకరం చేయటంతో ప్రళయం సంభవించి నట్లయింది.

హడలి నిస్సత్తువైన ఆమె శరీరం కంపించింది. ఆ కంపనాలు ఆతని కామ పిశాచాన్ని నిలువెల్లా గిలిగింతలు పెట్టాయి. కామం విజృంభించింది.

ఉక్కు కడ్డీలాంటి ఆమె శరీరం దూదిపింజంలా మారింది.

*          *          *

వాన వెలిసింది. ఊరతలో తల్లికోడి ఎలుగెత్తి కూసింది. చమురైపోయిన దీపం. కొడిగట్టారిపోయింది. ఇంకా తడారని డ్రస్సు వేసుకుని గుమ్మంకేసి నడిచాడతను.

"ఆగు" అంది ఆమె.

వెనుతిరిగి బ్యాటరీ ఆమెకేసి వేశాడు.

ఆమె అతని సమీపంలోనే వుంది. విరబోసిన జుట్టు. చెరిగిన బొట్టు, చిరిగిన చీర, పిగిలిన రవికతో, మంగళ సూత్రానికి మెలేసి చిక్కడిన బంగారు పులిగోరు లాకెట్టును విడదీస్తూ నిలబడింది. ఆమె కళ్ళు చింత నిప్పుల్లా వున్నాయి. ఆమెని సూటిగా చూడలేకపోయాడు.

"ఇదిగో సూడు. నువ్వు దారుణం సేశావు. పోనీలే. నాకో పీడకల వచ్చిందని సరిపెట్టుకుంటాను. మడిసి రుసి చూసిన పులి మడిసినే మరుగుతుందంటారు. అలా అని నీవుగాని నా నీడతొక్కావో పోశెమ్మ సాచ్చికంగా ఆ గోదాట్లో పడిచస్తాను. నా ఉసురు తగిలి నీ కాపురం మసైపోతుంది. వెళ్ళు" అంటూ బంగారుగొలుసు ముఖాన్నేసి కొట్టింది ఆమె.

*          *          *

అప్పటికే బాగా తెల్లారిపోయింది. గేటు తీసి తనింటి ముందున్న పూలతోటలోకి అడుగుపెట్టాడతను. రేకలు రాలిన పూలతో, కాడలు విరిగిన చిగుళ్ళతో అందమైన మొక్కలన్నీ వాలిపోయి ఉన్నాయి.

అడుగులో అడుగేసుకుంటూ ఇంటివైపు నడిచాడు.

గుమ్మందగ్గర వరండాలో ఎవరో కూచున్నట్టుంది. ఎవరా అని పరకాయించి చూశాడు.

ఎవరో అతను తనకు తెలియని వ్యక్తి. గుండ్రని ముఖం, గిరజాల జుట్టు, విశాలమైన ఛాతి, కండలు తిరిగిన శరీరం, బంగారు ఛాయ, ఎవరో ఆజానుబాహుడు.

సమీపించి "ఎవరు నువ్వు" అని అడిగాడా వ్యక్తిని.

"మంది అద్దరిలేండి. మన్ని గొల్లకిష్టయ్య అంటారు" అన్నాడు కావిడిబద్ద తీసుకుంటూ ఆ వ్యక్తి.

గొల్ల కిష్టయ్య పేరు వినగానే అదిరిపడి గుటకేశాడు అతను.

ఆ మాటలలోని తీవి, ఆ తీవి వెనుక ధీమా, ఆ ధీమా వెనుక ఆత్మ విశ్వాసం చూసి నీరు కారిపోయాడతను.

అతని ముఖంకేసి చూశాడు. ఆ ముఖంలోని తేజస్సు అతనిని నిలువెల్లా దహించింది. వణుకుతున్న కంఠంతో "నీకిక్కడేం పని, వెళ్ళు, వెళ్ళు" అన్నాడు అతి కష్టంమీద మాటలు పోగేసి.

"మనకిక్కడేంపని. తమరికోసమే కాసుకున్నా, లోనికెళ్ళి సూడండి అర్థమవుతుంది" అన్నాడు ఆవలించి బద్ధకంగా కావిడి బద్ద భుజాన వేసుకొంటూ.

ఏదో కీడు శంకిస్తూ గడపలోనికి అడుగుపెట్టాడతను.

ఇల్లంతా ప్రళయం వెలిసినట్టుంది. డైనింగు టేబులు మీద కప్పులు, ప్లేట్లు పడి చెల్లాచెదరై వున్నాయి. తనకోసం సర్దిన క్యారియర్ నేల పాలయింది. ఇంట్లో సామాగ్రి సమస్తం తిరగబడి చిందర పందరగా నేల మట్టమై వున్నాయి.

కొయ్యబారి పోయాడతను.

విరబోసిన జుట్టు, చిరిగిన చీర, చిగిలిన రవికతో భోరున ఏడుస్తూ ఎదురు పడి భుజంపై వాలి గట్టిగా వాటేసుకుందతని భార్య.

"ఏమండీ! చూడండి. ఎంత ఘోరం జరిగిపోయిందో. నన్నొంటరిగా విడిచి వెళ్ళొద్దని ఎన్నిసార్లు చెప్పాను" అంటూ గొల్లుమంది ఆ అర్భకు రాలు.

విషయం అర్థమయిందతనికి. ఆమెను విడిపించుకుని "రాస్కెల్ ఎంతపని చేశాడు" అంటూ పళ్ళు పటపట కొరుకుతూ డ్రాయర్‌లో రివాల్వర్ తీసి గుళ్ళు బిగిస్తున్నాడతను.

"మొన్న మీరు డిన్నరుకి పిలిచిన ఆ పున్నపోతు ఆఫీసరు తప్ప తాగి, ఇంట్లో జొరబడి, నన్ను నానాహింసలు పెట్టబోయాడండీ. సమయానికి గొల్ల తను ఎవరో వర్షానికి వరండాలో తలదాచుకోవడానికని వచ్చాడు కామోసు, వాడిని కావిడి బద్దతో చితకబాది, నా మానాన్ని కాపాడాడండి. అతన్ని వీధిలో కాపలా పెట్టి మీకోసం కాచుకు కూచున్నా" అంటూ గొల్లుమందామె.

నిశ్చేష్టుడైపోయాడతడు. తను నిలబడ్డ నేల కంపించినట్లయింది. అతికష్టంమీద నిలతొక్కుకుని గుమ్మంకేసి నడిచాడు.

అడుగుల నడుమ అందమయిన చిందేస్తూ గేటు దాటుతున్న కిష్టయ్య మసగ్గా కనబడ్డాడు అతని చెమ్మగిల్లిన కళ్ళకు. ●

# ఇదం బ్రాహ్మం

సుబ్బావధాన్లుగారు వీధి పసారాలో మనవడు సూర్యంచేత వేదం పల్లె వేయిస్తున్నారు. సూర్యం ధ్యాస ఎక్కడో వుండడంతో పదక్రమం తప్పుతోంది.

"ఓరేయ్ సూర్యం మనసెక్కడో వుంటే వేదం అబ్బదురా. కీ యిస్తే గ్రామఫోన్ కూడా శ్లోకాలు వల్లిస్తుంది. కాని అది వేదోపాసన అవదురా, స్వరంలో భక్తి, మనసులో ఏకాగ్రత వుండాలి."

"లేదు తాతయ్యా, రేపు నాకు ఇంగ్లీషు పరీక్ష. బోల్డు చదువుకోవాలి. ఇవ్వాళ్టి కొదిలెయ్యి" అంటూ నీళ్ళు నమిలాడు సూర్యం.

"పోనీలెస్దురూ కుర్రాణ్ణి చదువుకోనీండి. ఈ పారాయణం ఇవ్వాళ

కాకపోతే ఇంకోనాడు చేస్తాడు" అంది అవధాన్లుగారి భార్య సోమిదేవమ్మ. వసారాలో దీపం వెలిగిస్తూ.

"అవును తాతయ్యా" అంటూ మెల్లిగా జారుకున్నాడు సూర్యం.

"వీడి వాలకంచూస్తే. వడికీ జన్మలో వేదం అబ్బేట్టు లేదు" అని వాపోయారు అవధాన్లుగారు.

"వాళ్ళనాన్నలా చదువుకొని ఉద్యోగం చేస్తాడు నిక్షేపంలా. మీరేం బెంగెట్టుకోకండి" అంది సోమిదేవమ్మ అరుగుమీద చతికిలబడుతూ.

"మన వంశ సాంప్రదాయం నిలబెట్టడానికి వీడేనా పనికొస్తాడని ఆశపడ్డాను."

"మీ పాదస్తంకాని ఈ రోజుల్లో బ్రాహ్మణీకానికి గౌరవం ఏపాటి ఉందండి? మీరు అవధానం చేశారు. యజ్ఞం చేశారు. ఈ రాజమండ్రీ పట్టణంలో ఘనాపాఠీగా ప్రథమ తాంబూలం మీదే. అయినా మీరేం సంపాదించారు. మన పిల్లలు చదువుకొని సంపాదించిన మీదట మనమీ స్థితికి రాగలిగాం. పెద్దాడు సంపాదించి మన పాకనో పెంకుటిల్లుగా మార్చాడు. రెండోవాడు పైకొచ్చి దాన్నో డాబా చేశాడు. మన ఆఖరాడు వృద్ధికొచ్చి పైన గదులు దింపించి మేడను చేశాడు. ఇవ్వాళ్ళ ఏ లోటూ లేకుండా బతుకుతున్నాం అంటే, అది వాళ్ళ చదువువల్లనే."

"మనలో ప్రతివాడూ ఇలా ఉద్యోగానికి ఎగబడి పౌరోహిత్యానికి ఉద్వాసనిస్తే రేపు క్రతువులూ. కర్మకాండలూ జరిపించే నాథుడు లేక దేశం గొడ్డుపోతుంది"

"మీరేం బాధపడకండి, మంత్రాలు చెప్పడానికి మనిషే అక్కర్లేదు. మీరన్నట్లు గ్రామఫోను ప్లేటే సరిపోతుందిక మీదట."

ఇలా ఆ దంపతులు రోజూలా వాదించుకొంటూండగా గుమ్మంలో

ఒక జీపు వచ్చి ఆగింది. సోమిదేవమ్మ హాలులో తలుపు చాటుకి తప్పుకుంది. జీపుదిగి హుషారుగా వస్తున్న వ్యక్తిని పరకాయించి చూశాడు అవధాన్లుగారు.

"అయ్యా! నమస్కారం. నా పేరు హనుమాచారి. నేనీ వూరి డిప్యూటీ తాసిల్దారుని. నేనూ మీ పెద్దబ్బాయి నరసింహం కలిసి చదువు కున్నాం."

"అలాగా! రండి! బల్లమీద కూర్చోండి."

"అయ్యా! నాకు కూర్చోటానికి టైంలేదు. కలెక్టరుగారు నాకోసం వెయ్యి కళ్ళతో యెదురు చూస్తుంటారు. మీతో మాకో ముఖ్యమైన పని బడింది." అంటూ కూర్చున్నాడు.

"ఎంతమాట! శలవివ్వండి."

"మీ అంతటి ఘనాపాఠీ మీరేనని కలెక్టరుగారితో అన్నానో, లేదో తక్షణమే మిమ్మల్నే కుదర్చమని ఆర్డరు జారీ చేసేశారు. దీంతో ఒక స్నేహితుడి తండ్రికి నేను చెయ్యగలిగిందల్లా చేసేశాను."

"సంగతేమిటో మీరు మనవి చెయ్యలేదు."

"రేపు జరగబోయే తతంగాన్ని జిల్లా అధికారులు యావన్మంది పర్య వేక్షించబోతున్నారు. లక్షకుపైగా జనం పోగౌతారని అంచనా. రేడియో, టెలివిజన్, న్యూసు రీలు వాళ్ళందరూ రంగంలోకి దిగుతారు. ఈ బృహత్ కార్యాన్ని మీ చేతులమీదుగా నడిపించబోతున్నాము. కనుక మీ పేరు మోతెక్కిపోతుంది."

"అసలు విషయం మీరు చెప్పనేలేదు."

"మొన్న ఘోర ప్రమాదంగూర్చి పేపర్లో చదివే వుంటారు మీరు. విమానం కూలి ఎంతో మంది నాయకులు, పార్టీ లీడర్లు, ప్రతినిధులు ప్రాణాలు కోల్పోవడం గురించి."

"అయ్యో! అలాగా?" అన్నారు అవధాన్లుగారు. ఈ విషయానికీ, ఇంతవరకు చెప్పినదానికీ సంబంధం ఏమిటి చెప్మా అనుకుంటూ.

"మీకింకా తెలియదా! ఢిల్లీ నెగిరే విమానం మధ్యలో కూలడంతో పెద్ద మంటలు రాగా అందులోని పాసింజర్లందరూ సజీవంగా దహనమై పోయారు. ఇలాంటి ఘోర ప్రమాదం ఇదివరలో ఎప్పుడూ జరగలేదు. మూకుమ్మడిగా పోయినవారికి ఉత్తర క్రియలు జరపాలనీ, శిధిలాల్లో దొరికిన అస్థికలు దేశంలోని అన్ని నదీ జలాల్లోనూ రాజ లాంఛనాలతో నిమజ్జనం చెయ్యాలనీ ప్రభుత్వ సంకల్పం. రేపు రైల్లో మంత్రిగారు స్వయంగా అస్థికల్ని ఈ వూరు తీసుకొస్తున్నారు. స్టేషను నుంచి వూరేగింపుగా వెళ్ళి పుష్కరాల రేవులో గోదావరిలో నిమజ్జనం చెయ్యాలి."

"చూడు నాయనా! జరిగిందానికి విచారించడం తప్ప నేనీ విషయంలో ఎలా సాయపడగలను."

"అయ్యో! మీరు కీలవకండి. ఇప్పుడు జరిగింది గుడ్డిలో మెల్లే అనుకోవాలి. ఆనాడు విమానంలో సీట్లు దొరక్క మరెందరో ప్రముఖులు రైల్లో బయలుదేరారు. శాస్త్రం చెప్పినట్లు ఆ విమానం అక్కడెక్కడో కాకుండా ఆ రైలుమీదే పడుంటే మనకు నాయకులే లేకుండా పోయి దేశం అరాజకమై వుండేది కదండి. జరిగిందేదో జరిగిపోయింది. రేపు జరగబోయే తంతు అనండి, తతంగం అనండి. అదేదో మీ చేతులమీదుగా జరిపించాలని ఈ వూరు పెద్దలు నిశ్చయించారు. కనుక రేపు ఉదయం...."

"చూడు నాయనా! నేను అరవై దాటి, డబ్బైయో పడిలో పడినవాణ్ని. నాకు ఓపిక లేదు. పైగా యిలాంటి కర్మకాండలు నేను చేయించను. పక్కవీధిలో విష్ణుశర్మగారని వున్నారు. ఆయన్ని తీసుకెళ్ళండి."

"అమ్మమ్మమ్మ! మీరు లేకుండా ఈ కార్యక్రమం జరగడం అసం

భవం. కావాలంటే ఆయన్ని పిలుస్తాం. మీరు సింపులుగా సూపరువైజు చేస్తే రుగాని. మీచేత 'ఊ' అనిపించడానికే నన్ను పంపించారు. మీరు కాదంటే నా ఉద్యోగానికే ఎసరు పెడతారు పైవాళ్ళు" అని కాళ్ళు పట్టుకోబోయాడు హనుమాచారి.

వద్దని వారించారు అవధాన్లుగారు.

"అయ్యా! ఈ కార్యక్రమంలో హోదాగల పెద్ద పెద్ద ఆఫీసర్లు పాల్గొంటున్నారు. మీబోటి ఘనాపాఠీల అజమాయిషీలో జరిపించకపోతే మాకు మాట వస్తుంది. యిక మీ యిష్టం."

"అలా కాదు, కూడదంటే నేనేం చెయ్యను. సరే విమానంలో దహనమయ్యారంటున్నారు. ఏ అస్తికలు ఎవరివో, వారి గోత్రనామాలు అవీ ఎలా తెలుస్తాయి. యిలాంటి విషయాల్లో చాలా జాగ్రత్తగా వుండాలి—లేకపోతే బెడిసికొడతాయి" అని సంశయాన్ని వెలిబుచ్చారు అవధాన్లుగారు.

"ఆ మాటకొస్తే యిక్కడ కొస్తున్నవి అసలు అస్తికలో లేక విమానం అవశేషాల బాపతు బూడిదో యెవరికీ తెలియదు. పైగా వాటి గురించి అంత పట్టించుకోడం అనవసరం. ఇది నడిపించేది ప్రభుత్వమే కనుక బెడిసికొట్టినా ఫరవాలేదు. మన డ్యూటీ మనం చేసుకుపోవడమే. రేపు తెల్లారక మునుపే వచ్చి మిమ్మల్ని జీపులో తీసుకెళతాను" అంటూ లేచాడు హనుమాచారి.

"విష్ణుశర్మతో కూడా సంప్రదించి వెళ్ళు నాయనా! పంచామృతాలని, దశ దానాలని వుంటాయి. ఆ సంప్రదాయాలు, వాటికి కావలసిన సరంజామా కనుక్కో."

మాట పూర్తిగా వినిపించుకోకుండానే జీపెక్కేశాడు హనుమాచారి.

*　　　*　　　*

మర్నాడుదయం తెల్లవారడానికింకా ఓ ఝాము వుండగానే గోదావరి స్నానం ముగించి ప్రాతః సంధ్య కుపక్రమించారు అవధాన్లుగారు.

కోడికూతలా హారను మోగుతూ ఓ జీపువచ్చి వీధిలో ఆగింది. సంధ్యావందన మైందనిపించుకొని లోపలికెళ్ళి పెట్టెతెరచి వేదసభలో తనని గౌరవించిన ఖద్దరు శాలువా కప్పుకొని గుమ్మంలోకి వచ్చేసరికి ఆ జీపు వెనకాలే మరో కారు వచ్చి నిలిచింది.

"అయ్యా! మీరింకా రాలేదని డిప్యూటీ కలెక్టరు గారే స్వయంగా కారు పంపారు" అన్నాడు డ్రైవరు.

వసారా మెట్లు దిగుతూంటే "ఆ ఖద్దరు శాలువా ఏమిటీ, పెద్దాపురం రాణీగారిచ్చిన కాశ్మీరు శాలువా వేసుకెళ్ళండి. పెద్ద ఆఫీసర్లతో పనికదా" అంది సోమిదేవమ్మ.

అవునన్నట్లు తలవూపి మళ్ళా గదిలోకి వెళ్ళి పెట్టెతెరచి కాశ్మీరు శాలువా తీసుకున్నారు అవధాన్లుగారు.

ఈలోగా మరో కారువచ్చి గేటుదగ్గర ఆగింది.

"అయ్యగారూ! మీరింకా రాలేదని కలెక్టరుగారు కారు పంపించారు. వేగిరం రండి" అన్న డ్రైవరు కేక వినబడింది.

గుమ్మంలోకి రాగానే మూడు వాహనాలు కాసుకూర్చోడం చూసి అవధాన్లుగారికి మతిపోయినట్టయింది. తనేదో బ్రహ్మాండమైన వేదసదస్సుకి పిలవబడ్డట్టు ఉత్సాహ పడ్డారు. హడావిడిగా తిరిగి గదిలోకి వెళ్ళి కాశ్మీరు శాలువాబదులు పిఠాపురం దివాణం వారిచ్చిన బంగారు జరీకండువా కప్పుకొని "ఏ వేళకొస్తారో, కాసిన్ని పాలు పుచ్చుకు వెళ్ళండి" అంటున్న

భార్య మాటలు వినిపించుకోకుండా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ కారెక్కేశారు అవధాన్లుగారు.

*　　　　*　　　　*

రాజమండ్రి స్టేషనంతా జనసందోహంతో కోలాహలంగా వుంది. రైలు రాకకై ప్లాటుఫారం యావత్తూ కిటకిటలాడుతూ యెదురు చూస్తోంది. జిల్లా అధికారులు, పుర ప్రముఖులు వెయిటింగు రూములో మంత్రిగారు తెచ్చే అస్తికలకోసం నిరీక్షిస్తున్నారు. స్టేషను ఆవరణలో కొన్ని వందల కార్లు నిలిచివున్నాయి. బయట ప్రాకారమంతా షామియానాలతో నింపబడి వుంది. షామియానాలన్నీ జనాలతో క్రిక్కిరిసి వున్నాయి. వివిధ పార్టీలకు చెందిన వాలంటీర్లు జండాలుచ్చుకొని బార్లుతీరి నిలబడ్డారు. రిజర్వు పోలీసు దళం నల్ల బాడ్జీలను ధరించి గార్డాఫానర్ కోసం నిలుచున్నారు. ట్రాఫిక్ పోలీసులు ఆవరణలోకి వచ్చే వాహనాలని క్రమబద్ధం చేస్తున్నారు. ఊరేగింపు కోసం వరస లారీలలో బాండుమేళాలు అమర్చబడి వున్నాయి. ఒక టాపులేని జీపుని పూలతో అలంకరించి దానిపై ఒక ఎత్తయిన పేటికను అమర్చారు. అప్పటికే అరగంట లేటయిన రైలు ఏ క్షణంలోనైనా రావచ్చు.

డిప్యూటీ తాసీల్దారు హనుమాచారి అవధాన్లుగారి రాకకై కాలుగాలిన పిల్లిలా స్టేషను బయట తెగ పచార్లు చేస్తున్నాడు. దూరంనించి జీపు, రెండు కార్లు రావడం చూసి 'హమ్మయ్య' అనుకున్నాడు. కారు ఆగింది. ఎవరు చెప్పారో వచ్చిందని అక్కడి జనమంతా కారుకేసి చూశారు. అవధాన్లుగారు ఎంతో ఠీవిగా కారు దిగారు. వృద్ధాప్యంలో శరీరం కొంచెం పీలగా వున్నా దబ్బపండులాంటి ఆయన ముఖంలో బ్రహ్మ వర్చస్సు ఉట్టి పడుతోంది.

ఆయన అక్కడ అడుగు పెట్టగానే సాక్షాత్తు వశిష్ట మహర్షే దిగి వచ్చాడా అనిపించింది అక్కడి వాళ్ళకి.

"మీరింకా రాకపోతే నా గుండెల్లో ప్రాణాల్లేవు. రండి" అంటూ షామియానాలోకి తీసుకెళ్ళాడు హనుమాచారి.

"విష్ణుశర్మని తీసుకొచ్చావా? ఈ కార్యక్రమం జరిపించడానికి" అని ప్రశ్నించారు అవధాన్లుగారు.

"నిన్నటినుంచి ప్రయత్నిస్తున్నాను. నాకు పైసు దొరకటం లేదు" అని నీళ్ళు నమిలాడు హనుమాచారి.

"సరే, ఈ స్టేషనుదగ్గరే తూర్పువీధిలో పేరిశాస్త్రిగారు వున్నారు. ఆయనకు కబురెట్టండి. నేను రమ్మన్నానంటే వస్తాడు" అంటూ షామియానాలో పరచిన కుర్చీలో కూర్చున్నారు అవధాన్లుగారు.

ఈలోగా ఒక డవాళా బంట్రోతు వచ్చి "ఆచారిగారూ! మిమ్మల్ని అర్జంటుగా పత్రికలవాళ్ళకి కాఫీ, టిఫిన్లు చూడమంటున్నారు, డిస్ట్రిక్టు కలెక్టరుగారు" అనగానే ఇప్పుడే వస్తానని హామీ యిచ్చి వెళ్ళిపోయాడు హనుమాచారి.

అవధాన్లుగారు తన చుట్టూ కూర్చున్న జనాన్ని కలయజూశాడు-పరిచయస్తులెవరేనా వున్నారేమోనని. అందరూ కొత్తవాళ్ళే. బిక్కు-బిక్కుమంటూ గాయత్రీ జపం మననం చేసుకుంటూ ధ్యానంలోకి దిగిపోయారు.

అలా గంట గడిచింది. ట్రయినింకా రాలేదు. దారిలో ఆగిన ప్రతి స్టేషనుకో ప్రజలు గతించిన నాయకులకు నివాళులర్పిస్తున్నందున లేటయిందని స్టేషను మాస్టరు సంజాయిషీ ఇస్తున్నాడు. బాగా తెల్లవారి పొద్దెక్కుతున్నందున చాలామంది సహనం కోలుపోయి ఒక్కొక్కరే జారుకుంటున్నారు. షామియానాలో జనాభా పల్చబడసాగింది.

హనుమాచారి హఠాత్తుగా షామియానాలో ప్రత్యక్షమై ప్రజానీకానికి

యేదైనా కాలక్షేపం లేకపోతే ప్రమాదమని గ్రహించి బేండుమేళాన్ని ఓ రెండు దరువు లెయ్యమందా మనుకున్నాడు. కాని బేండువాళ్ళు అప్పటికే పేంటు బెల్టులు వదులుచేసుకొని బయపైన జరీకోట్లు విప్పేసి భుజాన్నేసుకొని వంకుంపుల్లలు నవుల్తూ గోదావరి గట్టుకేసి పోయారు. మరేం చేద్దామా అనుకుంటున్న హనుమాచారికి అవధాన్లుగారు గుర్తుకొచ్చారు. ఓ గొప్ప ఊహ తట్టింది. పరుగులాంటి నడకతో ఆయన్ని సమీపించి “అయ్యా! మీరు వేదపఠనం ఆరంభించండి ట్రైన్ వచ్చేదాకా” అన్నాడు.

“చూడు నాయనా! పేరిశాస్త్రికి కబురు చేశావా? వచ్చేటప్పుడతో రాగి చెంబుతో మంచితీర్థం పట్రమ్మను. కాస గొంతు తడిచేసుకోవాలి” అని ప్రాధేయపడ్డారు అవధాన్లుగారు.

“ఆ! ఇప్పుడే కబురు చేస్తా!” అని హామీ ఇస్తుండగా మరో డవాలా బంట్రోతు “ఆచారిగారూ! ట్రయిను లేటయింది. కనుక మినిష్టరు గారికి కాఫీ, టిఫిన్లు వెయిటింగ్‌రూమ్‌లోనే ఏర్పాటు చేయమన్నారు డిప్యూటీ కలెక్టరుగారు. ఆ చేత్తోనే మేము జవాన్లం ముగ్గురం, డ్రయివర్లు ముగ్గురం వున్నాం. మా సంగతి కూడా చూడండి” అనడంతో ఉసూరు మంటూ మూడు పనులు అతని చేతిలో పెట్టి వదిలించుకుని పేరిశాస్త్రికెలా కబురుచేద్దామా అని చుట్టూ కలియజూశాడు. అంతవరకు గెడకర్రలు మింగినట్టు నిటారుగా స్తంభించివున్న రిజర్వు దళం హనుమాచారి చూపు కలియగానే గాలితీసిన బెలూనులా వొక్కసారి కృంగిపోయి మా సంగతేమిటన్నట్టు చూశారు. అయ్యబాబోయి వీళ్ళ తగులుకుంటే మొత్తం తనను నంజేసుకుంటారని భయపడి పేరిశాస్త్రి గురించి అవధాన్లుగారు పెడుతున్న గోడు వినిపించుకోకుండానే చల్లగా జారుకొని అక్కడనించి మాయమయిపోయాడు హనుమాచారి.

మైకు స్టాండు అవధాన్లుగారి ముందు సవరించాడు మైకువాడు. అవధాన్లుగారు నీరసంగా సణుక్కున్నారు. ఆ సణుగుడు పిడుగుల్లా లౌడ్ స్పీకర్లలో వినబడింది. దాంతో కొన్ని క్షణాలపాటు అలజడి స్తంభించి నిశ్శబ్దం ఆవరించింది. అవధాన్లుగారి కంచుకంఠం మోగింది. ప్రాకార మంతా వేదఘోషతో ప్రతిధ్వనించింది.

అలా గంటలు గడిచాయి. పొద్దెక్కి వేసవి ఎండ తన ఉధృతాన్ని చవిచూపింప నారంభించింది. అయినా లెక్క చేయకుండా పల్చబడిన జన సమూహం రెండింతలయింది. స్టేషనులో గంట మోగింది. దూరాన్నించి రైలుకూత వినబడింది. కొన్నివేల నిట్టూర్పులతో వాతావరణం చిక్కబడింది.

ఒక్కసారిగా బేండుమేళాలు మారుమ్రోగాయి. జేజేలు, జోహార్లతో ప్రాంగణమంతా ప్రతిధ్వనించింది. గంటల తరబడి వేదపఠనం చేసిన అవధాన్లుగారి గొంతు ఎండిపోయింది. రాత్రి ఉపవాసం చేసి ఉదయం పచ్చి మంచినీళ్ళయినా పుచ్చుకోనందున నీరసం ఆవహించింది హనుమాచారితో చెప్పి పేరిశాస్త్రిని రప్పించి తను ఇంటికి వెళ్ళిపోవాలని ఓపిక పట్టసాగాడు.

ట్రయిను స్టేషనులో ఆగింది. మంత్రిగారు కలశాన్ని స్వయంగా జీపులో పేటికమీద వుంచారు. బేండుమేళాలు తారస్థాయి నందుకున్నాయి. జోహార్ ధ్వానాలు మిన్నుముట్టాయి. రిజర్వు దళాల బారులు జీపు ముందుకు జరిగాయి. దూరంనుంచి టొట్లు పేలుతున్నాయి. జీపు కదలడానికి సిద్ధంగా వుంది.

హనుమాచారి హడావిడిగా అవధాన్లుగారి దగ్గరకు వచ్చి "అయ్యా, మీరింకా యిక్కడే వున్నారేంటి? మినిష్టరుగారి పక్కను జీపులో నిల

బెతాలి" రండి రండంటూ చెయ్యి పుచ్చుకొని జీపుకేసి బరబరా నడిపించాడు.

"చూడు బాబూ! పేరిశాస్త్రికి కబురంపావా! చాలా ముఖ్యం- వేదాశ్వీసులివ్వడానికి, స్వస్తి పలకడానికి మినహా యిలాంటి కర్మలు షేం చేయించం. నా గొంతు ఎండిపోయింది. వచ్చేటప్పుడు రాగిచెంబుతో మంచి తీర్థం మరచిపోవద్దను" అన్నారు అవధాన్లుగారు.

"మీరిలా బయలుదేరగానే నేనడ్డదోవన ఆయన్ని తీసుకొచ్చి మీ కప్పగిస్తాను. ఈ సంగతి నాకొదిలేసి మీరు గాభరాపడకండి" అని హామీ యిస్తుంటే మరో డవాలా బంట్రోతు ప్రత్యక్షమై "ఆచారిగారూ! మిమ్మ ల్నర్జంటుగా మినిష్టరుగారి తిరుగు ప్రయాణానికి ఇవ్వాళ ఎక్స్ప్రెస్సుకి మరో రెండు టిక్కెట్లు బుక్ చేయించమని డిప్టీ కలెక్టరుగారు చెప్ప మన్నారు." అనగానే ఈయన్ని జీపులోకి ఎక్కించమని చెప్పి మాయమయ్యాడు హనుమాచారి.

జీపు చుట్టూవున్న అధికారులు అవధాన్లుగారిని జీపు ఎక్కించారు. అలా అవధాన్లుగారు, మంత్రిగారు పేటిక కిరుప్రక్కలా నిలబడ్డారు. భజంత్రీల వెనుక, జీపు బయలుదేరింది. జీపువెనుక కొన్ని వందల జనాభా నడవసాగారు. వారి వెనుక ఆఫీసర్ల వాహనాలు బారులుతీశాయి. ఊరేగింపు ముందుకు సాగింది.

జీపు కుదుపుకు పేటికమీదనున్న కలశం కదలడం చూసి మంత్రిగారు ఓ చెయ్యివేసి పట్టుకున్నారు. మరో చెయ్యి వూపుతూ, ఊరేగింపు తిలకిస్తున్న ప్రజల్ని పరామర్శించసాగారు.

గతుకుల కుదుపుకు శరీరం తూకం కోల్పోగా భుజాన్ని పేటిక్కానించి నిలదొక్కుకున్నారు అవధాన్లుగారు.

చురుగ్గా సాగుతున్న ఊరేగింపు బజారు వీధి చేరింది.

వర్తకసంఘం ప్రతినిధి ఒక పెద్ద పూలదండతో ఎదురయి వెళ్ళి జీపెక్కాడు- అస్తికలున్న కలశానికి దండ వెయ్యడంకోసం. కలశం చిన్నది కనుక అంత పెద్దదండ వెయ్యడం వీలుపడక మంత్రిగారి మెడలో వేసేశాడు సమయస్ఫూర్తిగా. దాన్ని చూసి వివిధ ఉపవర్తక సంఘ ప్రతినిధులు తాము తెచ్చిన దండలు మంత్రిగారికే వేయసాగారు. ఇలా షాపుకో దండ చొప్పున పడడంతో ఊరేగింపు మందకొడిగా సాగనారంభించింది. దండలు సవరించుకోడంతో మంత్రిగారి రెండు చేతులకూ పని తగిలింది. కలశం ఎక్కడ ఎగిరి పడుతుందో అప్రతిష్ట అనుకొని అవధాన్లుగారు పేటికను కావలించుకొని కలశాన్ని చేత్తో కాస్తున్నారు.

ఊరేగింపు గంటల తరబడి సాగింది. ఓ పేరుమోసిన హోటల్ యజమాని పెద్దలందరకు కూల్ డ్రింకులు అందజేశాడు. అవధాన్లుగారికి కూడా యివ్వబోయి ఆయనకు నిష్ఠ నియమాలు ఉంటాయని గుర్తుకు వచ్చి నాలిక్కరుచుకుని యివ్వడం మానేశాడు.

అవధాన్లుగారికి కాళ్ళు తిమ్మిరెక్కి కండరాలు బిగిసిపోయాయి. తన బరువు తాను మోసే శక్తికూడా కోల్పోతున్నారు. వళ్ళంతా చెమటలు పట్టసాగాయి. నాలిక పిడచ కట్టుకుపోయింది. పెదిమ లెండిపోయాయి. ఎలాగైనా బతికి బయట పడాలని శక్తిని కూడగట్టుకొని నిభాయించుకొంటున్నారు.

మంత్రిగారి దండ బాపతు గులాబిరేక ఒకటి ఎగిరి అవధాన్లుగారి

పెదిమమీద వాలింది. అది ఒక తెలియని ఉపశమనాన్ని కలిగించింది. నాలికతో నోట్లోకి లాక్కోబోయారు. ఇన్నేళ్ళుగా సాగిస్తున్న నిష్టనియమాలు అడ్డుపడ్డాయి. జరీకండువాతో పెదిమలద్దుకున్నారు. చిక్కని జరీ గెడ్డాన్ని గీతలుపెట్టి బాధించింది.

అలా క్షణమొక యుగంగా గడవగా జీపు పుష్కరాల రేవు చేరింది.



మంత్రిగారు కలశాన్ని దింపారు. కలశం పెద్దల చేతిమీదుగా నదీ తీరం చేరింది. గోదావరి మధ్యగా తేలే తెప్పలాంటి ఒక పంటుని లంగరు వేసి వుంచారు. ఆ పంటు మీదనుంచి అస్తికలను నిమజ్జనం చేస్తే గ్యారంటీగా నదీగర్భంలో కలసిపోతాయన్న వుద్దేశంతో అలా యేర్పాటు చేయబడింది. ఆ పంటుని చేరడానికి ఒక చిన్న మోటారు లాంచిని రేవులో

వుంటారు. పెద్దలందరు కలశంతోపాటు లాంచి యెక్కారు. అవధాన్లుగారు యెక్కలేదని గుర్తుకువచ్చి ఆయనకోసం కబురెట్టారు. పోలీసు ఆఫీసర్లు రేవంతా గాలించి అవధాన్లుగార్ని పట్టుకొని లాంచి ఎక్కించారు. లాంచి ఓవర్ లోడయ్యి గోదాట్లోకి సాగి ఎలాగో పంటు చేరుకుంది. లాంచిలోని పెద్దలు పంటు మీదకు ఎక్కారు. అవధాన్లుగార్ని కూడా పంటుమీదకు సాయం పట్టారు. కార్యక్రమం త్వరగా ముగించమని అధికార్లచేత ఆదేశాలు యివ్వబడ్డాయి. అవధాన్లుగారు నిర్ఘాంతపోయారు. తంతు జరిపించాలంటే కావలసిన సామాగ్రి అక్కడేమీ లేదు. ఏం చేయాలో అర్థంగాక తటపటాయిస్తున్నారు. మిట్టమధ్యాహ్నపు యెండ అందర్నీ చురకలు వేస్తూంది. ఇదెలాగో అయిందనిపించుకుంటే చాలని అందరూ చూస్తున్నారు.

"అయ్యా, మీరు మంత్రాలు త్వరగా చదవండి పొద్దుపోతోంది" అని పెద్దలు సెలవిచ్చారు. దాంతో గత్యంతరం లేక "కేశవా! నారాయణా! మాధవా! గోవిందా!" అని కేశవ నామాలు వల్లిస్తుండగా "గోవిందా" అన్న పదం వినపడగానే "గోవిందా" అంటూ కలశాన్ని గోదాట్లో విసిరేసి చేతులు దులిపి, తృప్తిగా నిట్టూర్చి చటుక్కున లాంచి ఎక్కేశారు పెద్దలు.

లాంచి ఓవర్ లోడయినందున "సగం మంది మాత్రమే ఎక్కండి, మిగతా సగం కోసం లాంచి మరో ట్రిప్పు వేస్తూంది" అని గోడుపెట్టాడొక పోలీస్ ఆఫీసరు. అయినా లాంచి బయలుదేరేసరికి అందరూ లాంచిలోకి దూరిపోయారు ఒక్క అవధాన్లుగారు మినహా.

తనొక్కడే పంటుమీద మిగిలిపోయినట్టు గ్రహించడానికి కాస్త టయిం పట్టింది అవధాన్లు గార్కి. ఈయన ఒక్కడే యెండకు వుండిపోయాడా అని అనుమాన పడింది పంటు సరంగుకు.

లాంచీ తిరిగి వస్తుందేమోనని ఆశతో రేవుకేసి చూస్తున్నారు అవ ధాన్లుగారు. లాంచి రేవుచేరగానే రేవు పల్చబడింది. కాని లాంచి తిరిగి రాలేదు. పంటు సరంగు అవధాన్లుగారి పరిస్థితి చూసి లాంచిని పంపమని రేవుకేసి కేకలెట్టాడు. కేకలు గాలిలో కలిసిపోయాయి. "పోనీ నువ్వయినా పంటును రేవుకు చేర్చి నన్ను దాటించు నాయనా" అని ప్రాధేయపడ్డారు అవ ధాన్లుగారు.

"పొద్దేలనుంచి టీ సుక్క కూడా తాగలేదయ్యగారూ. కూడొండుకు తింటేగాని లంగరెత్తలేను. పైగా గాలిపాటు సరిగా లేదు. లోతు చూస్తే గెడకందదు. మరెలా సెప్పండి" అన్నాడు.

గత్యంతరంలేక దిగులుగా కూలబడ్డారు అవధాన్లుగారు. దాహం దహించుకుపోతోంది. పంటుమీదనుంచి ఓ దోసెడు నీళ్ళు అందుకుందా మంటే ఎత్తయిన పంటుకు నీరు ఓ బారెడు దిగువ ఉండడంతో ఎంత ప్రయత్నించినా చేతికి అందలేదు.

పొయ్యి అంటించి వంట చేసుకున్నాడు సరంగు. తను పట్టిన దాకలో నీళ్ళు అవధానిగారికి యివ్వాలనుకున్నాడు. నీచు వండే పాత్రలో అలాంటివాళ్ళ కివ్వటం మహాపాపమని మానేశాడు. తన చుట్టూ యింత జలాశయం ఉండి త్రాగడానికి గుక్కెడు నీళ్ళు కరువయిన పరిస్థితి అయింది అవధాన్లు గారికి.

నిప్పులు చెరుగుతున్న ఎండలో దేహమంతా ఉడికిపోతూంది. తను కప్పుకున్న జరీకండువా వేడెక్కి మరింత దహించేస్తోంది. కండువా తీసి పంటుమీద పడేశారు.

వంట ముగించి తిండి కుపక్రమించాడు సరంగు. దూరం నుంచి చూస్తూ కూర్చున్నారు అవధానిగారు. సరంగు తింటూ తను వండుకున్న

పదార్థంలో నుంచి కరివేపాకు ఏరి పారేశాడు. అది చూసిన అవధానిగారికి అప్పుడనిపించింది. కరివేపాకు లేందే ఏ పదార్థమూ రుచి నివ్వదు. తినే టప్పుడు ఆ కరివేపాకును ఏరి పారేస్తారు. ఇప్పుడు తను అనుభవిస్తున్న స్థితికూడా ఇలాంటిదేనని.

పంటు సరంగు లంగరుతీసి తెరచాప ఎత్తేసరికి పొద్దు పడమరకు వాలింది. పంటు రేవుచేరేసరికి దీపాలెట్టేశారు. పంటు దిగుతుంటే "అయ్య గారూ! ఇది వదిలేశారు" అని కండువా అందించాడు సరంగు.

కండువాని చూశారు అవధానిగారు. తనని వొకప్పుడు ఈ కండువాతో సన్మానించిన సదస్సు తన యెదురుగా నిలబడి అపహాశన చేస్తున్నట్టు అనిపించింది. ఆనాడు తనను కీర్తించిన ప్రతివ్యక్తీ వేయి వెక్కిరింతలతో తన్నవమానపర్చినట్టనిపించింది. సన్మానపు జరీ పట్టుకండువా ఓ పిశాచంలా కనబడగా శక్తినంతా కూడగట్టుకొని పంటుమీదనుంచి రేవులోకి దూకారు.

భర్త రాకకై గుమ్మంలో ఎదురు చూస్తోంది సోమిదేవమ్మ. భర్త ఏమి పారితోషికం తెస్తాడోనని కుతూహలంగా వుంది. మనవడు సూర్యం వసారాలో ఇంగ్లీషు వాక్యాలను కంఠస్థం చేస్తున్నాడు.

తొళ్ళొడ్చుకుంటూ ఇల్లు చేరారు అవధానిగారు. ఆయున్ని చూసిన సూర్యం చటుక్కున క్లాసు పుస్తకాలు చాపకింద దాచేసి ఎలుగెత్తి వేద పఠనం ప్రారంభించాడు.

అది గమనించిన అవధాన్లుగారు సూర్యంకేసి వెర్రిచూపు చూడ సాగారు.

సుబ్బావధాన్లుగారి ఆ చూపులోని అంతరార్థమేమిటో సోమిదేవమ్మకు అంతు చిక్కలేదు.

# త్రిలోక సుందరి

పాపికొండల నడుమ మెలికలు తిరుగుతూ ప్రవహిస్తున్న గోదావరి ప్రవాహంలో భారంగా సాగుతూంది మోటారు లాంచి 'త్రిలోక సుందరి.' గోదావరికి ఎగువనున్న కూనవరంలో సంత చేసుకోవడానికి, దిగువనున్న గూడెంల జనాభాకి ఈ లాంచే ఏకైక రవాణా సాధనం. అందుకే లాంచి సర్వీసు నిత్యం రద్దీగా ఉంటుంది.

రానున్నవి సంక్రాంతి రోజులు కనుక ఆనాడు లాంచి మరీ రద్దీగా ఉంది. కెపాసిటీకి ఎన్నో రెట్ల జనాభాతో కిక్కిరిసి వుంది. ముందు కేబినులో మగవారు, వెనుక కేబినులో ఆడవారితో కిటకిటలాడుతున్నది.

మధ్యాన్నపు ఎండ వేడి ఉధృతంగా ఉంది. ముందు కేబినులో కూర్చున్న డాక్టర్ అవధాని ఉక్క పోతకు కంపరమెత్తి పచ్చిగాలి పీల్చుకోవడానికి బయటకు వచ్చి పడిచెక్కమీద నుంచున్నాడు. చిగిర్చి నిండుగా ఉన్న ఎత్తయిన కొండల్లో ఎన్నో రకాల ఆకుపచ్చ రంగులు సూర్య

కాంతిలో మెరుస్తున్నాయి. గోదావరి కొండల నడుమ పసివాడి నడకలా తడబడుతూ పారుతోంది. ఆ దృశ్యం చూసేసరికి అవధానికి ఉపశమనం కలిగింది.

రానున్న పండగ రోజుల్లో సెలవు పెట్టాడు. కనుక గూడెంలో తనుండడు. ఆ నాలుగు రోజులకు వైద్యం పొందుతున్న రోగులకు సరిపడే మందులు కొనడానికి కూనవరం వెళ్ళి తిరిగి గూడెం చేరుకుంటున్నాడు డాక్టరు అవధాని. చేతి సంచిలో వున్న మందులను మరోసారి చూసుకుని తృప్తిగా నిట్టూర్చాడు.

లాంచి బాగా ఓవరులోడు అయింది. కేబిన్లలో కిక్కిరిసిన పాసింజర్లకు తోడు టాపుమీద కూడా ఎంతో బరువు వేయబడింది. మిల్లులో ఆడించిన బియ్యపు బస్తాలేకాక, చిట్టూ, తవుడు, ఊకబస్తాలు పందకి పైగా చేర్చబడి వున్నాయి. మరో రెండు బస్తాలు వేసి వుంటే పడిచెక్క మునిగి కేబినులోకి నీరెక్కి రేవులోనే మునిగుండేదా లాంచి.

డుం! డుం! డుం! డుం! డుం!.... ....

లయబద్ధమైన ఇంజను శబ్దం నడుమ గ్లగ్, గ్లగ్ అన్న గుల్ల శబ్దం అప్పుడప్పుడు అపశృతిలా వినబడుతూంది. ఆ అపశృతికి లయగా ఇంజను రూములో డ్రైవర్ గుండె రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది.

శక్తికి మించిన భారాన్ని ఈడుస్తున్న ఇంజను వేడెక్కడంతో ఇంజను డ్రైవరుకు చెమటలు పట్టసాగాయి.

స్వయంగా ఓవరులోడు చేయించి హాయిగా ఇంటికి చక్కాపోయిన లాంచి షావుకారుని మనసులోనే బండబూతులు తిట్టుకుంటున్నాడు డ్రైవరు.

ఇలా లాంచి ఓవరులోడు అయినందుకు డాక్టరు అవధానికి కూడా ఒళ్ళు మండిపోయింది. గతంలో జరిగిన లాంచి ప్రమాదాలు గుర్తుకు

వచ్చాయి. మందలో గొర్రెలా తనూ అలాంటి లాంచి ఎక్కినందుకు తనలో తనే నిందించుకున్నాడు.

"గురూ! ఇలా సూడు! ఎంత బొక్కో" క్లీనరు పాపారావు పెట్టిన గావుకేక విన్న డ్రయివరు ఉలిక్కిపడ్డాడు. ఇంజను రూములో లాంచి అడుగు భాగాన షేకు దూరేంత రంధ్రంపడి దానిగుండా నీరు రాసాగింది.

డ్రైవరు తమాయించుకొని ఒక లావుపాటి మరషేకు తీసి సమ్మెటతో కొట్టి రంధ్రానికి బిరడా బిగేశాడు.

కొండ అంచున వడి మందంగా ఉంటుంది. ఆ మందంలో ప్రయాణం చేస్తున్న లాంచి మలుపు తిరిగినప్పుడల్లా వడిలోకి పడి మారువడిని ఎదుర్కొంటూ సాగాలి. అలాంటప్పుడు ఇంజను శక్తి మరింత పెంచాలి. అలా మారువడిని తప్పించుకోవడానికి "ఇంజను స్పీడు పెంచు" అన్న సంకేతాన్ని "పులిస్పీడు" అన్న లాంచి భాషలో గొట్టం ద్వారా కేకెట్టాడు సరంగు.

ఆ సంకేతాన్నందుకున్న డ్రైవరు "ఇదే పులిస్పీడు. ఇంకెక్కడొస్తుంది పులిస్పీడు" అని విసుక్కున్నాడు.

లాంచి వూగిసలాడుతూ తప్పించుకుని ఎలాగో తిరిగి మందాన్ని పడింది.

"గురూ! గురూ! ఇంజను కింద రేకులోంచి నీళ్ళొచ్చేస్తున్నాయి" అన్నాడు క్లీనరు. అదిరిపడ్డాడు డ్రైవరు.

ఇంజను క్రింద భాగాన్న లాంచికి చిల్లుపడితే ఇంజను ఊడపీకందే చిల్లు మూయడం సాధ్యపడదు. ఎన్నో పరికరాలుంటేగాని ఇంజను ఊడపీకటం అసంభవం. ఏంచెయ్యాలో తోచక "ఓ డొక్కుతో నీళ్ళు

తోడెయ్యి" అని క్లీనరుకి ఆదేశమిచ్చి, తనూ ఒక బాల్చీతో నీరు తోడడం ప్రారంభించాడు డ్రైవరు.

లాంచి వెనకభాగాన కేటాయించిన ఒక చిన్న గదిలో తుంగచాప పరుచుకుని గల్లా పెట్టె తెరచి లెక్కలు చూసుకుంటున్నాడు లాంచి గుమాస్తా కైలాసం. లగేజ్ బాపతు వసూళ్ళు, పాసింజర్ల రేవులబాపతు వసూళ్ళు విడివిడిగాను, జమిలిగాను లెక్కగట్టి షావుకారు కళ్ళు కప్పి ఎంత స్వాహా చేయచ్చో కరారుగా తేల్చుకుని హమ్మయ్య అంటూ తృప్తిగా గుటకేశాడు.

ఇంజను రూములోని నీళ్ళు ఎడతెరిపి లేకుండా తోడేసి పడిచెక్క మీద పోస్తున్నారు డ్రైవరు, క్లీనరు. తోడేసిన కొద్దీ జల ఊరడంతో నీటి మట్టం క్రమేపీ పెరగసాగింది. ఏ క్షణానికైనా ఆయిల్ పంపు మునిగి ఇంజను ఆగిపోవచ్చు. అది గమనించిన డ్రైవరుకి నీరసం ఆవరించింది.

పాదాలు తిమ్మిరెక్కాయి కాబోలు కేబినులోనుంచి మరో వ్యక్తి బయటికి వచ్చి పడిచెక్క మీద నిలబడిన డాక్టరుగారిని చూసి "దండాలండీ!" అన్నాడు.

"నువ్వా వున్నావా భూషయ్యా ఈ కేబినులో, చూడనేలేదు. సంత చేసుకొస్తున్నావా" పలకరించాడు అవధాని.

"చిత్తం! కాదండి. మా పెద్దమ్మాయిని పురిటికి తీసుకొస్తున్నాను. మా ఆడంగులు వెనుక కేబినులో వున్నారండి."

భూషయ్య వెనకాలే మరో నలుగురు బయటికి వచ్చారు.

"అదేమిటి మావా! పెద్దాసుపత్రి వున్న పట్నం వదిలేసి ఈ మారుమూల మన్యానికి తీసుకొచ్చావా పురిటికి" అంటూ విస్తుబోయి అడిగాడు బీడీ అంటిస్తూ షోడా కొట్టు రంగయ్య.

"ఆసుపత్రి కాదు ముఖ్యం. డాక్టర్లు ముఖ్యం. దేముడులాంటి అవ ధానులుగారు ఇక్కడుంటే పట్టణమో లెక్కా" సమాధానం ఇచ్చాడు భూషయ్య.

"అవునులే! గవర్నమెంటు మందులు సప్లై చెయ్యకపోయినా నా బొందో అంటూ జేబులో సొంత డబ్బు లెట్టి మందులిచ్చే అవధానులు గారి లాంటి డాక్టరు దొరకొద్దూ" అన్నాడు కలగజేసుకుంటూ కిరాణా కొట్టు చెంగయ్య.

"లాభంలేదు. రోగం ముదిరిపోనాది, తీసుకెళ్ళి నలుగురికీ కబు రెట్టెయ్యి అని పట్నం డాక్టరులు తన్ని తరిమిన కేసులు ఈరు ఎన్ని నయం సెయ్యలేదు. వారి హస్తవాసే అస్తవాసి" అని వ్యాఖ్యానించాడు వడ్రంగి మేస్త్రి సుందరయ్య.

నిజానికది ముఖస్తుతే అయినా దానిలో నూటికి నూరుపాళ్ళు నిజం ఉంది. అవధాని డిగ్రీ పుచ్చుకున్నాక మన్య ప్రాంతంలో కొన్నాళ్ళు పని చేస్తేనే ఉద్యోగమన్న ప్రభుత్వ సూచనలు తు.చ.గా పాటించి, కొండ మొదలు గ్రామంలో ఏళ్ళతరబడి డాక్టరులేని ప్రభుత్వ ఆసుపత్రిలో చేశాడు మొదట్లో.

రిపేరు చేసిన మిషను ఇంకసలు రిపేరే లేకుండా పనిచేస్తే మెకానికు ఎంత సంబర పడతాడో అలా రోగం కుదిర్చిన రోగికి తిరిగి రోగం రాకపోతే అంత సంబరపడే మనస్తత్వం అవధానిది. ఉద్యోగంలో చేరిన కొద్దిరోజులలోనే అక్కడ ప్రజానీకానికి ఆప్తుడైపోయాడు. వృత్తి ధర్మం లోని తృప్తి, ఆ గూడెం ప్రజలపై మమకారం అతన్ని ఆ ప్రాంతానికే కట్టిపారేశాయి. గవర్నమెంటు ఇచ్చే గ్రాంటు, సిబ్బంది జీతాలకే కటాకటి అయినా ఇటు ఎలోపతితోపాటు చవక అయిన హోమియోపతి, ఖర్చులేని

ఆయుర్వేదం అవలంబించి ఆ ప్రాంతం వాళ్ళకి సాక్షాత్తు దేవుడై పోయాడు అవధాని.

ఆయిల్‌పంపు మునిగిపోయి సెగలు కక్కుతూ ఇంజను ఆగి పోయింది. దాంతో డ్రైవరు కొయ్యబారిపోయాడు.

"ఇంజను కట్టేశారేంటి చెప్మా" అని పడిచెక్కపై చేరిన జనాభా ఇంజను రూముకేసి నడిచారు. లాంచి గుమాస్తా కైలాసం కూడా అక్కడికి చేరాడు.

కైలాసాన్ని చూసి డ్రైవరు మండిపడ్డాడు. "చూడు. ఓవరులోడు సెయ్యొద్దు మొర్రో అంటే నామాట విన్నారుకాదు. అసలే ఇది వారుక్వాలిటీ లాంచి. ఎకరున్నవన్నీ సుడిగుండాలే. లాంచి వాటిలో మునిగితే పోలీ సోళ్ళు నన్నే పట్టుకుంటారు. పాసింజర్ల కు సంజాయిషీ ఏం ఇస్తావో నువ్వే ఇచ్చుకో" అంటూ దబేల్‌మని ప్రవాహంలోకి దూకి ఈదుకుంటూ పరారై పోయాడు డ్రైవరు.

డాక్టరు అవధాని ఇంజను రూము కేసి చూసి నిశ్చేష్టుడై పోయాడు. బుడబుడమంటూ ధారగా నీరు గదిలోకి వచ్చేస్తోంది. ప్రక్కగోడల సందు లోంచి ముందు వెనక కేబిన్లలో కూడా సన్నని ధారలు పడుతున్నాయి.

భూషయ్య, రంగయ్య, సుందరయ్య తదితరులు లాంచి మునగడం తథ్యమని బెంబేలెత్తిపోయి, గోలెడుతూ వాళ్ళ ఆడంగులను రక్షించడానికి వెనక కేబినుకేసి పరుగెత్తబోయారు. ఈ అలజడికి బిత్తరపోయి కేబిను లోని పాసింజర్లు కిటికీలకేసి చేరారు. లాంచి తూకం కోల్పోయి ఇటూ అటూ ఒరగసాగింది. దాంతో అందరూ గొల్లుమంటూ చెల్లాచెదురుగా పరిగెత్తసాగారు.

"ఆగండి" గట్టిగా ఉరిమాడు అవధాని. ఆ కేకకు అదిరిపడి అందరూ ఒక్క-క్షణం స్తబ్ధులయ్యారు.

"మీరిలా చెల్లాచెదురై పరిగెడితే లాంచి ఒకవైపు కొరిగి ఈ అగాధంలో మునిగిపోవడం, మనమందరం మూకుమ్మడిగా చావడం తథ్యం. ఇంకా ఏమీ మించిపోలేదు. ఎక్క-డివాళ్ళు అక్క-డ కూర్చుంటే ఈ లాంచి నెలాగైనా గట్టుకు చేర్చే ప్రయత్నం చేయొచ్చు" అని గద్దించగానే కేబిన్లలో గోల గుసగుసలుగా మారి సద్దుమణిగింది.

"ఏటయిందో ఏటో" అంటూ చుక్కా-ని చక్రానికి తాడు బిగించి ఇంజను రూము చేరిన సరంగు విషయమేమిటో తెలుసుకుని జేజారెత్తిపోయాడు.

"ఇదిగో సరంగూ, లాంచిని ఉన్నపళంగా ఒడ్డుకు చేర్చగలవా?" అడిగాడు అవధాని.

"అయ్యబాబోయ్, కుదరదండి. నదికి వాలుగా పెళుతున్నాం మనం. అడ్డం తిరిగి రివర్సు అయి నదికి ఎదురెళితేగాని గట్టు చేరమండి. అడ్డం తిరగాలంటే ఇంజను ఆడాలండి. అయినా గట్టమ్మట మా చెడ్డ లోతండి. కొండంచున ఏ రాయైనా తగిలితే లాంచితిరగబడిపోయి రెండుతాళ్ళ లోతుకి పోద్దండి. అసలే లోడు మీదుంది.

"మరేం చెయ్యాలో చెప్పు" అడిగారందరూ.

"ఏం చెయ్యడమేటండీ. కృష్ణా! రామా! అని జపంచేసి, భారమంతా దేవుడు మీద వదిలేయడమేనండి. కాకుంటే ఈతొచ్చినోళ్ళకి గుండెధైర్యం వుంటే గోదాట్లో దూకేసి ఒడ్డున పడటమేనండి. ఈయాల్టికి ఇంక మరేలాంచి క్రాసింగ్ కూడా లేదండి" అన్నాడు వగరుస్తూ.

వీడి వాలకం చూసి డ్రైవరులా వీడూ దూకేసి పరారైపోతాడని

గ్రహించాడు డాక్టరు. "సరే నువ్వెళ్ళి చుక్కాని కాయి. మేము మిగతా విషయం చూసుకుంటాం. ఇదిగో చెంగయ్యా, నువ్వు సరంగుతోనే ఉండి, అతను చుక్కాని వదలకుండా చూడు" అన్నాడు అవధాని.

"చిత్తం" అంటూ సరంగు జబ్బట్టుకు లాక్కు పోయాడు చెంగయ్య.

ఇంజను రూములో అంతవరకు డొక్కుతో నీళ్ళు తోడుతున్న క్లీనరు అలసిపోయి, దానికి మించి బెదిరిపోయి ఏడుస్తూ అన్నాడు. "బాబు గారు, కిందటేడు ఇలాగే జరిగి ఆ ఎదురుగా ఉన్న గుడికాడ ర్యూన్సీబాయి మునిగిపోయి నలభై మంది పైగా పోయారండి. తప్పు మాది కాదండి. ఓవరు లోడు చేసినోడిదండి" వణికిపోతూ సంజాయిషీ ఇచ్చాడు క్లీనరు పాపారావు.

"భూషయ్యా! నువ్వూ, సుందరయ్యా టాపుమీద కెళ్ళి బరువుగా వున్న బస్తాలన్నీ గోదాట్లో పారేయండి. లాంచి మీద లోడు తగ్గించాలి. ఇదిగో చూడు రంగయ్యా, ముందు కేబినులో మరో నలుగురు కుర్రాళ్ళని పోగేసి ఇంజను రూములో నీళ్ళు తోడించు" అని పురమాయించాడు అవధాని.

దభీమని టాపు మీదనించి రెండు బస్తాలు గోదాట్లో పడ్డాయి.

దాంతో గుమాస్తా కైలాసం శివమెత్తిపోయాడు. "ఎవడివయ్యా నువ్వు. ఎవడబ్బసొమ్మని ఆ బస్తాలు గోదాట్లో పడేయించావు. పాతికవేల సరుకు. నువ్విచ్చుకుంటావా?" ముక్కు షోణాలు ఎగరేస్తూ మీది మీది కొస్తూ అవధానిని నిలేసి అడిగాడు కైలాసం.

"ఈ లాంచిలో ఎనభై మందికి పైగా పాసెంజర్లు ఉన్నారు. వాళ్ళ ప్రాణాలు ముఖ్యమా! ఈ బస్తాలు ముఖ్యమా!" అవధాని ప్రశ్న.

"గోడాట్లో ప్రయాణమంటే చావుకి తెగించే వస్తారు. అయినా చచ్చినోళ్ళకి గవర్న మెంటు ఏదో ముట్టజెపుతూనే ఉంది. లాంచీ మునిగి బస్తాలు మునిగితే వేరేవిషయం. లాంచి మునగండే బస్తాలు మునిగితే నన్ను ముంచేస్తాడు మా షావుకారు."

కైలాసం గోడు ఎవళ్ళూ పట్టించుకోలేదు.

దబదబ పాతిక బస్తాల దాకా గోడాట్లో పడ్డాయి. అదురుకి లాంచి కప్పగంతులెయ్యటం సాగింది. వెనుక కేబినులో ఆ వాళ్ళు పిడికిట్లో ప్రాణాలు పెట్టుకుని రామభజన మొదలెట్టారు. అందరి ముఖాల్లోనూ ప్రేతకళ తాండవిస్తూంది.

ఇంజను రూములో పరిస్థితి విషమించింది. పదిమంది తోడినా నీరు తగ్గడానికి బదులు పెరగసాగింది. ఇదివరలో సిమెంటు వగైరాలతో పూడ్చిన బెజ్జాలు కూడా నాని బయటపడ్డాయి. దాంతో ఇంజను గది అంతా ఒక మడుగులా తయారైంది.

అవధానికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. నీరు తోడుతున్న పదిమందినీ పైకి రమ్మని తవుడు బస్తాలని దింపి ఇంజను రూమునిండా కూరెయ్యమన్నాడు.

క్షణాలమీద తవుడు బస్తాలు ఇంజను రూములో టాపుదాకా పేర్చబడ్డాయి. వడ్రంగి మేస్త్రి కిటికీలు మూసేసి మేకులు కొట్టేశాడు. దాంతో గదికి బిరడాపడింది. అంతటితో నీరు కట్టుడింది. క్రమేపీ పడిచెక్క బాగా నీటిపై తేలడంతో ముందు వెనుక కేబినుల్లో ధారలు తగ్గుముఖం పట్టాయి. ఇంకా టాపుమీద సుమారు ముప్పై బస్తాలు వుండిపోయాయి. ప్రస్తుతానికి ప్రమాదం లేదని అవలా వదిలేశారు.

"బాబుగారూ! ఆ వచ్చే మెలికలోనే సుడిగుండా లున్నాయి. అక్కడే ప్రమాదం" బిత్తరపోతూ అన్నాడు క్లీనరు పాపారావు.

అపఘాని లాంచి టాపు ఎక్కి చూశాడు. కుడిప్రక్క 'పెట్లుకొండ' ఎడమప్రక్క 'కచ్చులూరు' రెండు కొండలు. ఆ రెండుకొండల నడుమ గోదావరి ప్రవాహం అడ్డం తిరిగి మెలికపడింది. ప్రవాహానికి అడ్డంగా ఏ కొండైనా తగిలితే నీరు కొండని ఢీకొని ఎదురు ప్రవాహంగా మారి కొంతమేరం ప్రవహిస్తుంది. అదే 'మారువడి.' మామూలు ప్రవాహానికి, మారువడికి మధ్యభాగంలో సుడిగుండాలేర్పడతాయి. ఆ సుడిగుండాలు దాటాలంటే లాంచి కుడివైపు మందంగా ఉన్న ప్రవాహంలోకి పోనిచ్చి, సుడిగుండాలను తప్పించుకుని అడ్డం త్రిప్పాలి. ఇంజను శక్తి సహాయం లేకపోతే మారువడిలో పడ్డప్పుడు చుక్కానిమీద విపరీతమైన భారం పడుతుంది. కనుక అది సరంగు శక్తి సామర్థ్యాలమీద ఆధారపడి ఉంటుంది.

మందంలోకి చుక్కానిని కాయమని ఆదేశమిచ్చాడు అపఘాని. యాంత్రికంగా శిరసావహించాడు సరంగు.

మందవడిలో నత్తనడక నడుస్తూంది లాంచి.

"డాక్టరుగారూ! అమ్మాయి నొప్పులతో బాధపడుతూంది" అంటూ గోలెట్టింది కిటికీలోంచి చూస్తూ ఘోషయ్య భార్య.

చేతిసంచి తడిమి ఓ మాత్ర తీసి "దీన్ని మింగమను. నొప్పులు తగ్గిపోతాయి" అని మాత్ర అందించారు డాక్టరు.

ఘోషయ్య కళ్ళు చెమర్చాయి. అపఘానికేసి చూసి రెండు చేతులూ జోడించాడు.

వందగజాలు దాటడానికి అరగంట పట్టింది లాంచికి. ఇంకో పాతిక గజాలలో ఎదురుగావున్న కొండ తగులుతుంది. చుక్కాని ఎడమవైపు కాసి ఎదురు ప్రవాహానికి ఐమూలగా పెడుతూ సుడిగుండాన్ని తప్పించుకుని అడ్డవడిలో పడాలి.

ఎడమవైపుకు చుక్కాని కాయమని ఆదేశమిచ్చాడు అవధాని. అప్పటికే ప్రవాహంలో మందం తగ్గి, మారువడి ఎదురైంది. చుక్కాని మీద భారం పెరగసాగింది. శక్తివంచన లేకుండా భుజబలాన్ని ఉపయోగిస్తున్నాడు సరంగు. అతని కండరాలు బిగిశాయి. అతనికి సాయం చెంగయ్యి కూడా ఓ చెయ్యి వేశాడు. ఊగిసలాడుతూ ఎదురు ప్రవాహాన్ని తప్పించుకుంటూ కేవలం గాలిపోటు మీద మలుపు తిరుగుతోంది లాంచి.

పెళేల్‌మంటూ పిడుగులాంటి శబ్దం రావడం, చుక్కాని చక్రం దగ్గర గొలుసు తెగి రెండుముక్కలై అటు ఇటు వున్న వడిచెక్కలమీద పడి చెల్లా చెదరవడం, బాబోయ్ అంటూ సరంగు గోదాట్లో దూకేసి పరారవడం, అది చూసి ముందు కేబినులో మగవారు బెదిరి అమాంతం కిటికీల గుండా పడిచెక్కపైకి ఎగబాకడం, దాంతో లాంచి తూకం కోల్పోయి అల్లల్లాడడం, ప్రాణాలు పోతున్నాయన్న భయంతో వెనక కేబినులో ఆడాళ్ళు గావుకేకలు పెట్టడం, లాంచి క్రమంతప్పి క్రమేపీ అడ్డం తిరిగి సుడిగుండంలో పడ్డం, అన్నీ కళ్ళముందు క్షణాలమీద జరిగిపోయాయి.

అవధాని నిశ్చేష్టుడైపోయాడు.

గుండంలో పడ్డ లాంచి రెండు ప్రదక్షిణాలు చేసి వేగం కోల్పోయింది. అదే గోదావరి వరదలు కాలం అయితే గిరగిరా తిరిగి నిలువునా మునిగి పోయుండేది.

అప్పటికే మగజనాభా చాలామంది టాపుపైకెక్కేశారు. ఈతొచ్చినవారు సైతం సుడిగుండంలో పడ్డానికి సాహసించలేక అందరితోపాటు గోవింద నామస్మరణ చేస్తూ కళ్ళప్పగించి తమ చావు ఎలా సంభవిస్తుందో చూస్తున్నారు.

అవధాని తమాయించుకుని పరిస్థితిని గమనించాడు.

లాంచి ఎటూ పోక గుండంలోనే మెల్లి మెల్లిగా అడ్డం తిరుగు తోంది. గుండాన్ని దాటించి నదిలో పడాలంటే గుండాన్ని ఛేదించాలి. అలా ఛేదించాలంటే గుండాన్ని చెదరగొట్టాలి. టాపుమీద ఇంకా కొన్ని బస్తా లున్నాయి. అవన్నీ ఒకేసారి గుండంలో పడేస్తే గుండం చెదిరిపోవడానికి అవకాశం వుంది. అలా జరగాలంటే నలుగురూ చేతులు కలపాలి. కాని అక్కడ వాళ్ళకి మతి మతిలో లేదు. అయినా గట్టి ప్రయత్నం చేయదలి చాడు అవధాని.

"అయ్యా ఒక్కసారి నా మాటాలకించండి" అంటూ టాపుమీద వున్నవాళ్ళ నుద్దేశించి అరిచాడు. అందరూ అతనికేసి తిరిగారు. "ఇప్పుడీ గుండం నుండి బయటపడి గండం గడవాలంటే మీరందరూ నే చెప్పినట్లు చెయ్యాలి. ఈ బస్తాలన్నీ టాపుమీద పడిచెక్క వారనే ఒకవేపు పేర్చి లాంచి ప్రవాహానికి తిరిగినప్పుడు అన్నింటినీ ఒకేసారి దభీమని గుండంలో పడెయ్యాలి. దాంతో గుండం చెదిరిపోవచ్చు. లాంచి తేలిపో వచ్చు. ప్రవాహంలో కెరటం రావచ్చు. ఆ కెరటంలో కొట్టుకొని లాంచి నదిలోపడి మనం బ్రతకవచ్చు. కనుక లాంచి ప్రవాహానికి అడ్డం తిరగ గానే ఈ కండువా వూపుతాను. బస్తాలన్నీ ఒకేసారి నదిలో పడాలి. మరో మాట. చుక్కానిలేని మీదట లాంచి నదిలోపడినా తిరిగి మారుపడిలోపడి గుండానికి చేరదన్న గ్యారంటీ లేదు. కనుక పడిచెక్కమీద నుంచుని తెగిన గొలుసులు రెండూ లాంచికి ఇటూ,అటూ సమానంగా పట్టుకుంటే చుక్కాని అడ్డం తిరగదు. అప్పుడీ గుండాన్ని తప్పించుకోవచ్చు".

ఆ మాటలువిన్న నలుగురూ నాలుగు రకాలుగా ఎదురు సలహాలిచ్చి ఎట్టకేలకు అవధానిగారి మాటమీద నిలబడి కార్యాచరణకు ఉపక్రమించారు. సగంమంది బస్తాలకి, సగంమంది చుక్కాని గొలుసులకి సర్దుకున్నారు.

లాంచి ప్రవాహానికి నెమ్మది నెమ్మదిగా అడ్డం తిరుగుతోంది........ ఇంకొ స్త తిరగాలి........ తిరిగేసింది. అవధాని కండువా వూపాడు. దఫీ మని బస్తాలు ఒక్కసారి పడ్డం, ప్రవాహంలో ఉవ్వెత్తున కెరటం లేవడం, ఆ కెరటంలో అడ్డంగా లాంచి ఎగిరి వడిలో పడ్డం, చూపుకందని వేగంతో జరిగిపోయాయి.

ఒక్కసారి వేయి నిట్టూర్పులు. గోవర్ధనగిరిని ఎత్తిన క్రిష్ణ పర మాత్మే ఇలా అవధాని రూపంలో సాక్షాత్కరించాడని అందరికీ అని పించింది. చేతులెత్తి అవధానికి నమస్కరించారు.

లాంచి తేలుతూ ప్రవాహంలో సాగుతోంది. చుక్కాని గొలుసులని పట్టు విడవకుండా కొందరు పట్టుకున్నారు. మరో రెండు వందల గజాల దూరంలో ఇంకో మలుపు ఉంది.

ప్రవాహానికి ఒక పెద్ద ఇసుకతిప్ప అడ్డువచ్చినందున అక్కడ గోదావరి కుడివైపుకు మళ్ళింది. ఆ ఇసుకతిప్ప చేరగలిగితే గండం గడిచి నట్లే. కాని ఇప్పుడు ప్రవాహంలో పడ్డ లాంచి ఇసుక తిప్ప చేరక ప్రవాహంతోనే కుడివైపుకు మళ్ళిపోవచ్చు. అలా జరిగితే మళ్ళీ ఎన్నో కష్టాలు ఎదుర్కోవాలి. కనుక ఇసుక తిప్ప నెలాగైనా చేరాలి. అక్కడి దాకా పోనిచ్చి ఈదుకెళ్ళి లాంచిని గట్టుకు లాగిద్దామా అంటే లాంచిలో బారెడు తాడు కూడా లేదు. దానికి సాయం లంగరుకు తగినంత గొలుసు కూడా లేదు. కనుక ఎలాగోలా మలుపులో ప్రవాహానికి అడ్డుపడి ఇసుక తిప్పని ఢీ కొట్టించాలి.

ఆలోచనలో పడ్డాడు అవధాని.

"డాక్టరుగారూ! అమ్మాయికి మళ్ళీ నొప్పులు వొస్తున్నాయండీ" అంటూ గోడు పెట్టింది భూషయ్య భార్య. భూషయ్య అమాంతం అవధాని కాళ్ళమీద పడ్డాడు.

"కేబినులో వుంటే లాభం లేదు. అమ్మాయిని టాపు మీద కెక్కించండి" సలహా ఇచ్చాడు డాక్టరు.

లాంచి మధ్యభాగంలో ఇంజను రూము టాపుమీద భూషయ్య కూతురిని పరుండబెట్టారు. మరికొందరాడవాళ్ళు చుట్టూ నిలబడి చీరలతో దడి ఏర్పాటు చేశారు.

డాక్టరు అవధాని అమ్మాయిని పరీక్షించి మరో మాత్ర ఇచ్చాడు.

చుట్టూ కట్టిన చీరలు గాలి పోటుకి పొంగడం చూసిన అవధానికి, లాంచికిగాని తెరచాప బిగించగలిగితే గాలిపోటులో ఇసుక తిప్ప చేరవచ్చు ననిపించింది.

లాంచిలో బలమైన వెదురు గెడలు నాలుగున్నాయి. వాటిని ఒక చట్రంగా బిగించమని సుందరయ్యకి ఆదేశమిచ్చాడు. పాసింజర్ల మూటలు, ముళ్ళు తడిమితే నాలుగు దిట్టమైన దుప్పట్లు దొరికాయి. వాటికి ముళ్ళేసి ఆ చట్రానికి కట్టించాడు. మలుపు దగ్గర ఈ చట్రం పైకెత్తితే గాలిపోటుకి లాంచి ఎదురు ప్రవాహంలో దూసుకుపోయి తిప్ప చేరగలదనుకున్నాడు.

కాని తిప్పకు ఢీకొడితే లాంచి కుడివేపు ప్రవాహంకేసి ఒరిగి నీరు తోసుకుని మునిగిపోగలదని సందేహం కూడా కలిగింది అవధానికి. అదే జరిగితే కేబినులోని పాసింజర్లు నీళ్ళలో ఉక్కిరిబిక్కిరై గిలగిల తన్నుకు చస్తారు. లాంచి ప్రమాదాల్లో ఇలా కేబిన్లో ఇరుక్కుపోవడం వల్లనే గజ ఈతగాళ్ళు సైతం బ్రతికి బట్టకట్టలేకపోయారు ఇదివరలో. పోనీ అందరినీ టాపుమీదకు ఎక్కిద్దామా అంటే తల బరువుకి లాంచి తలక్రిందులై అసలుకే మోసం అవుతుంది. అంచేత లాంచికి కేబిను ఉండడం ప్రమాదం అనిపించింది. వెంటనే అందరికీ చెప్పాడు—

దాంతో నలుగురూ పుంజుకుని లాంచిలో ఉన్న కత్తి, గునపం,

గొడ్డలి పగ్గె రాలతో ఇంజను కేబిను మినహా టాపు రేకులు, ప్రక్క కీటీ కీలు ఊడగొట్టి గోదాట్లో పడవేయసాగారు.

లాంచి గుమాస్తా కైలాసానికి మతోయింది. పిచ్చివాడిలా కేకలెయ్య సాగాడు. "బస్తాలు పడేస్తే ఊరుకున్నాను. ఇప్పుడు లాంచికి ఎసరెడుతున్నారు. లక్షరూపాయల లాంచి ముక్కలు ముక్కలు చేసేస్తున్నారు. మా షావుకారంటే మీకు తెలియదు కామోసు. మీ అంతు చూస్తాడు" అంటూ గునపానికీ, గొడ్డలికీ అడ్డుపడగా, ఫెడేలుమని లెంపకాయకొట్టి "అడి బాబుతో చెప్పుకోమను" అని నోరు మూయించాడు క్లీనరు పాపారావు.

పావుగంటలో లాంచి పడిచెక్క పైభాగం (ఇంజను కేబిను మినహా) అస్థిపంజరంలా తయారయింది.

ఇంజను రూము టాపు భాగాన భూషయ్య కూతురు నొప్పులు పడుతోంది. అందరూ టాపులేని కేబిన్లో మౌనంగా కూర్చున్నారు. డాక్టరు లాంచి ముఖభాగాన నిలబడి ఆకాశంకేసి చూస్తున్నాడు. "రోగులెదురౌతుంటున్న మృత్యువుతో డాక్టరుగా పోరాడి ఎందరి ప్రాణాలో ఇంతవరకూ కాపాడుతూ వచ్చాను. అలాంటిదీనాడు రోగానికి లొంగని ఎన్నిప్రాణాలు మృత్యువుతో ముఖాముఖీ పడ్డాయి! వైద్యుడిగా కాక ఒక వ్యక్తిగా ఆత్మ విశ్వాసంతో మానవ ప్రయత్నం చేస్తున్నాను. దీని ఫలితం కేవలం దైవ నిర్ణయం" అని అనిపించింది అవధానికి.

మరికొద్ది నిముషాలలో బ్రొడ్డువాలి కొండలచాటుకి పోవచ్చు. అప్పుడంతా అంధకారమే. లాంచి తాపీగా ముందుకు సాగుతోంది. ఇంకో యాభై గజాలలో మలుపు.... ఇంక పాతికే—అదిగో ఎదురు ప్రవాహంలో పడబోతోంది. అవధానికి చిరు చమటలు పట్టాయి.

అందరినీ నిలబడి టాపు బాపతు ఇనుప కడ్డీలను పట్టుకొమ్మని అరి

పాడు. అందరూ అలాగే చేశారు. మరీ పొట్టివాళ్ళు, పిల్లలు బెంచీలమీద నుంచునిఇనుప కడ్డీలు పట్టుకున్నారు.

కచ్చలూరు పొగతోటలో పని చేసే కూలీలు దూరంగా కనపడ్డ లాంచి చూసి ఇసుక తిప్పమీద బారులు తీరి నిలబడ్డారు.

లాంచి ఎదురు ప్రవాహంలో పడింది.

తెరచాప చక్రాన్ని ఎత్తమన్నాడు. దైవికంగా గాలిపోటు హెచ్చింది. లాంచి బాణంలా దూసుకుపోతూ ఇసుక తిప్ప కేసి పోసాగింది. ఆ వేగానికి కళ్ళు తిరిగి గొల్లుమన్నారు యావన్మంది. లాంచి ముఖ భాగం ఇసుక తిప్పని తాకగానే, లంగరు గొలుసులు వదిలెయ్యండని అరిచాడు అవధాని. దాంతో లాంచి ఉన్నపళంగా అడ్డంతిరిగి ఒక ప్రక్కకి ఒరిగి తొట్టినిండా నీరు పోసుకుని తూకంగా గట్టువారే ములిగింది.

అందరూ మొలలోతు నీళ్ళల్లో యినుపకడ్డీలు పట్టుకుని సురక్షితంగా మిగిలారు.

డాక్టరు అవధాని తిప్ప మీదికి దూకి అప్పుడే అస్తమిస్తున్న సూర్యుడికేసి గర్వంగా చూశాడు. అప్పుడే జన్మించి కావ్, కావ్మంటున్న భాషయ్య మనవడి కేక వినగానే ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి.

*  *  *

డుం! డుం! డుం! డుం! డుం! డుం!....

లయబద్ధమైన శబ్దం చేసుకుంటూ హంసలాగ సాగుతోంది లాంచి "భూలోకసుందరి". లాంచి అంతా ఖాళీగా వుండడంతో ఇంజను ఎంతో ముచ్చట పడుతూ హుందాగా పనిచేస్తోంది.

పండుగ రోజులు కనుక పాసింజర్లు లేరు.

శలవుల్లో బస్తీలోవున్న భార్య, పిల్లలతో గడపటానికి ఆ లాంచిలో

ఒంటరిగా ప్రయాణం చేస్తున్నాడు అవధాని. చల్ల గాలికి టాపుమీద కూర్చు న్నాడు.

అవధాని మనసు లాంచికన్నా వేగంగా యిల్లు చేరుకొంది. "ఎప్పుడో దసరాకి వస్తావు. ఇప్పటిదాకా ఎందుకు రాలేదు" నిలదీసి అడుగుతున్న కొడుకు, కూతురుకి ఎన్నో విధాలుగా సంజాయిషీ యిచ్చుకొంటున్నాడు. భార్యకూడా పిల్లల తరఫున వాదించడంతో "ఉండు నీ పని పడతా" అంటూ కన్నుమీటాడు ఆతను. భార్య సిగ్గుపడి తుర్రుమని వంటింట్లోకి పారిపోయింది. అది చూసి విరగబడి నవ్వాడతను.

"నవ్వవయ్యా నవ్వు! నీ సొమ్మేంపోయింది. పోయిందంతా నాదేగా" అన్న మాటలు విని ఈ లోకంలో పడ్డాడవధాని.

ఎవరో పరిచయం లేని వ్యక్తి తన ఎదురుగా కూర్చొన్నాడు. బుర్రమీసాలు, గిరజాల జుట్టు, చెవుల్లో దుద్దులు, మెళ్ళో గొలుసు. గార పళ్ళమధ్య తళుక్కుమంటున్న బంగారు పళ్ళు, చేతిలో మూరెడు చుట్ట.

"నువ్వేనన్నమాట ఆ డాక్టరు. నేనెవర్నో నీకు తెల్సుండదులే. మొన్న నువ్వు ముంచేసిన లాంచి "త్రిలోకసుందరి" లేదూ! దాని ఓనర్ని, ఈ లాంచికీ ఓనర్నే అనుకో."

"చూశారా, ఓవరులోడు చేసినందుకు ఎంత ప్రమాదమో" అవ ధాని వ్యాఖ్య.

"ఓవర్లోడు గట్రా సూసుకోడానికి వేరే డిపార్టుమెంటుంది. మేమూ, మేమూ సూసుకొంటాం— మధ్యన నువ్వెవరూ అడగటానికి."

"నలభై మంది పట్టే లాంచిలో తొంభై మందిని ఎక్కించి పైగా బస్తాలతో ఓవరులోడు చేయడం తప్పుకాదా?"

"ఎక్కినోడుది తప్పు. నువ్వేం పతెకొక్కవు అలాంటి లాంచిలో?"

వీడితో వాదించి లాభం లేదనుకున్నాడు అవధాని. "ఇప్పుడు నేను అడుగుతున్నాను. లాంచిని తుక్కు తుక్కు చేసి ముంచేశావు. నాకు రెండు లక్షలు నష్టం వచ్చింది. నువ్విచ్చుకొంటావా?"

"నేను ముంచడం ఏమిటండీ! గట్టున చేరుండకపోతే సుడిగుండంలో పడి అదే మునిగుండేది. అందులో అందరం చచ్చుండేవాళ్ళం."

"అప్పుడు శవాలు తీయడానికి గవర్నమెంటోళ్ళే నా లాంచిని బయటకు లాగుండేవాళ్ళు. కానీ కరుచు లేకుండా నా లాంచి నాకు దక్కుండేది. దానితోబాటే చచ్చినోళ్ళ తాలూకోళ్ళకి ఆళ్ళు జనమలో సంపాదించ లేనంత గవర్నమెంటు సొమ్ము ముట్టుండేది. ఇన్సూరెన్సువోళ్ళ ముక్కు పిండి కొత్త ఇంజను రాబట్టుండేవాణ్ని."

"అంటే మీకు ఖర్చు తప్పడానికి పాసెంజర్ల ప్రాణం పోయినా పరవాలేదన్నమాట?"

"నా లాంచి ఎక్కేవోళ్ళు అడవి మనుషులు. అడవిలో కాపరం అంటే నీకూ తెలుసు. పులో, పురుగో, పుట్రో రోజూ ఎవర్నో ఒకర్ని బలి తీసుకొంటుంది. కనుక యిక్కడోళ్ళు చావుకి తెగించినోళ్ళే."

"అందుకని మీరు ఓవర్లోడు చేసి చంపేస్తారా?"

"బలేవాడివయ్యా. చంపాలని పనిగట్టుకొని ఓవర్లోడు చేస్తానా. ఓవర్లోడయ్యి వాళ్ళే చస్తూంటారు. నల్లురితోబాటు చావుకూడా పండుగే అన్నారు కనుక పండుగ సేసుకుంటారు అంతే." గారపళ్ళు ఇకిలిస్తూ అన్నాడు.

'వీడెవడో నరరూప రాక్షసుడు లాగున్నాడు వీడి "లాజిక్కు" అంతేమిటో చూడా' లనుకొన్నాడు అవధాని.

"ఓవరులోడు చేయకుండా అవసరమైతే మరోసారి తిప్పచ్చు గదా లాంచిని" అడిగాడు అవధాని.

"నీ సొమ్మేంపోయింది. పది ట్రిప్పులు వేయమంటావు. ఇంజన్లు పచ్చిగాలి పీల్చి పట్టి నీళ్ళు తాగి పన్చేయవు. వాటిలో ఆయిలు పొయ్యాలి. ఆయిలు ఖరీదెంతో తెల్సా? సరే. నువ్వన్నట్టే ఓవరులోడు చేయను, అలా గని మేమిచ్చుకొనే మామూళ్ళు తగ్గుతాయా? పోనీ కేవు పెంచితే పాసింజర్లు వూరుకుంటారా? అందుకని నూటికోసారొచ్చే ప్రమాదానికి జడిసిపోతే చివరికి చిప్పే మిగులుతుంది."

ఒళ్ళు మండిపోతోంది అవధానికి.

షావుకారంతటితో ఆపక "అయినా నీకీ గొడవంతా ఎందుకు? నువ్వే సముకొన్నాడివి. నీకు ఈత రాకపోవచ్చు. అలా అని నీకు ప్రాణ భయం లేదు. మా సరంగు సెవులో చెప్పుంటే నిన్ను భుజా నేసుకుని ఈది గట్టుకు చేర్చుండేవాడు."

"నేనీ గోదావరి గడ్డనే పుట్టాను. నాకు బాగా ఈతొచ్చు. రోజూ రెండుపూట్లా ఈ గట్టు నుండి ఆ గట్టుకి ఈత్తాను." అన్నాడు అవధాని.

"మరింకేం. నీకు రిసుకులేదన్న మాట. తక్కినోళ్ళ సంగతంటావా. వాళ్ళకెంత రిసుకుందో మాకూ అంతుంది. మాటవరసకి ఈ లాంచే చూడు. ఇంతవరకు నాలుగుసార్లు మునిగిపోనాది. దానివలన సొమ్ముకి సెడక పోయినా సర్వీసుకి సెడలేదూ?"

"మరిలా ఏక్సిడెంటు అయితే మీ మీద కేసుండదా?"

"ఎందుకుండదు? బోల్డు కేసుంటుంది. డ్రైవరుని, సరంగుని ఆరు నెలలు మూసేస్తారు. ఆళ్ళకి భత్యాలు నేనే ఇచ్చుకుంటాను. ఇప్పుడీ లాంచి నడుపుతున్న డ్రైవరు, సరంగు ఇప్పటికి పదిసార్లు జైలుకు వెళ్ళారు.

ఆళ్ళకి నేనిచ్చుకున్నాను గనుక మళ్ళా నా దగ్గరికే వచ్చారు. కనుక అసలు పాయింటుకి వచ్చేద్దాం. ఇప్పుడు నా కొచ్చిన నష్టం నువ్వే భరించాలి."

"ఇన్సూరెన్సు వాళ్ళున్నారుగా వాళ్ళ నడగండి."

"ఆ పప్పులుడకవు. లాంచి మునిగితే వాళ్ళిచ్చుకుంటారు గాని, ముంచేస్తే ఇవ్వరు. నువ్వు దాని కేబిను గట్టా ఊడగొట్టి గోదాట్లో పడే శావు. అందుకే మునిగిందంటారు."

"నాకేం సంబంధం లేదు. అయినా నా దగ్గర పైసా లేదు."

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకు బాగా ఆలోచించి ప్లానేశాను. నువ్వు మా గొప్ప డాక్టరువనీ, డబ్బులుచ్చుకోవనీ, గుంపులు గుంపులుగా అందరూ వస్తారనీ విన్నాను. ఆ ఆసుపత్రి 1 మ్మం కాడ మా గుమాస్తా నెట్టి వసూలు చేయించుకుంటాను. అప్పుడు నీ సొమ్మేం పోదు. మంచి పబ్లిసిటీ ఇచ్చి ఒకటో రకమైన కేసులు నేను కూడా పంపిస్తాను. నీ అప్పు వడ్డీతో సహా ఏడాదిలో తీరిపోద్ది- ఏమంటావు?"

"ఛస్తే ఒప్పుకోను. నీమీద రిపోర్టు ఇచ్చి జైలులో పెట్టిస్తాను."

విరగబడి నవ్వాడు షావుకారు. "చూడు డాక్టరూ? నువ్వు ఒప్పుకుంటావనే భరోసాతో నా ట్రేడు సీక్రెటులు అన్నీ చెప్పేశాను. ఇప్పుడు మనం మనం ఒకటి. కనుక ఒప్పేసుకో. అలా కాదని ఎదవ్వేషాలేశావో రేప్పొద్దున ఫలానా "భూలోకసుందరి" లాంచి మునిగి ఓ డాక్టరు గోవిందా అంటూ పేపర్లో పడద్ది. ఎలాగో తెలుసా? చాలా సింపులు. ముందస్తుగా నీ చేతులూ, కాళ్ళూ కట్టిపారేస్తాం. తరువాత అదిగో సూడు ఆ ఎదురుగా వున్న కొండ మలుపులో లాంచి వెనకాల వున్న చుక్కాని బాపతు సీలని వూడపీకేసి నేనూ, డ్రైవరు, సరంగు ఇసుకతిప్పమీదకి దూకేస్తాం. ఇంజను ఆడుతూనే వుంటుంది. లాంచి యమస్పీడుగా వెళ్ళి కొండని

క్కొట్టి మునిగిపోద్ది. అంతే. మర్నాడు పేపర్లో నూసెన్సు. దాంతో నాకు ఇన్సూరెన్సు. కనుక నువ్వు బాగా టయిము తీసుకుని ఆలోచించుకో. ఇలాంటి కొండ మలుపులు ఇంకా బొచ్చెడున్నాయిలే" అంటూ విసురుగా టాపు దిగి కేబినులోకి వెళ్ళిపోయాడు.



టాపు మీంచి లాంచి వెనకాలున్న చుక్కాని సీలని చూశాడు అవధాని. సీల ఇట్టే గోటితో పీకేటంత సులువుగా వుంది. క్షణం ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాడు.

* * *

భార్య అందించిన పేపరు చూశాడు అవధాని— "పాపికొండల నడుమ గోదాట్లో ఘోర ప్రమాదం. "భూలోకసుందరి" మునక. లాంచి ఓనరుతో సహా సిబ్బంది మరణం. ప్రాణాలతో బయటపడ్డ డాక్టరు కథనం" అంటూ తాటికాయంత అక్షరాలతో వార్త.

పేపరు మూసేసి గుంభనగా శూన్యంలోకి చూశాడు అవధాని. అంతరాత్మ చిలిపిగా నవ్వింది. ●

# గుండెల్లో గోదారి

శుభానికైనా, అశుభానికైనా అందరూ కలిసి కట్టుగా వుంటారు బంగారంపేట జనాభా.

ఆ ఉదయం శుభకార్యమే జరుగుతోంది. దానికీ, వాడికీ—పెళ్ళి. ముహూర్తానికింకా అరగంట పైగా వుందనగానే తూతూమంత్రం చెప్పి తాళి కట్టించేయాలని తొందర పడుతున్నాడు పంతులు.

గోదావరి వరద మంచి పోటులో వుంది. ఎగువనున్న పోలవరం దగ్గర ఊటకు గట్లునాని అండలండలుగా పడిపోతున్నాయన్న పుకారు తెల్లార గట్టే విన్నాడు పంతులు. అదే నిజమైతే గండి పడడం ఖాయం. ఈ లోతట్టు

గ్రామం క్షణంలో మునిగిపోయి, కొట్టుకు పోగలదన్న సంగతి పంతులుకి తెలుసు. అందుకే ఎలాగో ఈ పెళ్ళి అయిందనిపించెయ్యడానికి హడావిడి పడుతున్నాడు.

దాని పెళ్ళి చూడాలన్న సరదా, పప్పు అన్నం తినాలన్న సంబరంలో ఈ సంగతెవరూ పట్టించుకోవడం లేదు ఆ పేట జనాభా.

పూరిళ్ళ నడుమ పాటిదిబ్బను సాపుచేసి, అలికి ముగ్గెట్టి దాని మీద ఎత్తుగా షామియానా వేసి, దాంట్లో రెండు ఇనుపకుర్చీలు వేసి దాన్ని—వాణ్ణి కూర్చోబెట్టారు.

తెల్లచీర, చెమటకు పసుపుబారిన తెల్లని రవిక, పెద్దకళ్ళను మరింత పెద్దవి చేస్తున్న నల్లని కాటుక, బాసికం బిగువున దోబూచులాడుతున్న పెళ్ళిబొట్టు. బుగ్గసొట్టను మరింత సొట్ట చేస్తున్న చుక్క, బాసికం దారాల బిగువుకు పొంగి కోలముఖాన్ని మరింత కోలగా మార్చిన పత్తైన జుట్టు, ధృఢమైన అరచేతుల్ని మృదువుగా మార్చిన గోరింటచుక్కలు, వంపులకు సొంపులిస్తున్న చెమ్కీదండ, ఎప్పుడూ పంచకళ్యాణిలా పరుగులెత్తే ఆ చెలాకి పిల్లకు సిగ్గుముంచుకొచ్చి, తల వంచుకుని, రంగు రంగుల గాజులను మాటిమాటికీ తడుముకుంటూ బొమ్మలా కూర్చోడం అందరికీ ఆశ్చర్యంగానూ సంబరంగానూ వుంది.

ఇంకా పైలరుకొట్టు వాసన వదలని తెల్లచొక్కా, అంచులున్న తెల్ల పంచె, తలపాగా వదులవ్వకుండా కాస్తున్న బాసికం, కర్పూరం హారించిన చెమ్కీదండ వేసుకుని, నల్లకళ్ళజోడు లోంచి దిక్కులు చూస్తూ, అక్కడ ఆడంగులందరి కన్నా తనకు కాబోయేదే అందగత్తె అన్న ధీమాతో కాలుమీద కాలేసుకుని దిబ్బ అదిరేలా కాళ్ళూపేస్తున్నాడు దాని పక్కన కూర్చున్న ఆ కాబోయేవాడు.

పిల్లా జల్లతో, పిన్న పెద్దలతో దిబ్బంతా కిటకిటమంటూ కళకళ లాడుతోంది.

పరగడుపునే పీకల్దాకా పట్టించి. ఢమా ఢమా వాయిస్తున్న రామ ఢోలు అక్కడ వాతావరణాన్ని మోతెక్కించేస్తోంది. ఆ మోతకు లయగా బిలబిలా పిల్లలు షామియానాలో అమ్మలక్కలను చూసుకుపోతూ గొల్ల స్తంభాలాట ఆడేస్తున్నారు. దిబ్బ దిగువున గాడిపొయ్యి మీదున్న వరుస గుండిగలు మరిగిపోతున్నాయి. వాటి చుట్టూ వున్న కంజాయింపుగాళ్ళ వంటల్ని చక చకలాడించేస్తున్నారు. అలా అక్కడ వాతావరణం పెళ్ళి కళతో ధగ ధగలాడిపోతోంది.

"అయం ముహూర్త స్సుముహూర్తోస్తూ...." అయ్యా అందరూ అక్షింతలు వెయ్యండి అన్న పంతులు కేకకి క్షణంలో ఆ జంట బాపతు తలలు పసుపు బారిపోయాయి.

మాంగల్యం తంతునానేన మమజీవన హేతునా, కంఠేబధ్నామి శుభ గేత్వం....

చాటుగా పోయిన బాజావాళ్ళు చటుక్కున ఊడిపడి మిగతా మంత్రాల్ని మోతలో కలిపేయగా దాని మెడలో వాడు మూడు ముళ్ళూ గట్టిగా వేశాడు.

"తప్పుకోండి తప్పుకోండి అబ్బాయిగారు వస్తున్నారు" అన్న కేకలు విని అందరూ స్తబ్దులైపోయారు.

ఆకాశం నుంచి ఊడిపడ్డట్టు దిబ్బమీద వెలిసిన అబ్బాయిగారు పంతులు చేతులో ఓ నగపెట్టి, చెవిలో ఏదో గుస గుస లాడి చటుక్కున మాయమైపోయారు.

పంతులు ముఖం చాటంతైంది. "మన ఊరి షావుకారైన శ్రీశ్రీశ్రీ

చిన వీరాస్వామిగారి కుమారులు శ్రీశ్రీశ్రీ అబ్బాయిగారు వధూవరులను ఆశీర్వదించి ఓ సువర్ణమాల" అంటూ ఓ వంటిపేట సన్నని గొలుసు అందరికీ చూపించాడు.

అందరి కళ్ళు అదోలా మెరిశాయి. గొలుసుని వాడికిచ్చి దాని మెడలో వెయ్యమన్నాడు. వాడా పనిచేస్తూ వెళ్ళిపోతున్న అబ్బాయిగారి కోసం అదోలా వెతుకుతున్న దాని కళ్ళని చూశాడు.

ఇంతలో మెలికలు తిరుగుతూ అమ్మలక్కలను తప్పించుకొచ్చిన ఓ పిట పిటలాడే పడుచు, పంతులు చేతిలో ఏదో పెట్టి హొయలొలికిస్తూ, మళ్ళీ మెలికలు తిరుగుతూ వెళ్ళిపోయింది.

పంతులు ముఖం మరోసారి చాటంతైంది. "రాజమండ్రి కాపరస్తులు జంగం పైడమ్మగారు వధూవరులను ఆశీర్వదించి వరుడికి ఓ సువర్ణ అంగుళీయకం" అంటూ ఓ ఉంగరాన్ని దానికిచ్చి వాడికి తొడగమన్నాడు.

అది ఆ పనిచేస్తూ వెళ్ళిపోతున్న ఆ పైడమ్మకోసం అదోలా చూస్తున్న వాడి కళ్ళను చూసింది.

గాపు కేక లాంటి హారను మోతతో ఓ పోలీసు జీపు దిబ్బదగ్గర ఆగింది. హడావిడిగా ఓ కానిస్టేబులు దిగొచ్చాడు. "గోదావరికి పోలవరం కాడ గండిపడింది. కాసేపట్లో ఈ ఊరు మునిగిపోతుంది. అందుకని అందరూ ఏటిగట్టు ఎక్కేయండి. ఇక్కడే వుంటే ప్రాణాలు పోతాయి" అన్న పిడుగులాంటి వార్త వినిపించాడు.

అక్కడున్న వాళ్ళ గుండెలు గుభేలు మన్నాయి.

కానిస్టేబులు దిబ్బ దిగుతూ ఆ జంట కేసి చూసి "ఒరి నువ్వట్రా? అప్పుడే బయటికి వదిలేశారా నిన్ను?" అని వాణ్ణి పలకరించి చటుక్కున జీపు ఎక్కేశాడు.

"ఇంకా సూత్తా తూకున్నారేటి, పోలవరం కాడ గండిపడితే నీరు సాల్లో మనూరు కొట్టుకుపోద్ది. కొంపలోవున్న సామాను సర్దేసి జేగి ఏటిగట్టు కెక్కేయండె హెస్" అన్నాడు ఓ పెద్దయ్య.

"అసలే పున్నమి పోటు. వరద ఓ పట్టున లాగదు, సేతికందిన తిండి గింజలు, కూడొండుకోటానికి గిన్నెలు పట్టుకుపోండి. తక్కిన సామాను సంగతి దేవుడెరుగు" అని గట్టిగా అరిచాడు ఓ చిన్నయ్య.

"గొడ్లని, మేకల్ని కట్లొదిలేయండి, లేకపోతే అవి మునిగి సచ్చిపోగలవు" అని హెచ్చరించాడు ఓ బుల్లయ్య.

"గాడిపొయ్యి మీద గుండిగల్ని మూంపు సాయంపట్టి గట్టెక్కించేయండి. మళ్ళీ కూడెప్పుడు దొరుకుద్దో సెప్పలేం" అన్నాడు ఓ చిట్టయ్య.

క్షణంలో గగ్గోలు, గందరగోళం, కేకలు, గోలలు, అరుపులు, ఏడుపులు, పెడబొబ్బలు, కంగారు, చెల్లాచెదరు, పరుగు.

"బాబోయ్ పిల్లల్ని బళ్ళో పెట్టి తాళం వేశా" అంటూ పరిగెట్టాడు పంతులు.

"చంటిపిల్లల్ని ఉయ్యాలలో వదిలేసి వచ్చేశాం" అని గొల్లుమన్నారు బాలంతలు.

కనపడని పిల్లల కోసం కేకలేస్తూ వెతుకుతున్నారు తల్లులు.

కనపడ్డ పిల్లల్ని చితకబాది ఏటిగట్టుకేసి తరుముతున్నారు తండ్రులు.

రాముడోళ్ళు కాళ్ళ కష్టం పడగా వాటిని భుజంమీద పెట్టుకుని పారిపోయారు బాజావాళ్ళు.

గుండిగలు దింపి గట్టుకు చేరేస్తున్నారు వంటవాళ్ళు.

చిటికలో షామియానా ముడిచి మోసుకుపోయాడు అద్దెకిచ్చిన వాడు-అద్దెమాట దేవుడెరుగును అనుకుంటూ.

బ్రతుకుజీవుడా అంటూ పరిగెత్తుకు పోయారు పెళ్ళివారు.

పెట్టేబేడా సర్ది గుడిసెల్లో సామాన్లు మూటకడుతున్నారు కొందరు.

తిండి గింజల్ని, వంటసామానుల్ని మాత్రం పట్టుకు పారిపోతున్నారు మరి కొందరు.

తాకట్టుకి పనికివచ్చే వస్తువుల్ని మాత్రం పట్టుకుపోతున్నారు ఇంకొందరు.

మళ్ళీ గుడిసె లేసుకోవడానికి పనికివస్తాయని తలుపుల్ని, ద్వార బంధాలని ఊడబీకి మోసుకుపోతున్నారు కొందరు.

అలాగే తడికల్ని, తాటాకుల్ని చేరవేస్తున్నారు మరికొందరు.

ఎగిరిపోతున్న కోడిపెట్టల్ని పట్టుకోవడానికి తిప్పలు పడుతున్నారు కొందరు.

పందుల దొడ్డికి కంచె లాగేసి వాటిని తరిమేస్తున్నారు ఇంకొందరు.

గొడ్లని, మేకల్ని లాక్కుపోతున్నారు కొందరు.

ఎక్కడ చూసినా ఏటిగట్టుకేసి పరుగులు పరుగులు పరుగులు.

అలా నిమిషాల మీద గ్రామం యావత్తు గట్టెక్కేసింది.

దాంతో అంతవరకూ కళ కళ్ళాడుతున్న ఆ వూరు అమాంతం వెల వెల బోయింది.

ఇవ్వన్నీ గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయారు అది-వాడు.

ఎన్నాళ్ళగానో ఎదురు చూసిన పెళ్ళి ఘడియలు ఎట్టకేలకు రాగా, అవి ఇంత దారుణంగా వుంటాయని ఊహించుకోలేదు ఆ జంట. కళ్ళ

ఎ ఃరుగా జరిగిపోతున్న వాటిని చూసి కూడా నమ్మలేక కొయ్యబొమ్మల్లా వుండిపోయారు అధి-వాసు.

*   *   *

దూరంగా హోరు వినబడింది.

గట్టుమీద జనం పొలికేకలు, అరుపులు ఎక్కువయ్యాయి.

కుక్కలు మొరుగుతున్నాయి.

చుట్టూవున్న కంచెలు, కంపలు దడ దడ లాడాయి.

గూళ్ళలో వదిలేసిన కోళ్ళరెక్కల టపటపలు, కిచకిచలు వినపడ్డాయి.

గాడి పొయ్యి చెమ్మగిల్లి పొగలతో ఆరిపోయింది.

చూస్తూ వుండగా ఆ దిబ్బ చుట్టూ వున్న నేలకూడా చెమ్మగిల్లింది.

తడినేల మీద నురగలతో నీరు చుట్టూ పాకుతూ కనిపించింది.

అలా చోటు చేసుకున్న చిక్కని నీరుని స్థిమితంగా వుండనీయకుండా వెనకాలే ఒక కెరటం వచ్చింది.

ఆ కెరటంతో పాటే ప్రవాహం.

ఆ ప్రవాహం విజృంభించింది.

సుళ్ళు తిరుగుతూ అక్కడ వున్న గుడిసెలని చుట్టు ముట్టింది.

మట్టిగోడలు నాని ఒరిగి పోయాయి.

కుప్పలు కుప్పలుగా కూలిపోయాయి.

ద్వారబంధాలు మెలితిరిగి పోయాయి.

నారతో బిగించిన తడికెలు, తాటాకులు కట్లు విడి ప్రవాహాన్ని కప్పేశాయి.

కగ్ర కలవ, పుల్ల పుడక, ఆకు అలము, చెత్త చెదారాలు కరిగి ద్రవ రూపంలో ప్రవహిస్తున్నట్లనిపించింది.

పాటిదిబ్బ తడిసి పొంగింది. మట్టి వాసన వేసింది. క్షణంలో దిబ్బ పై భాగం చిమిర్చింది.

అది తన పాదాలను చూసుకుంది. పారాణి కరిగి నీళ్ళలో కొట్టుకు పోతోంది. పాదాలు దిబ్బలోకి మెల్లిగా దిగిపోతున్నాయి

వాడికేసి చూసింది.

వాడు కొయ్యబారిపోయి చూస్తున్నాడు.

"నీ కీతొచ్చా" అడిగింది.



వచ్చును కాని ఆ జలప్రళయాన్ని చూసి రాదన్నట్టు తల ఊపాడు.

"మనందరితో పాటు లగెత్తక ఈడే వుండిపోయావేం"?

"నీకోసం" అందామని నీళ్ళు నములుతూ వెర్రిమోహం పెట్టాడు.

"అలా బెల్లం కొట్టిన రాయిలా గుంటావేం. కదులు" అంది-ఎటు వెళ్ళాలా అని ఇటూ అటూ చూస్తూ.

ఓ పక్క జనంతో కిక్కిరిసిన గోదావరి గట్టు దూరంగా కనపడింది.

మరో పక్క పొలాల మధ్య షావుకారిగారి ఎడ్ల సావిడి, దాని చుట్టూవున్న ఎత్తయిన ప్రహరీ కాస్త దగ్గరిగా కనపడ్డాయి.

గట్టుకేసి పోదామన్నాడు వాడు.

"ఆడ బంటా గోతులుంటాయి. రెండు నిలువులుంటుంది. అయినా ఎమరీదలేం. ఇటే పోదాం".

కుచ్చిళ్ళు వదులు చేసి, చీరని పైకి లాగి కట్టి, కొంగుబిగించి దిబ్బ దిగింది.

ఛాతీ మునిగి కాళ్ళు తేలిపోసాగాయి.

ఊడిపోతున్న తలపాగా అరచేతుల్తో కాస్తూ దిక్కులు చూస్తున్నాడు వాడు.

'బేగిరా' అని అరిచింది.

తలపాగా నడుముకు బిగించి, పాదాలతో దిబ్బను తడుముతూ, నీటిలోనికి దిగి దాని జబ్బట్టుకు నిలబడ్డాడు వాడు.

పాటి దిబ్బ అడ్డుగా వుండడంతో, దిబ్బ వెనుక ప్రవాహం జోరు కాస్త మందంగా వుంది.

పక్కనే నీటిలో డింకీలు కొడుతున్న అరివేణి కుండలలో పెద్ద కుండల్ని రెండందుకుంది. ఒకటి వాడి కిచ్చింది.

"సూడు, ఈ కుండనిలా ఓ సేత్తో పట్టుకుని, మరో సేత్తో నీటినిలా తోస్తూ కాళ్ళు కొడితే తేలి ముందుకు పోతాం. ఓసారి సెయ్యి సూద్దాం."

అలాగే చేశాడు. కాళ్ళు కొట్టుకుంటూ కాసేపు నీళ్ళల్లో తేలాడు.

"ఈతొచ్చన్న మాట నీకు."

"కాని దమ్ము పట్టలేను." అంటూ మొలకున్న పాగా గుడ్డను తీసి, రెండు కుండలకి చివరలు కట్టాడు.

"ఇద్దరం కలిసే ఈదాం." అంటూ నాలుగడుగులు ముందుకేసి ప్రవాహంలో పడ్డాడు.

కాళ్ళు తేలిపోయాయి. శరీరం దానంతటదే కొట్టుకు పోసాగింది.

వాడి వెనకే అదీ కొట్టుకు పోసాగింది.

"తల నీటిలో ముంచకు" అని అరిచింది.

కాలికి తుప్పలు, రుప్పలు తగులుతున్నాయి. చేతులు కంచెలు, కమ్మలకు గీసుకుపోతున్నాయి. ఈత వాళ్ళ అదుపులో లేదు.

ప్రవాహంలో ఎటు కొట్టుకు పోతున్నారో వాళ్ళకే తెలియదు.

ఆగుదామంటే కాళ్ళు నిలబడవు.

వాడికి దమ్ముపోయి సోష వచ్చేలా వుంది. ఇంతలో కుండల మధ్య కట్టిన కండువాకి ఒక తాటి చెట్టు అడ్డం వచ్చింది.

అమాంతం ఇద్దరూ మెలి తిరిగి ఉక్కిరి బిక్కిరై, ప్రవాహానికి ఎదురు తిరిగారు.

కండువా తాడిచెట్టుకు లుంగ చుట్టుకు పోయింది.

కుండలు ఢీకొట్టి పగిలి పోయాయి.

కండువా చివర్లు పట్టుకుని ప్రవాహాని కెదురుగా తేలసాగారు.

కాని ప్రవాహం వాళ్ళని వెనక్కి లాగేస్తోంది.

శక్తిని కూడ గట్టుకుని, కండువాని లాగుతూ తాడి చెట్టుని వాటేసుకున్నాడు వాడు.

కండువాని అలాగే పట్టుకుని వాడి పక్కనే తేలివుంది అది.

ఇద్దరూ కాసేపటికి తేరుకున్నారు.

లాగేస్తున్న శరీరం మణుగులు కొద్దీ బరువెక్కసాగింది.

దాని చేతులు పీకాయి.

అతి కష్టం మీద వెనక్కి తిరిగి చూసింది. షావుకారిగారి దూడల పావిడి ఇంకా ఎంతో దూరం లేదు.

"ఇదిగో సూడు, నా సేతులు ఇరిగి పోయేలాగున్నాయి. నువ్వె సెట్టెక్కి కూకో. నేనెట్టాగో ఆ సావిడికాడ కీదేత్తాను." అంటూ చటుక్కున చేతులు వదిలేసింది.

త్రుటిలో శరీరం చక్రంలా తిరిగిపోయింది. అవయవాలు పట్టు తప్పాయి. వదులైన చీర కాళ్ళకడ్డం పడింది. వాల్తిపోతున్న శరీరానికి బార చాపిన చేతులు అడ్డు తగులుతున్నాయి. దాంతో సుడులు తిరుగుతూ బంతిలా మునుగుతూ తేలుతూ కొట్టుకుపోసాగింది అది.

ఉన్న కొద్ది స్పృహలో మనసుకి బాహ్య ప్రపంచంతో సంబంధం తెగిపోయింది. ఆ క్షణంలో చావడం అంటే ఎలా వుంటుందో అన్నసంగతి మాత్రం గ్రహించగలిగింది. ప్రాణాలెలా పోతాయో స్వయంగా అనుభవించింది. ఆ అనుభవానికి నేపథ్యంగా "గోదారి తల్లీ కాపాడు" అంది మనసులోని మనసు— అంతరాత్మ.

వాడు బరబర నాలుగు బారల తాడి చెట్టెక్కేసి కొట్టుకుపోతున్న దాన్ని చూస్తూ వుండిపోయాడు.

దాని శరీరం ప్రవాహంతో పాటే ప్రహరీని గుద్దుకుని గోడ వారే సాగుతూ పోయి మూసిన ఇనుప ఊచల గేటుకు అంటుకుపోయింది.

ఎత్తు నుంచి చూస్తున్న వాడికి బుడగలా ఉబ్బిన బట్టలు, తేలిపోతున్న నల్లని జుట్టు మినహా దానిలో ఎలాంటి చలనం కనబడలేదు.

కళ్ళెదురుగా ఒక వ్యక్తి ప్రాణాలు పోతుండగా చూడడం వాడికిదే మొదటిసారి.

కళ్ళు గట్టిగా మూసుకుని, చెట్టుని బలంగా వాటేసుకుని బిగుసుకు పోయాడు.

తనకు పెళ్ళయిందనీ, ఆ కొట్టుకు పోయింది తన పెళ్ళామనీ గుర్తుకు వచ్చింది.

చంటిపిల్లాడికి బొమ్మ ఇచ్చినట్టే ఇచ్చి తిరిగి లాగేసుకుంటే ఏడ్చినట్టుగా గుక్కపెట్టి ఏడవసాగాడు.

అలా కొంత సేపేడ్చి ఓదార్చేవాడు లేక వాడిని వాడే ఓదార్చుకున్నాడు.

అది అప్పటికే ఆమడ దూరం కొట్టుకుపోయుంటుందని తెలిసి కూడా కడసారి చూపుల కోసం ప్రహరీ గట్టుకేసి మరొక్కసారి చూసి, చూస్తున్న దృశ్యం నమ్మలేక పోయాడు.

ఆకాశం దద్దరిల్లేలా ఓ పచ్చి అరుపు అరిచాడు. అది విజయ గర్వంతో ఎవడో రాక్షసుడు అరిచినట్టుంది.

గేటు కంటుకుపోయిన దానిలో చలనం కనిపించింది. అది గేటు మీదకు మెల్లిగా ఎగబాకి, గోడ చేరి దానిమీద వాలిపోయింది.

కొన్ని వేల మణుగుల బరువు దిగినట్టు నిట్టూర్చాడు. శరీరం దూదిలా తేలికై పోయింది. అనుకున్న ఆపత్తు తప్పిపోవడంతో లేని శక్తి తిరిగి వాడిలో ప్రవేశించింది.

"ఇదిగో సూడు నువ్వాడే వుండు. నే నాడికే వత్తా, ఆ పెంకుల సావిడెక్కిద్దారి" ఉత్సాహంతో ఉక్కిరి బిక్కిరై అరిచాడు.

వాడి అరుపు విని భారంగా తలెత్తి చూసింది.

వాడు ఒక చెయ్యి ఊపుతూ ఏదో అరుస్తున్నాడు.

కాని వినపడక సంగతేమిటో అర్థం కాలేదు దానికి.

ఏమిటి అని అడగటానికి ఇంకా శ్వాస పూర్తిగా అందటం లేదు.

వాడు ఒక బార కిందకి దిగాడు.

అది మెల్లిగా చీర సర్దుకుని గోడ మీద చతికిల బడింది.

వాడు మరో బార కిందికిదిగి మళ్ళీ అరిచాడు.

వాడేం చెయ్యబోతున్నాడో ఊహించగలిగింది. వెంటనే వద్దన్నట్టు చెయ్యి ఊపింది.

వాడు మరో బార కిందకి దిగాడు.

"సత్తావురా సచ్చినాడా" గట్టిగా అరిచింది.

వాడికది వినపడలేదు.

గేటుకు అవతల వైపు గోడ భాగం పొంగుతున్న వరద తాకిడికి ధబేలుమనిపడి పెద్ద కెరటం లేచింది.

అదిరిపడి బరబరా దేకుతూ ప్రవాహానికి వాలుగావున్న గోడను చేరింది.

ఎప్పుడు దూకి ఎలా వచ్చాడో వాలుగోడ మలుపులో గోడెక్కుతున్నాడు వాడు.

వాణ్ణి చూసి తెల్లబోయింది.

వాడు గోడమీద పాకుతూ దానిని చేరాడు. ఈలోగా ప్రవాహానికి అడ్డంగా వున్న గోడ పూర్తిగా తెగిపోయింది.

అమాంతం వాడిని వాటేసుకుంది.

ప్రహరీ ఆవరణలో ప్రవాహం అల్లకల్లోలంగా వుంది.

విశాలమైన ఆ ఆవరణ మధ్య ఎత్తైన బంగళా పెంకుల సావిడి

చూరు దాకా మునిగివుంది. సావిడి వారే ఒక పెద్ద గడ్డిమేటు వుంది. అది తేలి సావిడిచూర్లో ఇరుక్కుపోయింది. కాని ఆ గడ్డి మేటు ప్రహారీకి చాలా దూరంగా వుంది.

"తాడిసెట్టెక్కి ఆయిగా కూకోక ఇలా ఎందుకు తెగించావు" అంది వాడి బంధాల్లోంచి తప్పించుకుంటూ.

"నిన్నొగ్గేసి నాకుండ బుద్దేయలేదు. సత్తే ఇద్దరం కలిసే సద్దారని పించింది." మళ్ళీ బంధాలు బిగించాడు.

దానికి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఇద్దరూ అదిరి పడ్డారు.

ప్రవాహానికడ్డుగా వున్న సావిడి వెనకున్న ప్రహారీగోడ కూడా దభీమని విరిగి పడింది.

ఇపుడు ప్రవాహం తిన్నగా సావిట్లోకే జొరబడింది. సావిట్లో తేలు తున్న తట్ట బుట్టా, చాప చట్రా, చిట్టు తౌడు వగైరాలు బయటపడి, వడిలో కొట్టుకు పోతున్నాయి.

గడ్డిమేటు చేరగలిగితే దానిమీంచి సావిడి పైకప్పు సులువుగా ఎక్కవచ్చు. నీటిమట్టం ఎంత పెరిగినా అంత ప్రాణభయం వుండదు. కాని గడ్డిమేటు చేరడం ఎలా మధ్యలో ఉధృతమైన ప్రవాహం ఉన్నపుడు.

ఏదైనా వెదురు బొంగు దొరికితే బాగుండును. దొంకిన కట్టి గడ్డి మేటని గోడవేపుకు లాక్కోవచ్చు అనుకుంది.

ఆకాశంలో పెద్ద రొద చేస్తూ ఒక హెలికాప్టరు పోతూ వుంది. అంత ఇదిలోనూ వాడి ఒళ్ళు పులకరించి, కళ్ళు మెరిశాయి. "ఎన్ టీ వోడు" అన్నాడు దానికేసి చూస్తూ వాడు దానిలో ముఖ్యమంత్రిగారు లేకపోయినా.

నీళ్ళలోకి ఒరిగి కొట్టుకుపోతున్న ఒక వెదురుగెడను ఒడుపుగా అందుకో గలిగింది అది.

మరో చిన్న కర్రపుల్ల నందుకున్నాడు వాడు.

గెడ చివర చీల్చి పుడక నడ్డంగా గుచ్చి చీరంచు చించి దొంకిన తయారు చేసింది అది.

దొంకినీకి దూరంగా వున్న గడ్డిమేటులో గుచ్చాడు వాడు.

ఇద్దరూ కలిసి గెడను లాగారు.

సగం చూరులో కూరుకుపోయిన గడ్డి మేటు ఊగుతూ వుండి పోయింది కాని ముందుకు జరగలేదు.

బలంగా లాగారు. దొంకిని ఊడిపోయి గెడ బయటకు వచ్చేసింది.

లాభంలేదని చూస్తూ ఉండి పోయారు.

నీటి మట్టం బాగా పెరిగిపోయింది. ఎత్తయిన ప్రహరీ మీద కెరటాలు పాకుతున్నాయి.

వానలు కురిసి వెలిశాకే గోదావరి పొంగుతుంది. గోదావరి పోట్లో వుండగా ఎండ కాయడం ఎన్నో ఏళ్ళగా రివాజు. ఆకాశం తెల్లగా వుంది. సూర్యుడు నెత్తిమీదున్నాడు. ఆ మండుటెండలో ఎర్రని కెరటాలు జిగేలు జిగేలుమని మెరుస్తున్నాయి.

గుండె దద్దరిల్లేలా పెళపెళ శబ్దం.

పోలవరం ఫారెస్టు డిపోలోంచి తేలి కొట్టుకొచ్చిన మద్ది దుంగలు లాటుగా వచ్చి ఆ సావిడిని ముట్టడించి ఢీ కొట్టాయి. బ్రహ్మాండమైన ఆ సావిడి కుప్పగా కూలిపోయింది. అగ్నిపర్వతం బ్రద్దలయ్యేటట్టు నీరు చుట్టూ పువ్వులా లేచింది.

చుట్టూ మిగిలున్న ప్రహరీలు అదిరిపోయాయి. చూరులో ఇరు

క్కున్న గడ్డిమేటు విడిపడి ప్రవాహ వేగానికి గోడకు ఢీకొంది. ఇవన్నీ రెప్పపాటులో జరిగిపోయాయి.

పట్టుకో పట్టుకో అంటూ గడ్డి వాము పురిని గట్టిగా పట్టుకుంది అది.

గుప్పెడు పరకలు పట్టుకుని వాడు మేటెక్కి కెవ్వున కేకెట్టాడు.

పురి పట్టుకుని తానూ ఎక్కింది గడ్డిమేటు.

కూసం విడిచిన నల్ల త్రాచు పడగిప్పి బారెడు పొడుగును ఉంగ చుట్టుకుని వుంది. దానికెదురుగా వాడు గజగజలాడుతున్నాడు. "కదలకుండా కూకో అదేం సెయ్యదులే" అంటూ మెల్లిగా వాడి పక్కన చేరింది. పాము అటు వాడిని, ఇటు దీన్ని పడగ అటూ ఇటూ తిప్పుతూ చూస్తోంది.

గడ్డివాము కూలిన సావిడి, ప్రహరీ గోడల మధ్య ఊగిపోసాగింది. ఆ వూపుకి భయపడి బుస్సుమని గడ్డిమేటుని కాటేస్తోంది ఆ పాము.

పొడుగాటి గడ్డి పరకను పడగకేసి చూపుతూ హుష్ హుష్ అంది అది.

పడగని వెనక్కి చాచి చుట్టని వదులుచేసి కాస్త కాస్త వెనక్కి తగ్గసాగింది పాము.

చేతిలో పరకను ఉండగా చుట్టి పడగకేసి విసిరింది అది.

దానికి బెదిరి పడగను ముడిచి వెనక్కు సాగి నీళ్ళలోకి దిగి పోయింది పాము.

దాని ధైర్యానికి నిర్ఘాంతపోయి చూస్తున్నాడు వాడు.

తామింత వరకు కూర్చున్న ప్రహరీ గోడ కూడా దభేలున కూలి పెద్ద కెరటాన్ని లేపింది. దాని తాకిడికి గడ్డిమేటు తెరిపిన పడి ప్రవాహం లోకి మెల్లి మెల్లిగా కొట్టుకుపోసాగింది.

హమ్మయ్య అనుకుని అలిసిపోయిన ఆ ఇద్దరూ ఆ విశాలమైన గడ్డిమేటు మీద చెరో ప్రక్క కాళ్ళూ చేతులూ బార చాపి వెల్లకిలా పడు కుని కళ్ళుమూసుకున్నారు.

గడ్డివాము రెండొంతులు తేలి మూడో వంతు మునిగి వుంది. దిబ్బల్నీ, గుండాల్నీ దాటుతూ చుక్కాని లేని తెప్పలా గిరగిరా తిరు గుతూ ఊగుతూ సాగిపోతోంది.

వాడు చొక్కాని, బనీనుని విప్పేసి, పిండి ఆరబెట్టుకుంటున్నాడు.

దాని బట్టలు జేగురు రంగులోకి దిగి శరీరాన్నంటుకుని ఆరి అట్ట కట్టుకుపోతున్నాయి.

నీటి గల గలలు తప్ప అంతా నిశ్శబ్దం.

ఉన్నట్టుండి వాడు దానిపై బడి దాన్ని పూర్తిగా వాడి శరీరంతో కప్పేశాడు.

మగతలో ఉన్న అది బిత్తరపోయి కెవ్వుమంది.

గడ్డివాము దేనికో గుద్దుకుని గిరగిరా తిరగసాగింది. ఏవో కొమ్మలు, రెమ్మలు పైనున్న పరకలని ఒలిచేస్తున్నాయని తెలుసుకుంది అది.

తిరిగి కాసేపటికి ఆ మేటు నడక సాగించటంతో వాడు లేచాడు.

వాడి వీపుమీద తుమ్మ ముళ్ళు గీరేసిన రక్తం చారలు కనపడ్డాయి.

సంగతి అర్థమైంది దానికి. అప్పుడు తెలిసొచ్చింది- తన బాగోగులు చూసుకోడానికి ఒక తాళి కట్టిన మొగుడున్నాడని, వాడిలాగే తన కోసం ప్రాణాలైనా లెక్క చెయ్యడని.

చీర కొంగు నీళ్ళల్లో ముంచి గాయాల్ని కడిగింది.

కండలు తిరిగిన వాడి శరీరం నేరేడుపండులా నిగనిగలాడుతోంది.

వాడి కళ్ళల్లోకి సూటిగా చూసింది.

అవి చిలిపిగా అమాయకంగా కనపడ్డాయి.

రెండు చేతులూ సాచింది.

వాటిలో ఇమిడి పోయి కరిగిపోయింది వాడి విశాలమైన ఛాతీ.

ఇద్దరూ గడ్డి మేటులో కూరుకుపోయారు.

* * *

కనీవినీ ఎరగని వరదొచ్చింది గోదారికి. దానికి సాయం పౌర్ణమి పోటుకి సముద్రం పొంగి వరదని నిలకట్టేసింది. కొత్త నీరు, పాత నీరు ఏకమై నదిలో నీటిమట్టం క్షణం క్షణం పెరగసాగింది. దాంతో ప్రవాహం గట్లు దాటేసింది.

ఇన్నాళ్ళూ గట్ల నడుమ శాంతంగా సాగే గోదావరికీ, ఇప్పుడు ఉధృతంగా పారే గోదావరికీ అసలు పోలికే లేదు. ఎగువ నున్న పోల వరం లగాయితు దిగువనున్న విజ్జేశ్వరందాకా గట్లు పొర్లి పారడంతో ఆ నది హద్దులు మీరి సర్వవ్యాప్తంగా, విచ్చలవిడిగా ఉరకలేయసాగింది.

"పెళ్ళైన రేతిరి మొదటి రేతిరి సేసుకుంటారందరూ. మనం పగలే మొదటి రేతిరి సేసుకున్నాం" అన్నాడు వాడు-గడ్డి పరకలని దులుపు కుంటూ.

"పాడు బుద్ధులు" అంటూ చీర కుచ్చిళ్ళు సద్దుకుని ఓరగా వాడికేసి చూసింది.

వాడనుకున్నంత అమాయకుడు కాడనిపించింది దానికి.

"నేనోటడగనా" అడిగింది అది.

"ఏటో అడుగు".

"అదే ఆ పోలీసోడి సంగతి." నిన్ను సూసి బయటికెప్పు డొచ్చావురా? అని అడిగాడు ఆ జవాను. అంటే నిన్నెప్పుడో లోన్కి తోశారన్నమాట."

"సే! సీ! వాడెవరో నాకు తెల్దు. వాడెవడని సూసి ఎవడను కున్నాడో" అంటూ మొహం చాటేసుకున్నాడు.

బుకాయిస్తున్నాడని అర్థమైంది దానికి. వాడంత సులువుగా బయట పడడని కనిపెట్టేసింది.

"పోనీ ఆ సంగతొగ్గేయి. ఆ పైడమ్మ నీకు సుట్టం కాదు కదా. మరి నీతో ఎందుకు సనువుగా వుంది. నీకూ, దానికీ ఏటో ఇది లేకపోతే నీకా ఉంగరం బహుమతి ఎందుకిచ్చింది?" మరో ప్రశ్న తాపీగా వేసింది.

"అలా అయితే ఆ సావుకారి గారబ్బాయి నీకు సుట్టమనే బంగారు గొలుసిచ్చాడా? ఆడికి, నీకు ఏవో ఇది నేకపోతే" ఎదురు ప్రశ్న వేశాడు. మనసులో పీకుతున్న దానిని కక్కుకుంటూ.

"నేనలాంటిలాంటి దాన్ని కాను. షావుకారిగారి కాడ మా అయ్య పాలేరు పనిచేసేవాడు. ఆడు పోయాక మాయమ్మ ఆరికాడే ఆ పనీ ఈ పనీ సేత్తోంది. ఆరే మాకన్నీ సూత్తున్నారు. మనేటనుకున్నావో, ఈ గొలుసే కాదు, ఈ పెళ్ళి కరుసులు కూడా ఆరే ఇస్తారు"—అంది ఏడుపు గొంతుకతో కళ్ళొత్తుకుంటూ.

గొప్పోడైతే డబ్బిస్తాడుగాని గొలుసిస్తాడా?

ఇందులో ఏదో తిరకాసుండి తీరాలి అని వాడికి అనిపించినా ఇప్పుడా సంగతెందుకని దాని నేడపద్దని ఊరడించాడు.

*　　*　　*

ప్రవాహాని కడ్డంగా తాడి కట్టప ఎదురైంది. ఆ కట్టపలో వరస

తాళ్ళు దగ్గరి దగ్గరిగా వున్నాయి. గడ్డిమేటు వాటికి తగులుకుని ఆగి పోయింది.

అలా గడ్డివాము ఆగగానే వరద తగ్గేదాకా అక్కడే అలాగే వుండి పోవచ్చని అనుకున్నారు.

వాడికి దాహం వేసింది. ఆ చిక్కని బురద నీటిని తాగాలనిపించ లేదు.

దానికీ దాహం వేసింది. కొంగు తడిసి నాలుగు చుక్కలు నాలుక మీద పిండుకుంది.

గడ్డివాము ప్రవాహానికి ఒక అడ్డకట్టలా నిలిచింది.

కాని ప్రవాహం వత్తిడికి తట్టుకోలేక, వదులైపోతూ చుట్టూ పరకలుగా కొట్టుకుపోసాగింది.

కాసేపు అలాగే వుంటే మోపంతా చెదిరి పరకలుగా కొట్టుకుపోయే ప్రమాదం వుందని గ్రహించారు అది- వాడు.

ఎలాగైనా గడ్డివామును తాడి కట్టవ నుంచి తప్పించాలని వాడి కాళ్ళని తాడిచెట్టుకు తన్నిపెట్టి గడ్డివామును ప్రవాహానికి ఎదురుగా నెట్ట సాగాడు. వాడికి అది కూడా తోడైంది. పెడల్పులో మేటు కొంతభాగం విడిపోయినా, మిగతా భాగం కొస్త ఎడంగా జరిగింది. మరి కొస్త నెట్టారు. మరి కొస్త జరిగింది. అలా జబ్బసత్తువ కొద్దీ నెట్టగా నెట్టగా గడ్డివాము చిక్కి సగమై తాడికట్టవ దాటి ప్రవాహంలో పడింది. హమ్మయ్యా అను కున్నారు.

అప్పటికే సూర్యుడు పడమటికి పూర్తిగా వాలిపోయాడు. ఏ క్షణంలో నైనా చీకటి పడచ్చు.

ఆ ఇద్దరి బరువుకి గడ్డివాము తెగ ఊగిపోసాగింది. ఆ ఊపుతో

పాటే వేగం కూడా బాగా పెరిగింది. అలా వేగంగా పోతున్న మేటు నుంచీ గడ్డిపరకలు మరింత వేగంగా విడిపోసాగాయి.

"పరకలిడిపోతే ఆకరికి సెరో గుప్పెడు కూడా మిగలవు. సీకటి పడకుండా పై పరకలు పేనేసి సుట్టూ కట్టి మేటు బిగించేద్దారి" సలహా ఇచ్చింది అది.

"పరకలు పేనుతూ కూకుంటే సీకటిపడిపోద్ది. వుండు సెబుతా" అంటూ వాడె చొక్కాని గోచి పెట్టేసి పంచె విప్పి దానిని నిలువుగా చీరి పుళ్ళ పేశాడు. అదీ వాడు కలిసె దానిని తాడులా పేనారు. దానిని మేటుకి చుట్టి బిగించేసరికి తల ప్రాణం తోక కొచ్చింద్ది వాళ్ళకి.

మేటు బిగిసి నిలువుగా ఒక మోపులా తయారై పక్కకు వాలి దొర్లసాగింది. వాళ్ళు మూలుగుతూ, తేలుతూ దాన్ని వాటేసుకుని నిల దొక్కుకున్నారు.

మేటు చివర నుండి ఇంకా పరకలు విడిపోసాగాయి.

అది తన చీరను కూడా ఒలిచి వాడికిచ్చింది. దాన్ని కూడా ఒక తాడులా పేని అడ్డానికి బిగువు నిచ్చేలా మేటుకి చుట్టి బలంగా ముడేశాడు.

దానితో ఆ మేటు నలుపలక మోపులా తయారైంది.

పొద్దుకుంకి వెన్నెల కురవడం మొదలెట్టింది.

ఇద్దరూ మోపు మీద వాలిపడి వున్నారు.

నీటి మట్టం పెరుగుతూ పోతూ వుంది. వరద ఇంతలో తగ్గేలా లేదు.

దూరంగా తాటి కట్టపలు ఒకదాని వెనక ఒకటి వరసగా భూతాల్లా కనబడ్డాయి.

ఇద్దరికీ అంత చలిలోనూ చమటపట్టి వణుకూ, దడ వేసింది.

ఇన్ని తాడితోపులు ఈ గడ్డిమేటు దాటాలంటే చివరికి చెరో పరక కూడా మిగలదు. ఇపుడేం చెయ్యాలో అర్థం కాలేదు.

ఆ వరుస తాడితోపే చిడిపి గ్రామం.

"గోదావరికి వరదొస్తే చిడిపి కాడ గండి కొట్టమన్నాడు కాటన్ దొర."

"ఆడెవరు"

"ఆడో దొర. ఆడే ఈ గోదారి తవ్వించాడట. మాయమ్మ సెప్పింది."

"మన సావుకి కాకపోతే ఎవరు తవ్వించమన్నారాడ్ని" విసుక్కున్నాడు వాడు.

"మన మిట్టాగే కూకుంటే తాడితోపులో ఇరుక్కుంటాం. ఈ మోపు పట్టుకుని అడ్డం ఈదేద్దారి. కూసింత దూరంలో గోదారి గట్టు తగుల్తాది మనకి" సలహా ఇచ్చింది అది.

అదే రైటనిపించింది వాడికి.

సై అంటే సై అని మోపు పట్టుకుని ఇద్దరూ గుడ్డిగా వడి కడ్డంగా ఈదసాగారు.

ఆ మోపు పట్టుకుని అలా ఈదుతుంటే వడికి అది అయిమూలగా ముందుకు జరగసాగింది.

"ఆగకు, ఇలాగే ఈదుకుంటూ పోతే గట్టు సేరుకుపోతాం" అరిచింది.

"పట్టు వదలమాకు, మోపు ఎనక్కెళ్ళిపోతాది" అరిచాడు.

అలా వాడూ, అది జబ్బలు పులిసేలా ఈది, ఈది, ఈది అలిసి పోయి సోషవచ్చి మోపెక్కి వాలిపోయాడు.

గడ్డిమోపు వెనక్కి వెళ్ళక ముందుకి మరింత వేగంతో కొట్టుకుపో సాగింది. ఆ మోపు అలా కొట్టుకుపోతుంటే దాని కాశ్చర్యంవేసి తలెత్తి చూసింది. ఎదురుగా తాడికట్టవలు లేవు నీరు, ఆకాశం తప్ప.

అంటే వాళ్ళు నీటి గట్టు కూడా దాటి అసలు గోదాట్లోకి పడిపోయా రన్నమాట.

ఎటుచూసినా ఎర్రని నీరు. నీటి మీద నురగలు. అక్కడక్కడ కొట్టుకుపోతున్న ఏవో నల్లని శాస్త్రీలు.

గడ్డిమోపు నీటిలో నాని సగానికిపైగా మునిగిపోయింది.

దరి చేరేలోగా పూర్తిగా మునిగిపోవచ్చని వాళ్ళకి తెలుసు. కాని వాళ్ళ కొకళ్ళ కొకళ్ళు తోడుండడంతో చావడానికి కూడా భయమేయడం లేదు. పోతే ఇద్దరం కలిసి కట్టుగా పోతామన్న ధైర్యంతో వున్నారు.

బతికున్న నాలుగు క్షణాలు హాయిగా వుందామనిపించింది.

పత్తిగిల్లి వాడికేసి తిరిగింది. వాడు కాళ్ళు చేతులు బారచాపి మోపు మీద పడుకున్నాడు.

వాడి తల నిమిరింది.

వాడు దానికేసి తిరిగాడు.

మసగ వెన్నెల్లో వాణ్ణి చూసింది. మనసులో ఏదో పీకింది.

"ఇదిగో సూడు, ఈ గడ్డిమేటు ఏశెణానైనా మునిగిపోద్ది. మనం గోదాట్లో మునిగి సావడం తప్పదు. సచ్చేముందు నిజం చెప్పు. నా పెని

ఏటి సత్తే ఒబద్ధమాడదని సంబరపడి సచ్చిపోతా" బతిమాలినట్టు అడిగింది.

"ఏటే ఎదవగొడవ"

"అదే ఆ సైడమ్మకి నువ్వంటే ఏటంతిది"

"నీకా సైడమ్మ సెయ్యం పట్టుకున్నాదేంటేహెస్. ఓ మూల సత్తుంటే" అని గించుకుంటూ చిరాకుపడ్డాడు వాడు.



నిశ్శబ్ద వాతావరణాన్ని చించుకుంటూ ఓ తీతువ పిట్ట కూస్తూ పోయింది.

"సూడు కాకరిత్తే సుట్టాలొత్తారంట, తీతువ పిట్ట కూస్తే యంబటు లొత్తారంట. ఆళ్ళొచ్చి మన్నెట్టుకుపోయేలోగా సెప్పెయ్యి" దిగాలుపడుతూ అడిగింది.

వాడికి జాలేసింది. చచ్చేముందు దానికి నిజం చెప్పేయాలనిపించింది.

"సరే సెప్తా విను. సైడమ్మ మొగుడు మునిసిపాలిటి బండి డ్రైవరు. ఆడికి తాగుడలవాటు. రోజూ సారాకి డబ్బులిచ్చి ఆణ్ణి వళ్లో వేసుకుంది మంగమ్మ."

"అదెవరు" అడిగింది చెవులు నిక్కరించి వింటూ.

'అదీ మునిసిపాలిటీయే.' ఊళ్ళో సెత్తంతా ఎత్తి ఆడి బండిలో పోయడం దాని డూటీ. ఆడు దాని ఇదిలో పడిపోయి పైడమ్మ నొగ్గేశాడు.

"కనక ఆ పైడమ్మని నువ్వు తగులుకున్నావన్నమాట."

"సీ, సీ మీ ఆడోళ్ళెప్పుడూ ఇంతే" అంటూ మండిపడి తిరిగి వెల్లకిత్తలా పడుకున్నాడు.

"సేసిన పాపం సెప్పుకుంటే పోద్ది. సరే సెప్పెయి" అంటూ వాణ్ణి మళ్ళీ తనకేసి తిప్పుకుంది.

"నేను పేపరుమిల్లో పని సేత్తున్నా. ఆ మిల్లుకాడున్న పేటలో ఓ గుడిస అద్దెకు తీసుకున్నా. ఆ గుడిసె ఎదురు గుడిసే పైడమ్మ గుడిసె."

"నువ్వు రైలు టేషనులో పనిసేత్తున్నావని చెప్పారు మీ వోళ్ళు."

"అదీ రైటే, గూడ్సు బండిలో బొగ్గు దింపి పేపరుమిల్లు లారీకి ఎగుమతి సేత్తారన్నమాట. పని టేషన్లో, కూలి మిల్లులో."

గడ్డిమోపు కుదుపుకి వాళ్ళ కాళ్ళూ, తలలూ నీళ్ళలో తడుస్తున్నాయి.

"బేగి సెప్పు" అంది చలితో వణుకుతూ.

"బొగ్గు మసితో ఒళ్ళంతా సిరాకెత్తిపోద్ది నాకు కొంప సేరగానే. అందుకే రేతిరిపూట స్తానం సేత్తా. ఓ రోజు సిల్లుకుండలో నీళ్ళు కారిపోనాయి. పైడమ్మ కాడికెళ్ళి నీళ్ళడిగా. సిమ్మెంటు గోలెంలో నీళ్ళున్నాయి. ఈడే పోసుకో అంది."

'నంగనాచి' అనుకుంది.

"నా వీపు రుద్దుతానంటే సరేనన్నా. సబ్బు రాత్తూ ఎంద్రొయ్యిలి పులుసొందా, బేగి బట్టేసుకు రా. రుసి సూద్దుగాని" అంది.

'దాని కైపు మండిపోను' అనుకుంది.

"సరే ఎల్లా· అపెట్టిందల్లా తిన్నా. ఆడే తొంగోమంది. పద్దులే అన్నా. బలవంతం సేసింది."

ఒళ్ళు మండిపోతూ వింటోందది.

"నిన్ను నా సెల్లిల్లా సూసుకుంటున్నా తప్పని సెప్పా. సీపురు కట్టిచ్చుకు సితకబాది మళ్ళీ నా గుడిసె కాడికి రా నీ కాళ్ళిరక్కొడతా అని గెంటేసింది."

దానికి నమ్మకం కుదరలేదు.

"నువ్వ అలాంటి సత్తె అరిచంద్రుడు అంటే నేను నమ్మను" అంది. పిడిగెడుతో వాడి బుగ్గమీద పొడుస్తూ.

వాడు దాన్ని దగ్గరకు లాక్కున్నాడు.

"సే, పో నేను నీ పైడమ్మను కాను" అంటూ వాణ్ణి తోసింది.

"నిజం సెప్పినా నమ్మరు మీ ఆడోళ్ళు"

"సరే, మరి ఆ పోలీసోడు గొడవేటో తొరగా సెప్పు"

"కూలి పెంచమని మేము స్టయికు సేసాం. సేత్తే సేసుకోండే పోస్ అన్నాడు మా మేనేజరు. వారం సేసాకా మాకు సిర్రెత్తుకుపోయింది. మిల్లు గేటుకాడ కాసి ఆణ్ణి సితక్కొట్టి సొక్కా సెద్దీ సింపేసాం. ఆటయంలో ఎవడో పేపరోడు ఫోటో తీసిండట. అందులో వద్దాళ్ళని అరస్టు సేత్తారని తెలిసింది. నాకు వల్లమాలిన భయమేసి నా గుడిసెకాడ తొంగుంటే పోలీసోళ్ళు పట్టుకుపోతారని. బాగా సీకటి పడ్డాక పైడమ్మ గుడిసె కాడ

కెళ్ళా- ఆడ తొంగుంటామని. నేనడిగింవొప్పుకుంటేనే యీడుండు, నేక పోతే పో. అంది. గతిలేక సరే అన్నా."

బరువుగా నిట్టూర్చి అదోలా అయిపోయింది అది. వాడింకా చెప్పుకుపోతున్నాడు.

"నీకు పెళ్ళంట. మీ అయ్యొచ్చి నీకు సెప్పమన్నాడు" అని ఓ రేతిరి సెప్పింది పైడమ్మ.

దాని పేరు వింటుంటే కంపరమెత్తిపోతుంది దానికి.

"మనుమాడితే నన్ను మరిసిపోతావా అని అడిగింది పైడమ్మ. మరిసిపోతా అన్నా. సత్తే మరిసిపోకుండా నీ పెళ్ళికి నేను మాంచి బగుమతి సదివిత్తానని కసెక్కిపోయి అంది."

దానికి పంటిమీద తేళ్ళు, జర్రిలు పాకినట్టయ్యింది. వాడు ఒక పరాయి వాడనిపించింది. వాడికి కొంచెం దూరంగా జరిగింది. వాడింకా చెప్పుకుపోతున్నాడు.

"ఓ రేతిరి పైడమ్మ సెప్పింది. ఈ నూల నీకోసం పోలీసోళ్ళు ఆరా తీశారని. నువ్వీడుంటే మన పరువు పోద్ది. పెరట్లోంచి పారిపో అంది. అట్టా పారిపోతుంటే ఆ పోలీసోడే నన్నట్టుకుని బొక్కలోకి తోయింపాడు" అని పూసగుచ్చినట్టు జరిగిందంతా చెప్పేశాడు.

వాడికేవో గుండె బరువు తొలిగినట్టనిపించింది. కాని దాని గుండె మాత్రం బరువెక్కిపోయింది.

"సూడు నువ్వుకూడా నిజం చెప్పెయి. ఆ సావుకారిగాడి అబ్బాయి గాడు ఆ గొలుసెందుకిచ్చాడో."

అదలా మౌనంగా వుండిపోయింది.

"సచ్చేముందు నిజం సెబితే నా ఆలి అబద్దాల కోరు కాదని సంబర బడి సచ్చిపోతా. నా యవ్వ! నిజం సెప్పాక నాకెంత ఆయిగా వుందో. నిజం సెప్పిసూడు నీకే తెలుసుద్ది."

దాని ప్రాణం చిపుక్కుమంది.

గడ్డిమోపు ఓ బెత్తెడే నీటిపై తేలి వుంది. మోపులోంచి నీళ్ళు పైకి చిమ్ముతున్నాయి. నిజం చెప్పేయి. చెప్పేయి అన్నట్టు సూదుల్లా దాని వీపుమీద గుచ్చుతున్నాయి. వాడికేసి తిరిగింది. నిజంగా వాడు సత్యహరిశ్చంద్రుడే అనుకుంది.

ఆకాశంలో కారుమబ్బొకటి వెన్నెల కడ్డుపడింది. దాంతో చుట్టూ చీకటి ఆవరించింది. ఆ చీకటికి మరింత చలేసింది. వణికిపోతూ చెప్ప సాగింది.

"సావుకోరి గారబ్బాయి మా పెద్దోడు. ఆడయ్యే పసినారి. మాయమ్మ నా పెళ్ళి సెయ్యడానికి డబ్బు కోసం నానా కట్టాలు పడింది. ఎడమాంసు ఇమ్మని సావుకారి నడిగింది. ఆడు నేదు పో అన్నాడు. మా పేటలో ఎవరైనా సర్దుతారేమోనని గడప గడపకు ఎల్లి అడిగింది. అందరూ మొండి సెయ్యి సూపెట్టారు. ఆకరికి సావుకారిగారి అబ్బాయి గోరి నడిగింది. ఆడియ్యాల, రేపు అంటూ సానా సార్లు తిప్పాడు. ఓ రోజు సావిడికాడ మాయమ్మ పడక లొత్తుతోంది. దానికి నే సాయం సేత్తున్నా. అప్పుడాడకొచ్చారు అబ్బాయిగోరు. మాయమ్మని పిలిశారు. దాంతో ఏదో సాలసేపు గుసగుసలాడారు."

శూన్యంలోకి చూస్తూ వింటున్నాడు వాడు. వాడికప్పటికే సంగతర్థం అయిపోయింది

అది మిగతాది చెప్పసాగింది.

"ఆ రేతిరి రెండో ఆట సినిమా సూద్దారి పోలవరం ఎళ్ళి అంది

మాయమ్మ. శానాసార్లు అలా ఎల్లాం. సరే అన్నా. సినిమా ఆలుకి పోకుండా లాంచి రేవుకాడకి తీసుకుపోయింది మాయమ్మ. రేవులో తిప్ప కాడ ఓ లాంచి కట్టేసుంది. అది అబ్బాయిగారి సొంత లాంచి అన్నమాట. నువ్వాలాంచికాడ కెళ్ళి అబ్బాయిగారు అయిదొందలిత్తారు పట్రా, నేను సినిమా ఆలుకాడ టిక్కెట్లు తీసుకునుంటా, బేగాడ కొచ్చేయి అంది మాయమ్మ. నువ్వే ఆరికాడ కెల్లు అన్నాను. నా కాళ్ళు పీకుతున్నాయి, ఆ తిప్పదాకా నడవలేను నువ్వే ఎల్లు అంది. సరే ఎల్లా."

"ఎల్లాక అబ్బాయిగోరు నీ సెయ్యట్టుకుని లాంచిలోకి ఈడ్చుకు పోయి సెరిశారు" అంతేనా అన్నాడు- అబ్బాయిగారిని బండబూతులు తిడుతూ.

"ఆడిచ్చిన డబ్బు ఆడిమొగానే కొట్టాను. సినిమా ఆలుకాడ మా యమ్మని పిచ్చ దొబ్బులెట్టాను."

"గావొళ్ళంతా ఇంతే" పళ్ళు పటపట లాడించి నరాలుబ్బేలా పిడికిలి బిగించాడు. షావుకారు ఖరీదైన సావిడి కుప్పగా కూలిన దృశ్యం మనసులో మెదిలింది. కసితీరినట్టనిపించింది.

"మన్నాడు మాయమ్మ మంచం పట్టింది. సెడింపానివెలాగూ చెడావు. ఇచ్చిన డబ్బు లారి మొగానేసి కొడితే నీ పెళ్ళి ఎలా సేయనే అని గోలెత్తింది. పేటోళ్ళందరూ నా పెళ్ళని సంబరపడిపోతున్నారు. ఈ పెళ్ళి ఎలాగైనా ఆగకూడదనుకున్నా. సందేలే సావిడికాడ కూకుంటే ఆడికి అబ్బాయిగా డొచ్చాడు. నన్ను సూసి బెదిరిపోనాడు. అలా బెదురుతావేం మాయమ్మ కిత్తానన్న డబ్బులు నాయంగా దానికిచ్చేయి అని సెప్పా. రేవు కాడకి నువ్వురా, ఆడ నీకే ఇత్తాలే అన్నాడు. ఎల్లా, వందిచ్చి రేపురా అన్నాడు. మళ్ళీ ఎల్లా మరో వందిచ్చి రేపురా అన్నాడు. అలా అయిదు రోజులు ఎల్లి అయిదొందలు తీసుకున్నా. ఆడికి నేనంటే ఇంకా ఇది తీర

లేదు. నీ పైడమ్మ సెప్పినట్టే సెప్పాడు. నువ్వు మనుమాడి నన్ను మరిసి పోకుండ సేయడానికి నీ పెళ్ళికి మంచి బహుమతి ఇత్తా అన్నాడు."

చీకటి మరింత చిక్కబడింది. మబ్బులు కరిగాయి. సన్నని చినుకులు సూదుల్లా గుచ్చుకోసాగాయి. గడ్డి మోపు పూర్తిగా నాని మునిగీ మునగకుండా వుంది.

ఇద్దరి మనసులు తేలికపడ్డాయి. పాపాలన్నీ పోయి పుణ్యం ఆవరించినట్టయింది. జన్మ తరించి పోయినట్టనిపించింది. ఇంకీ లోకంలో మరేమీ అక్కర్లేదనిపించింది. హాయిగా యిద్దరం కలిసి ఆ లోకంలో కాపురం చెయ్యొచ్చని తృప్తి పడ్డారు.

దడ దడ గుండెలు కొట్టుకుంటున్నాయి. అవి ఎప్పుడు ఎలా ఆగుతాయా అని కళ్ళు గట్టిగా మూసుకుని చూస్తున్నారు.

కొన్ని నిమిషాలు గడిచాయి. ఏదో వాళ్ళ శరీరాలని గుచ్చుతూ రాసుకుపోతున్నట్టనిపించింది.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచారు.

బ్రహ్మాండమైన మోదుగ చెట్టు వరదలో కొట్టుకుపోతోంది. దాని కొమ్మల్లో ఆ గడ్డిమోపు చిక్కుకుంది.

చటుక్కున ఇద్దరూ చెరో కొమ్మ ఎక్కేశారు.

అలా కొట్టుకొచ్చే చెట్లలో కొన్ని వందల పాములుంటాయని వాళ్ళకి తెలుసు. అయినా చావడానికి జలగండమైనా ఒకటే, సర్పగండమైనా ఒకటే అనిపించింది వాళ్ళకి.

గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని కొమ్మల మీద వాలిపోయారు.

అలా కొన్ని గంటలు గడిచాయి. ఇద్దరికీ మొద్దు నిద్దర పట్టేసింది

ఫెళ ఫెళ ఫెళమంటూ కొమ్మలు విరిగిపోయాయి.

అంత పెద్ద చెట్టూ ఎందులోంచో దూసుకు పోతున్నట్టనిపించింది.

హడలిపోయి ఇద్దరూ లేచారు.

నదికి తోరణంలా వున్న రైలు వంతెన చేతులకందుతోంది.

బ్రతుకు జీవుడా అంటూ, ఒకళ్ళకి తెలీకుండా మరొకళ్ళు ఆ ఇనుప దూలాలు ఎక్కేశారు.

వంతెన మీద నుంచి దానికోసం చెట్టంతా గాలించాడు వాడు. చెట్టు మీద అది ఎక్కడా కనపడలేదు.

వంతెన మీదనుంచి వాడికోసం చెట్టంతా గాలించింది అది. చెట్టుమీద వాడు ఎక్కడా కనపడలేదు.

చెట్టు అదురుకి అది గోదాట్లో పడిపోయింది కామోసనుకుని భోరున ఏడ్చాడు వాడు.

ఏ పామో కాటేసి వాడు చచ్చి మునిగిపోయుంటాడని భోరున ఏడ్చింది అది.

ఏడుస్తూ ఒకళ్ళనొకళ్ళు రైలొంతెన మీద చూసుకున్నారు.

పరుగెత్తుకెళ్ళి గట్టిగా వాటేసుకున్నారు.

కౌగిలి బిగిస్తున్న వాడి వేళ్ళలో దాగిన ఉంగరం పక్కలో బల్లెంలా గుచ్చుకున్నట్లయింది దానికి.

వాడి వేళ్ళట్టుకుని ఉంగరాన్ని పీకేసి కసిగా గోదాట్లో విసిరేసింది.

అది చూసి చటుక్కున దాని మెడలో గొలుసు తెంచి కసిగా గోదాట్లో విసిరేశాడు వాడు.

ఎందరో ప్రాణాల్ని, ఆస్తులని, పాడి పంటలని, పల్లె సీమలని, మండలాల్ని, జిల్లాలని పొట్టన పెట్టుకున్న వరద గోదారి ఆ ఉంగరాన్ని, గొలుసుని కూడా అబగా కబళించేసింది.

# ఆఫీసులో ఆవకాయ
# గొంతులో వెలక్కాయ

ఎఫిషియన్సీ, సిన్సియారిటీతో బాటు ఆనెస్టీ, ప్రాంప్ట్‌నెస్ వున్న ఆఫీసర్లలో చెప్పుకో దగ్గవాడు నరసింహం.

యమ స్ట్రిక్టు, పరమ జిడ్డు, బొత్తిగా హానెస్ట్ అని పేరుపడ్డ నరసింహం అంటే ఆఫీసు సిబ్బందికి సింహస్వప్నం. కాకాసురుడు, ఉత్తరాసురుడు, దక్షిణాసురుడు లాంటి రాక్షసులను సైతం రాచి రంపాన పెట్టగల సామర్థ్యం బోల్డంత వుంది నరసింహానికి.

అందుకే డక్కా మొక్కీలు తిన్న వాళ్ళని, అచ్చోసిన ఆబోతుల్లా విడిచి పెట్టేసిన వాళ్ళని యేరి నరసింహం దగ్గర పడేస్తారు పై అధికారులు- వాళ్ళనో లైన్లో పెడతాడన్న ధీమాతో.

*  *  *

పేకాట జాగారం బాపతు మైకంతో గేటుదాకా వచ్చిన మేనేజరు శ్రీముఖలింగం లేటైనందుకు నరసింహానికి ఏం సంజాయిషీ చెప్పాలో ఖరారు చేసుకొని, మరో కారాకిళ్ళీ బిగించి, పెద్ద పెద్ద అంగలతో మెట్లెక్కేసరికి ఆఫీసు గడియారం పన్నెండు కొట్టింది.

టీచరు లేని క్లాసులా ఆఫీసంతా గగ్గోలుగా వుండడంతో నరసింహం కేంపెళ్ళుంటాడని పసిగట్టి తమాయింపుగా నిట్టూర్చి ధైర్యంగా దూరాడు ఆఫీసులోకి.

"శిష్యులందరూ ఏదో మహాసభ జరుపుతున్నట్లుంది. ఏమిటో విశేషం?" అంటూ హెడ్‌క్లార్కు అహోబిలం చుట్టూ మూగిన సిబ్బందిని తాపీగా చేరుకున్నాడు శ్రీముఖలింగం.

"రండి గురూ! జన్మానికో శివరాత్రి అన్నట్లు యిందాకనే మన రంకుమొగుడు కేంపెళ్ళాడు. మూడు రోజులదాకా రాడు. ఇప్పుడే కాస్త ఊపిరాడుతుంటే పచ్చిగాలి పీల్చుకుంటున్నాం" అన్నాడు అహోబిలం ఓ పట్టు పొడుం పీలుస్తూ.

"మన ఆఫీసు రానురాను బొత్తిగా బందిలుదొడ్డి అయిపోతోం దయ్యా" ఆవలించాడు శ్రీముఖలింగం.

"మన జాతకాల్లో జైలుశిక్ష అనుభవించాలని రాసుంది కాబోలు. ఇప్పుడు ఈ ఆఫీసులో నరసింహంగాడి హయాంలో అనుభవించేస్తున్నాం" అన్నాడు ఎస్టాబ్లిష్‌మెంటు క్లార్కు నందికేశ్వరుడు బాధపడిపోతూ.

"జైల్లోనన్నా కాస్త ఫ్రీగా వుండచ్చు. ఇది మరీ యుద్ధఖైదీల జైలు" అని వాపోయాడు బడ్జెటు క్లార్కు విరూపాక్షయ్య.

"మరే, ఎక్కడో మిలిటరీలో వుండవలసిన శాస్త్రీ మన కాఫీసరుగా

తగలడి దుంపతెంచి వేపుకు తినేస్తున్నాడు" అని కోప్పడ్డాడు ఏకౌంట్స్ క్లార్కు పినాకపాణి.

"మొన్నామధ్య నేదో రిఫరెన్సిచ్చి ఫైలు నంబరడిగాడు. అసలు నా డేట్ ఆఫ్ బర్త్ నాగ్గుర్తుండదు. అలాంటిది ఎన్ని గుర్తు పెట్టుకు చెప్పగలను. కాస్త తటపటాయించానో లేదో, రిఫరెన్సులా వాటి ఫైలు నంబర్లూ నాచేత బట్టీ పట్టించి అప్ప చెప్పించుకున్నాడు, పీనుగ" అని పళ్ళు కొరుక్కున్నాడు రికార్డు కీపరు పకీరు.



"అబ్బ ! ఈ ననగాడితో ఎలా వేగడం" జుట్టు పీక్కున్నాడు విరూపాక్షయ్య."

"ననా! పరమ ననా! కవర్లంటించడానికి జిగురయిపోయిందంటే, స్టాంపు లెలాగా అంటిస్తావుకదా అవి పెట్టి అంటించెయ్ అన్నాడు. స్టాంపులే సరిగ్గా అంటుకోవడం లేదూ? మరెలా? అన్నాను. దాంతో విరుచుకు పడి పోస్టుమాస్టర్ జనరల్‌కి నాలుగు పేజీల కంప్లైంట్ రాసి స్టాంపుల ఖరీదులో జిగురుకు రిబేటు యివ్వాలని పట్టుబట్టాడు", ఫిర్యాదు చేశాడు డిస్పాచ్ క్లార్క్ పుణ్యకోటి.

"అంతెందుకు సార్! మన పినాకపాణి ఇరవై పేజీల స్టేట్

మెంట్‌లో ఒక అంకె పొరపాటు వేశాడని పదిపేజీల ఛార్జిషీటిచ్చి కరా బయిన కాయితాల ఖరీదు జీవితంలో తెగ్గొట్టలేదూ?" అందరకూ జ్ఞాపకం వున్న విషయం మరోసారి గుర్తుచేశాడు నందికేశ్వరుడు.

"అడిగేవాడు లేకపోతే సరి, పదిపేజీల కాయితాలేకాక టైపింగు కూడా దండగ." అని కోపంగా చీది ముక్కులో మరోపట్టు బిగించాడు అహోబిలం.

"ఛార్జిషీటు టైపు చేయించలేము సార్! ఈ శిక్ష టైపిస్టు కెందుకూ, నీమీద ఛార్జిషీటు నీ సొంత కాయితాలతో నువ్వే డ్రాఫ్టుచేసి పట్రమ్మన్నా డండి. చచ్చినట్లు వేళ్ళరిగేలా రాసి పట్టికెళ్ళాను" అన్నాడు బిక్క చచ్చి పోతూ పినాకపాణి.

"భేష్! బావుంది. ఇదంతా లేడీ టైపిస్టుమీద జాలికాబోలు" అంటూ ఓ విసురు విసిరాడు శ్రీముఖలింగం.

"అదేం కాదు సార్! నాలుగు కాపీలు కావలసినపుడు కార్బను పెడతానంటే నీ కివ్వాళ పెద్ద పనేంలేదూ, నాలుగుసార్లు విడివిడిగా కొట్టు, నీక్కాస్త ప్రాక్టీసు అవడమే కాకుండా కార్బను ఖర్చు గవర్నమెంటుకి ఆదా అవుతుంది అంటారండి. ఈ ఆఫీసుకో దణ్ణంపెట్టి సెలవు పెట్టేద్దా మనుకుంటున్నాను." అంది టైపిస్టు చంద్ర సహోదరి తన కీచుగొంతు చించుకుంటూ.

"అసలు సెలవంటూ యిస్తే కదా, మొన్నామధ్యని మా బామ్మ పోయిందని డూబ్ చేసి సెలవు పెట్టబోయాను. కేజువల్ లీవు ఒక హక్కు కాదు. అది ఒక అవకాశం మాత్రమే. చచ్చిన బామ్మ ఎలాగూ తిరిగి రాలేదు కనుక దాచుకో, సెలవులన్నీ నీ పెళ్ళికి-అంటూ బోడి సలహా ఇచ్చాడు" అన్నాడు పెళ్ళికాని కూష్మాండేశ్వరరావు- చంద్ర సహోదరిని మొగంలో మొగం పెట్టి జుర్రేస్తున్నట్టు చూస్తూ.

"ఏ మాట కామాటే చెప్పుకోవాలి. సెలవల్లో కాని, ఆదివారాలు కాని ఈ అయ్య ఎవ్వరికీ పనిచెప్పడు. పాత ఆఫీసరు నాచేత వెట్టిచాకిరీ చేయించుకున్నాడు. ఇప్పుడు ఈ అయ్యగారి దగ్గర హాయిగా వుంది" అంటూ సంతోషించాడు అటెండరు పరమయ్య.

"బానండోయ్! అదీ పాయింటే, క్రితం నెల కలెక్టరుగారు ఆదివారం కాన్ఫరెన్సు పెడితే ఆదివారం సెలవు కనుక మరో రోజయితే వస్తాను, అని ఖచ్చితంగా రాసేశాడు. మన బ్రాహ్మడు" అన్నాడు పుణ్యకోటి.

"మనవాడు హానెస్టు కనక ఆడింది ఆట, పాడింది పాటగా సాగి పోతోంది" విసుక్కున్నాడు విరూపాక్షయ్య.

"ఎవడిక్కావాలి బోడి హానెస్టీ! లోకమంతా అంటయినపుడు నలుగురితోబాటు నారాయణా అని పోవాలి కాని, వీడొక్కడూ మడిగట్టుక్కూర్చుంటే సరిపోతుందా" కోప్పడ్డాడు శ్రీముఖలింగం.

"మడిగట్టుకో మనండి, మట్టిలో దేకమనండి, మనకెందుకు. ఇలా అందరినీ రాసి రంపాన పెట్టడం యెందుకు" మండిపడ్డాడు అహోబిలం.

ఫోన్ మోతకు ఉలిక్కిపడి ఎవరి సీట్లోకి వాళ్ళు జారుకున్నారు.

"ఆ శని పీనుగే అయ్యుంటాడు. మనం ఏంచేస్తున్నామో అని పసిగట్టడానికి ఇలాగే ఫోను చేస్తుంటాడు. చపట తెలివి." అంటూ కళ్ళి ఊసేసి ఫోను అందుకున్నాడు శ్రీముఖలింగం వేకపోతు గాంభీర్యంతో.

"హలో! హలో !"

.... .... ....

"నరసింహంగారు లేరండి, కేంపులో వున్నారు. నేను ఆఫీసు మేనేజర్ని, నాకు చెప్పండి."

.... .... ....

"ఫరవాలేదు, నాకు చెప్పండి."

....  ....  ....

"ఎంత ? వందా ?"

....  ....  ....

"ఎంతమాట. ఆ విషయం నా కొదిలెయ్యండి." అంటూ గుటకేసి మురిసిపోయాడు శ్రీముఖలింగం.

చెవులు రిక్కించి వింటున్న సిబ్బంది యూపత్తూ బేరమేమిటో తెలుసుకోవాలని ఆపురాపురుమంటూ మేనేజరును చుట్టుముట్టారు.

"అబ్బే, ఏముంది. నరసింహంగారి చిన్నకూతురు ట్రంకాల్ చేసింది. ఇంట్లో ఆవకాయ పెట్టినప్పుడు మరో వందకాయలు అదనంగా పెట్టి అనకాపల్లి పంపించమని అమ్మగారికి కబురు చెప్పమంది. కనక ఈ కబురు మనం పట్టుకెళుతున్నాం" అంటూ చేతులు దులిపి మరో కిళ్ళీ బిగించాడు.

"ఆ" దొరికిం దన్నాడు అహోబిలం.

"ఏమిటి?" అన్నాడు శ్రీముఖలింగం.

"దొడ్డిదారి" అన్నాడు అహోబిలం.

"ఆహా" అంటే "ఓహో" అన్నారు అందరూ.

♦ ♦ ♦

రివాజు ప్రకారం కేంపునుంచి యెకాయెకీ ఆఫీసుకే వచ్చాడు నరసింహం.

ఆఫీసులోకి అడుగు పెట్టేసరికి అక్కడ ఒక్కపిట్ట లేదు. అన్ని సీట్లూ ఖాళీ. కనీసం అటెండరు కూడా లేకపోగా "యివ్వాళ సెలవేంటి చెప్మా" అని దవడ గోక్కొని శెలవు కాదని నిర్ధారణ చేసుకొని ఎవరైనా పోయాడేమోనని అనుమానపడి తన రూమ్‌లో కెళ్ళాడు. టేబులుమీద ఒక

కవర్ల దొంతర వుంది. కవర్లు చించి చూశాడు. అవన్నీ ఆఫీసు సిబ్బంది పంపిన సెలవు చీటీలు! మూకుమ్మడిగా సెలవు పెట్టినందుకు మొదట ఆశ్చర్యపోయి, తరువాత చిరాకుపడి, కోపంగా యింటిముఖం పట్టాడు నరసింహం. ఇంట్లో భార్య కామాక్షి కూడా లేకపోవడంతో మరింత ఆశ్చర్యపోయి తన గదిలో బట్టలు మార్చుకుంటూ కిటికీగుండా పెరట్లోకి చూసిన నరసింహం కొయ్యబారి పోయాడు.

ఆఫీసు యావత్తూ పెరట్లో ప్రత్యక్షమయింది.

ఆవకాయ పెట్టడం అన్న ప్రక్రియ యుద్ధ ప్రాతిపదికపై ఓ యజ్ఞంలా సాగుతోందక్కడ.

అటెండరు పరమయ్య మామిడికాయ బస్తాల్ని చరచరా నూతి పళ్ళెం దగ్గరకు ఈడ్చుకుపోయి దబదబా సిమ్మెంటు తొట్టిలోకి వంచేస్తుంటే, డిస్పాచ్ క్లార్కు పుణ్యకోటి బిరబిరా వాటిని కడిగేసి గబగబా బుట్టల్లో కెక్కిస్తున్నాడు.

నిండు బుట్టల్ని రికార్డు కీపరు పకీరు టకటకా తుంగచాప మీదకు రవాణా చేస్తుంటే, రిసీట్ క్లార్కు కూర్మావతారం వాటిని సైజులు వారీగా చకచకా గుట్టలు కట్టేస్తున్నాడు.

ఆ గుట్టల చుట్టూ కూర్చున్న ఎస్టాబ్లిష్మెంటు క్లార్కు నందికేశ్వరుడూ, బడ్జెటు క్లార్కు విరూపాక్షయ్య కాయల్ని మరకత్తిపీట్లతో కసకసా తరిగేస్తున్నారు.

టైపిస్టిణి (ఆడ టైపిస్టు) రెపరెపలాడుతున్న అర్గండి కొంగు బిగించి, మిసమిస లాడుతూ, రోట్లో సరుకుల్ని ధనధనా దంచేస్తుంటే, టైపిస్టుడు (మగ టైపిస్టు) కూష్మాండేశ్వరరావు నిగనిగలాడుతున్న స్టెప్ కటింగ్ జులపాల్ని ఎగదోసుకుంటూ టైపిస్టిణి ప్రదర్శించే వివిధ భంగిమలకు జిలజిల్లాడిపోతూ, రోట్లో సరుకుని గిరగిరా జల్లెడ పట్టేస్తున్నాడు.

కువకువలాడుతున్న ఈ జంటను చూసిన నరసింహానికి చుర చురా మంట సాగింది.

ఎకౌంట్సు క్లార్కు పినాకపాణి ఘుమఘుమలాడుతున్న ఆవ, కారం ఉప్పు వగైరా గుండల్ని తగుపాళ్ళలో జరజరా కలిపేస్తుంటే, మేనేజరు శ్రీముఖలింగం గుండలో మామిడికాయ ముక్కల్ని బరబరా కలిపేసి జాడీల్లో దబదబా నింపగా హెడ్ క్లార్కు అహోబిలం వాటిల్లో జలజలా నూనెపోసి మూతల్ని గిరగిరా తిప్పేస్తున్నాడు. వీళ్ళని కొరకొరమంటూ చూసిన నరసింహం మనసు చిరచిరలాడిపోయింది.

కిటకిటలాడే ఈ సిబ్బందిపై కంజాయింపుగా గిరగిరా తిరుగుతూ అష్టావధానంతో గిలగిల్లాడుతున్న కామాక్షిని చూసిన నరసింహానికి అరికాలి మంట భగభగా నెత్తికెక్కగా పళ్ళు పటపటా కొరుక్కున్నాడు.

యాంత్రికంగా పెరటి గుమ్మం కేసి నడిచాడు నరసింహం.

నరసింహాన్ని చూసికూడా చూడనట్టు అందరూ తమతమ నిర్వాకోద్యమాన్ని మరింత వుధృతంచేసి వొకళ్ళమీద వొకళ్ళు పోటీపడి క్రెడిట్ సంపాదించేస్తున్నారు.

చటుక్కున మొగుణ్ని చూసిన కామాక్షి మొఖం చాటంత చేసుకొని, మురిసిపోతూ చెంగుచెంగుమంటూ మొగుడి కెదురేగింది.

అమాంతంగా జబ్బట్టుకొని ఇల్లాల్ని గదిలోకి ఈడ్చుకుపోయాడు ఉగ్ర నరసింహం.

"ఇదంతా ఏమిటే నిన్ను తగలెయ్యా"

"కనబట్టంలే ఆవకాయ పెడుతున్నాం"

"వీళ్ళందర్నీ ఎందుకు పిలిపించావు?"

"నేనేం పిలవలేదు. పాపం వాళ్ళే కలగజేసుకొని సాయం చేస్తున్నారు. మొన్న మన చిన్నమ్మాయి ఫోన్ చేసిందట- ఒక వందకాయ పెట్టి

పంపించమని. ఒంటరివాన్ని, నాకెలా కుదురుతుందని భయపడ్డాను. అదేం టమ్మా! మేమంతా లేమూ, అయ్యగారు మమ్మల్ని దేవుళ్ళా చూసుకుంటు న్నారు. మేము నిత్యం ఆయన పనే చేసి ఆయన్నే తలుచుకుంటుంటాం. అయ్యగారు కేంపెళితే మాకు పనేమీ వుండదు. గోళ్ళు గిల్లుకోడంతప్ప. మీరు 'ఊ' అనండి, రేపీపాటికి అన్నీ రడీచేసి ఆవకాయ పెట్టేస్తాం, అని ఊపిరాడకుండా యిలా కలగచేసుకుంటే నన్నేం చెయ్యమంటారు. డబ్బిచ్చి సరుకులు తెప్పించేశాను!"

"అమ్మగారూ! ఈ ముక్కల్ని చూడండి. ఇంకా సన్నగా తరగా లంటారా!" అంటూ నందికేశ్వరుడు గదిలోకి దూరి, నరసింహాన్ని చూసి బోల్డంత ఆశ్చర్యం నటించి "నమస్కారం సార్! ఎప్పుడొచ్చారు?.... వస్తా....పనుంది" అని మాయమయ్యాడు.

"సరే! ఇన్ని కాయలెందుకే నీ మొహం యీడ్చా! ఏదైనా వ్యాపారం పెడతావా?"

"మీరు మరీనూ, మొన్న మన రెండో అమ్మాయి కార్డు రాసింది. బరోడాలో మామిడికాయలు దొరకవూ, నీకు వీలుంటుందా? అని. మరే నండోయ్, ఓనాడు క్లబ్బులో బరోడా మహారాణి మన అమ్మాయిని స్వయంగా పలకరించిందట కూడానూ. మీ దేశంలో ఆవకాయన్నది ఏదో పెట్టుకుంటారట నిజమేనా?" అని.

"అక్కయ్యగారూ! ఇంగువ పొడివేసి నూనె పొయ్యాలా నూనె పోసి ఇంగువపొడి వెయ్యాలా" అని డౌటు అడిగాడు వాళ్ళిద్దరిమధ్యకూ దూసుకువచ్చిన శ్రీముఖలింగం. "హలో! ఇదేనా రాక?" అంటూ పొంత బావమరిదిలా నరసింహాన్ని పలకరించి, "వస్తా. కాస్త పనుంది. రేపు ఆఫీసులో కలుద్దాం" అంటూ గారపళ్ళతో యికిలించి పెరట్లోకి దూకాడు డౌటు తీరకుండానే.

"మీ ఆఫీసు వాళ్ళంతా ఎంతో కలుపుగోలు మనుషులండీ" మెచ్చుకొంది కామాక్షి.

"నీ పిండాకూడు. నీకేం తెల్సు వాళ్ళ సంగతి. ఆ రోలు నంటిపెట్టుకున్న ఆ జులపాలవాడు కూష్మాండేశ్వరరావు, ఆఫీసుల్లో పని చేస్తున్న ఆడాళ్ళని యింతవరకూ అయిదుగురిని లేపుకుపోయాడని వాడిమీద బారెడు రిపోర్టు వుంది. ఆ టైపిస్టుపిల్ల వాడి కంటపడకుండా చెయ్యడానికి నా తల ప్రాణం తోక్కొస్తోంది. ఇప్పుడు చూడు, వాడు పబ్లిగ్గా ఆమెతో ఎలా రాసుకు పూసుకు తిరుగుతున్నాడో. రేపేదన్నా అయిందంటే నన్నట్టుకుంటారు."

"చాల్లెండి. మీ మాటలకి అర్థం పర్థం వుండదు. వాళ్ళు ఉదయం నుంచి వళ్ళు దాచుకోకుండా పని చేస్తున్నారు. యిప్పటికో యాభై కేజీల గుండ కొట్టుంటారు."

"అమ్మగారూ" అన్న మరో కేకవిని "ఇదిగో వస్తున్నా" అంటూ పెరట్లోకి పరిగెత్తింది కామాక్షి.

గవర్నమెంటు యిన్ని రూల్సూ, రెగ్యులేషన్సు పెట్టింది కాని, ఆఫీసర్ల పెళ్ళాలకంటూ ఓ కోడ్ ఆఫ్ కాండక్టు యెందుకు పెట్టలేదా అని వాపోయాడు నరసింహం.

* * *

మర్నాడు ఆఫీసులో డిసిప్లిన్ లోపించినట్టు తోచింది నరసింహానికి. ఇది ఆవకాయ ప్రభావమేమోనని అనుమానమేసింది. అనుకున్నట్టే గుమాస్తాలు ఏవన్నాంటీ విచ్చలవిడిగా బాతాకానీ కొడుతున్నారు. కాయ సెలక్షన్ లగాయతూ జాడీలకు వాసిన బిగించేదాకా ఆ మహా ఉద్యమంలో తమ తమ పాత్రల సింహావలోకనం చర్చలద్వారా జరుగుతోంది. అసలెవరూ తమ కలాలకి కేప్‌లు తీసినట్టు లేదు.

ఏడ్మినిస్ట్రేషనులో తను దిగజారి పోతున్నానేమోననీ అనుమానం కలిగి వీళ్ళనో లైన్లో పెట్టకపోతే మరీ పేట్రేగి పోతారేమోనన్న భయంతో ప్రతి సీటుదగ్గరకు వెళ్ళి తనికీ చేయసాగాడు నరసింహం.

"ఏమయ్యా కూర్మావతారం? కాయితాలు రిసీట్ చేయకుండా ఏమిటి దిక్కులు చూస్తున్నావు?"

"అబ్బే ఏంలేదు సార్! నిన్న కాస్త జీడి కారి, చెయ్యి పొక్కింది" అంటూ బొంత కట్టు కట్టిన చెయ్యి చూపించాడు.

నరసింహం నిశ్శబ్దంగా హూంకరించి టైపిస్టు సీటుదగ్గర కెళ్ళాడు. చంద్ర సహోదరి టిక్కు టిక్కుమంటూ ఒంటి వేలితో గంటకో అక్షరం టైపు కొడుతోంది.

"ఏం తల్లీ? ఇదేనా నీ స్పీడు" కళ్ళెర్రజేశాడు.

"మరేమో సార్, నిన్నటి రోకటి పోట్లకి వేళ్ళు లాగేస్తుంటే కాస్త నొప్పిగా వుంటేనూ...." అని నీళ్ళు నములుతూ కొంగు గట్టిగా కప్పేసుకుంది మెలికలు తిరిగిపోతూ.

మనసులోనే పళ్ళు పటపటలాడించి "పోనీ ఆ కూష్మాండేశ్వర రావు కివ్వలేకపోయావా? టైపు చేయవలసిన కాయితాలు"

"కూష్మాండేశ్వరరావు కంట్లో కారంపడి కళ్ళు వాచాయట. సెలవు పెట్టాడు" అని ధీమాగా చెప్పాడు ఎష్టాబ్లిష్మెంటు క్లార్కు.

ఆవకాయ బాపతు హేంగోవరు మరీ యింత వుధృతంగా వుంటుం దని వూహించని నరసింహాన్ని ఈ సంజాయిషీ పరంపరలు చిర్రెత్తిం చేస్తున్నాయి.

"ఔనూ! విరూపాక్షయ్య కనపడ్డే, అతని కేమొచ్చింది?"

"ఆఫ్టర్ నూన్ వస్తానన్నాడండీ" వకాల్తా పుచ్చుకున్నట్టు చెప్పాడు పకీరు.

"ఏం? హాస్పిటల్‌కు వెళ్ళాలని కుంటి సాకు చెప్పమన్నాడా?"

"కాదండి. నిజంగా వెళ్ళాడండి."

"పాపం, మరకత్తిపీటలో చెయ్యి తెగింది కాబోలు."

"కాదండి. పుల్లగా వున్నాయా లేదా అని పదేసి కాయలకో ముక్క-శాంపిలు చూశాడు. మోషన్స్ పట్టుకున్నాయి."

"యూ! షటప్!" అనబోయి సభ్యత అడ్డొచ్చి, అన్నం మానేసి మేనేజర్ సీటు కూడా ఖాళీగా వుండడం చూసి "శ్రీముఖలింగంగారు ఆవకాయ దెబ్బతో అలసిపోయారు కాబోలు" అన్నాడు వ్యంగ్యధోరణిలో జనాంతికంగా.

"చిత్తం. కాదండి- ఇవాళ ఆరింట్లో ఆవకాయ పెట్టుకుంటారట. లేటుగా వస్తానని మీరడిగితే చెప్పమన్నారు" అన్నాడు పరమయ్య.

కుదేలయిపోయాడు నరసింహం. ఇంకెవర్నడిగినా ఈ ఆవకాయ సమాధానమే వస్తుందని, ఏం చెయ్యాలో తోచక తన సీట్లో కూలబడ్డాడు. ఇందాకట్నించి కుతకుతలాడుతూ, మానసికంగా జుట్టు పీకేసుకుంటున్నందువలన, జుట్టు చెదిరిన అనుమానమేసి కోటుజేబులోని దువ్వెనతో దువ్వుకోబోతూంటే కిళ్ళీ నముల్తూ హుందాగా వచ్చి టేబులు కెదురుగా నిలబడ్డాడు శ్రీముఖలింగం- బాస్ మంచి హుషారులో వున్నాడన్న ధీమాతో.

ఆవకాయ కారణాలతో సతమతమవుతూ ఆవకాయ తెచ్చిన అనర్థానికి మండిపోయి, మనసంతా ఆవకాయమయమై ఆవకాయన్న పదాన్ని

తలుచుకుంటేనే కంపరమెత్తిపోతున్న నరసింహం, మేనేజర్ని చూసి "ఆఫీసుకింత లేటా?" అని అరవబోయి "ఆవకాయకింత...." అని తప్పి మని నాలిక్కొరుచుకున్నాడు.

పాయింటు కొచ్చేశాడన్న భరోసాతో ఊడగా మిగిలిన పదిహేడు గారపళ్ళతో ఇకిలించి, ఛటుక్కున కుర్చీలాగి నరసింహానికెదురుగా చతికిల బడి వళ్ళు విరిచి బల్లమీద చేతులు వేయగానే నరసింహం అదిరిపోయాడు- వీడెక్కడ టేబులు మీదుగా తన భుజాలపైకెక్కి స్వారీ చేసేస్తాడో అని.

* * *

ఆ రోజు జీతాల రోజు. అయిదవగానే అందర్నీ పిలిచి జీతాలు కవర్లో పెట్టి స్వయంగా బట్వాడా చేశాడు నరసింహం.

అందరూ కవర్లు విప్పి డబ్బులు లెక్కెట్టుకున్నారు. సొమ్ము తగ్గినట్లనిపించి, ఒకళ్ళ మొగాలు ఒకళ్ళు చూసుకుంటూ ఇందులో తిరకాసేమిటో అర్థంకాక నరసింహంకేసి తిరిగారు.

నరసింహం ఒక మాంత్రికుడులా డ్రాయరులోంచి మరో కట్ట సీల్డు కవర్లు తీసి అందరికీ పంచిపెట్టాడు. అనుమానంగా అందుకొని చించి చదువుకోసాగారు అందరూ. అది నరసింహం స్వహస్తాలతో రాసిన తాఖీదు.

"మూకుమ్మడిగా మీరుపెట్టిన సెలవుకు తగిన కారణం లేనందున ఒకరోజు జీతం మినహాయించడం జరిగిందని తెలియచేయడానికి విచారిస్తున్నాను. ఆ రోజునుంచి ఈ రోజుదాకా మీ ఎఫిషియన్సీ యెందుకో పడిపోయింది. దానివలన పెండింగు ఫైల్సు పేరుకుపోయాయి. వాటిని క్లియరు చెయ్యడానికి మరో నెల పట్టవచ్చు. కనక ఏటా యిచ్చే మీ ఇంక్రిమెంటు

ఒకనెల వాయిదా వేయక తప్పలేదని తెలియజేయటానికి చింతిస్తున్నాను" అని వుంది.

నిర్ఘాంతపోయారు అందరూ. వళ్ళుమండి తిట్టుమీద తిట్టు మనసులోనే తిట్టుకున్నారు సిబ్బంది యావత్తూ. అప్పనంగా పెట్టిన ఆవకాయ బాపతు శ్రమ బూడిదలో పోసిన పన్నీరయినందుకు ఉడికిపోతూ ఉక్రోషంతో చూశారు నర'సింహం'కేసి.

మూడు సింహాల అధికార ముద్రలో మధ్య సింహంలా కనపడ్డాడు నరసింహం.

నిస్సహాయంగా మనసారా "వీడి ఆవకాయ బూజుపట్టుగాక!" అని శాపనార్థాలు పెట్టుకుంటూ వెను తిరిగారు.

"ఆగండి," అంది మరో సింహం.

ఇంకేం కొంప ముంచుతాడో అన్నట్టు చూశారు నరసింహంకేసి.

"ఈ విషయంలో మరొకరి దోషం వుండటం నాకిష్టం లేదు" అని బీరువాలోంచి ఏవో పొట్లాలు తీసి టేబులు మీద పెడుతూ "మీరు భక్తితో శ్రద్ధగా, శ్రమపడి మా ఇంట్లో పెట్టిన ఆవకాయ అందరూ పంచుకోడం నా అభిమతం."

పొట్లాలకేసి చూశారు సిబ్బంది.

అందులోని ఆవకాయ కొంటెగా వెక్కిరించినట్టు తోచింది అందరికీ.

"తీసుకోండి" గర్జించింది మూడో సింహం.

తలో మూడు కేజీల పొట్లాలు అందుకొని టన్నున్నర బరువు మోస్తున్నట్టు భారంగా కదిలారు గుమాస్తాగిరులు.

# పుష్కరాల రేవులో పుల్లట్లు

గోదావరి ప్రవాహానికి అడ్డు, ఆపు, అలసట లేదు. కాలంలా ప్రవాహం నిరంతరం సాగిపోతుంది. ఈ ప్రవాహకాలం చరిత్రను సృష్టిస్తుంది, సాగిస్తుంది, మారుస్తుంది, మాపుతుంది, తిరిగి కల్పిస్తుంది.

History repeats itself.

ప్రవాహంలో తరంగాల్లా ఎన్నో జీవితాలు కాలప్రవాహంలో సాగిపోతుంటాయి. తరంగానికి దిగువ మనకు కనబడని మరొక తరంగం వుంటుంది. ఆ తరంగశక్తే మనం చూస్తున్న తరంగాన్ని నడిపిస్తుంది. అలాగే మన మెరిగిన వ్యక్తుల జీవితాల వెనుక మన మెరుగని ఎన్నో బాధలు, కథలు దాగివుంటాయి. ఆ సాగే కథలకు పారే గోదావరే సాక్షి.

పన్నెండేళ్ళ కొకసారే కళకళలాడే పుష్కరాల రేవు మామూలు రోజుల్లో బోసిపోయి వెలవెలబోతూ వుంటుంది. నీడల్లా కదుల్తున్న నలుగురైదుగురు బైరాగులు, బిచాణాల్లేని బిచ్చగాళ్ళు, అచ్చోసిన ఆంబోతులు, దిక్కుమాలిన కుక్కలు మినహా ఆ రేవులో ఎలాంటి సంచారం వుండదు. బూజుపట్టిన సింహద్వారాలు, చీకటి గుహల్లాంటి మండపాలు, నాచుపట్టిన సిమెంటు మెట్లు, రావిచెట్లపై వేళ్ళాడే పక్షుల రొద, వాటికి సాయం ఉండుండి గుండెలదరగొట్టే రైలు వంతెన మోతలో, రేవు ఎప్పుడూ బిక్కుబిక్కుమంటూ, భయంకరంగా వుంటుంది.

అలాంటి రేవుకి నిత్యం కిటకిటలాడే జనంతో కళకళలాడేలా దశ పట్టించింది పుల్లమ్మ పెట్టిన పుల్లట్ల దుకాణం.

మొదట్లో పడవలు, లాంచీల బాపతు కళాసీల కోసం ఒక పొయ్యి వెలిగించి పుల్లట్లు వేసిపెట్టి పొట్ట గడపడానికి ఒక పుంజీడు రాళ్ళు సంపాదించేది పుల్లమ్మ.

కొన్నాళ్ళకి లాంచి పాసింజర్లు కూడా అట్లు వేయించుకోడంతో ఆ పొయ్యికి సాయం మరో పొయ్యి వెలిగించింది. దరిమిలా అట్ల రుచి మరిగి రద్దీ పెరగడంతో మరో పొయ్యిగూడా వెలిగించడం జరిగింది. రేవు కెదురుగా వున్న టాక్సు ఆఫీసు బాపతు నాల్గోతరగతి ఉద్యోగ సిబ్బంది కూడా పుల్లట్లు రుచి మరగడంతో మరో పొయ్యి వెలిగించింది. మరికొన్నాళ్ళకి ఎన్.జి.ఓ.లు కూడా పుల్లమ్మని ఆదరించి మరో పొయ్యి పెట్టించారు. టాక్సాఫీసులో పడిగాపులకు విసుగెత్తి పచ్చిగాలి పీల్చుకోడానికి రేవులో కొచ్చిన ఖాతాదారులు గూడా అట్లు తినడం అలవాటు చేసుకోనడంతో నానా రకాల జనానా అట్లు మరిగి బాగా పబ్లిసిటీ పెరిగి రేవులో రద్దీ ఊహించని విధంగా పెరిగిపోయింది.

దాంతో విగ్రహం చుట్టూ గుడి కట్టినట్టు పుల్లమ్మ చుట్టూ ఎన్నో పొయ్యిలు వెలిశాయి. అలా చుట్టూ పొయ్యిలంటే అట్లు వేయడం వీలు పడదు గనుక పాతికభాగం వదలి మిగతా ముప్పాతిక భాగంలో మూడు వరసల్లో పొయ్యిల్ని ఏర్పాటు చేసుకుంది పుల్లమ్మ.

ఒకసారి కతికితే చాలు, 'నాలిక లాగేసినట్టు ఆ అట్ల నిట్టే మరి గేస్తారు ఎవరైనా. అందుకే ఊళ్ళో ఎన్నో పేరుమోసిన హోటళ్ళున్నా



పుల్లమ్మ దుకాణానికి వున్న గిరాకీ వాటికి లేదు. ఊళ్ళో ఎవరినైనా పట్టుకోవాలంటే పొద్దున్నే పుల్లట్ల రేవులో వెదికితే యిట్టే దొరికిపోతారు.

ఏ హంగులూ లేకుండా పేరు తెచ్చుకున్న ఫలహారాలు దక్షిణ భారతంలో రెండు మూడు చోట్లే లభిస్తాయంటారు. మైలాపూరులో అయ్యరు హోటలు. ఒక పెంకుల సావిట్లో యిప్పటికీ వుంది. మసిబారి

పోయిన యింటికప్పు, గుంటలుపడ్డ నేల, దుమ్ముగా రాలిపోతున్న యిటుకల గోడల మధ్య అకు అడ్డంగా మాత్రం పట్టే నాపరాళ్ళ టేబుళ్ళు, నాటు బల్లలూ వుంటాయి. అయితేయేం, ఆ హోటలు సుచికి, శుభ్రానికి పెట్టింది పేరు. మడికట్టుకు మరీ వస్తారు- అక్కడ టిఫిన్లు మరిగిన జనాభా. అలాగే బెజవాడలో బాబాయి హోటలు ఎరుగని వారుండరు. నేతిలో ముంచిన ఇడ్లీని నోట్లో వేసుకుంటే నమలకుండానే గొంతులోకి జారిపోతుందంటారు. అందుకే వీటికున్న రద్దీ మరే హోటలుకీ వుండదట.

సిఫార్సుల వలనో, మొహమాటపడో లేక జాలేసో అప్పుడప్పుడు అయ్యరుగారు, బాబాయిగారు రద్దీవున్నా, పార్శిలు కడతారేమో కానీ, పుల్లమ్మ మటుకు పుల్లట్లను చస్తే పార్శిలు కట్టి యివ్వదు. ఎంత గొప్పాడయినా రేపులో మెట్లమీద క్యూలో కూర్చుని అట్లకోసం పడిగాపులు కాయవలసిందే. అయినా, ఆలస్యానికి సిద్ధపడే వస్తారు అట్లు మరిగిన జనాభా.

పుల్లమ్మ పుల్లట్లని మూడు రకాలుగా వేస్తుంది. వాటిని 'దుక్క, దూది, సిల్కు' అంటారు అక్కడికి వచ్చే జనం.

మద్రాకులో మిరపకారం పచ్చడి వేసి, నూనెవాడిన దుక్కల్లాంటి అట్లని 'దుక్క' అంటారు.

అలాగే తామరాకులో బెహరా పచ్చడి (శనగపిండి ఉడక వేసినది) వేసి, గానుగనూనె వాడిన దూదిలాంటి అట్లని 'దూది స్పెషల్' అంటారు.

అలాగే అరిటాకులో అల్లప్పచ్చడి వేసి నెయ్యి వాడి సిల్కులా, పల్చగా వుండే అట్లని 'సిల్కు స్పెషల్' అంటారు.

ఈ సిల్కు స్పెషల్‌నే కాస్త పెద్దసైజులో వేసి అన్ని రకాల పచ్చళ్ళని అరిటాకులో పెట్టిచ్చినదానిని 'ఎమ్.ఎల్.ఏ. అట్టు' అంటారు. దీనికి జీతాలరోజుల్లో బాగా గిరాకీ వుంటుంది.

ఇన్నిరకాల అట్లు అన్ని అంతస్తుల వారికి ఏ ఆధునిక యంత్రానికీ సాధ్యపడని వేగంతో వేసి అందిస్తుంది పుల్లమ్మ. అందుకే తినిపోయే జనంతో తింటానికి వచ్చే జనంతో రేవు ఎప్పుడూ కళకళలాడుతూ వుంటుంది.

*　　　*　　　*

రేవు ప్రక్కనే పెద్దాంజనేయస్వామివారి గుడుంది. ఆ గుడికి కాస్త అనుంటూ చిన్న ఆంజనేయస్వామివారి గుడుంది.

పెద్ద ఆంజనేయస్వామివారి కట్టూ బొట్టూ ఉత్తరాది సంప్రదాయంలో వుంటాయి. కనుక ఆయనకి హిందీతప్ప తెలుగు రాదు.

చిన్నఆంజనేయస్వామిగారు పచ్చి పదహారణాల ఆంధ్రుడిలా వుంటాడు. ఆయనకి తెలుగే వచ్చు.

అయినా అక్కడి జనం పెద్దాంజనేయస్వామివారి గుడికే వెళ్ళి తెలుగులో మొరెట్టుకుంటూ వుంటారు.

రోజూ ఆ గుళ్ళో వెయ్యి కొబ్బరికాయలు పగుల్తాయి.

పెద్దాంజనేయస్వామివారి గుడి పూజారి విష్ణుభట్టుగారు కొబ్బరినూనె డిపో సైడు బిజినెస్సుగా పెట్టుకొని బాగా సంపాదించి దగ్గరలో ఒక మేడ కొన్నారు.

చిన్నాంజనేయస్వామివారి గుళ్ళో దీపం పెట్టడానికి కాసిన్ని నూనె చుక్కలుకూడ కరువవ్వడంతో ఆ గుడి పూజారి కావశాస్త్రిగారికి బొత్తిగా రాబడిలేక పోయింది. దాంతో విధిలేక రెండుగుళ్ళకి ఎదురుగా కొబ్బరి కాయల టోకువ్యాపారం మొదలెట్టారు కావశాస్త్రిగారు.

రెండు గుళ్ళమధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

అలాగే, కొబ్బరికాయల ధర కూడా మండిపోయి కావశాస్త్రిగారి రాబడి విపరీతంగా పెరిగింది.

దాంతో విష్ణుభట్టుగారి మేడపక్కనే తనూ ఒక మేడ కొనేశారు ఏడాది తిరగకుండానే.

ఆ రెండు మేడల మధ్య గోడ తగువొచ్చి కావశాస్త్రిగారు, విష్ణుభట్టుగారు బద్ధవిరోధులయ్యారు.

విష్ణుభట్టుగారి మనవడు పుల్లమ్మ వేసిన అట్లు దొంగచాటుగా తిన్నాడు ఒకనాడు.

అది చూసిన కావశాస్త్రిగారి మేనల్లుడు కావశాస్త్రికి చెప్పేశాడు, ఆ సంగతి.

సాక్ష్యాలు కూడగట్టుకుని, విష్ణుభట్టుగారిని వీధిలో కీడ్చి, సకల తిప్పలు పెట్టి కక్ష సాధించడానికి ఇదే మంచి అవకాశమనుకున్నాడు కావశాస్త్రి.

అందుకోసం పనిగట్టుకుని పూజార్ల యూనియన్‌లో దుమారం లేవదీశాడు.

"ఎంత లక్నో బ్రాహ్మడైనా అవ్వ కుక్కలం తక్కువ అట్లు తింషాడు షండీ. ఇహ లాభం లేదు. వాణ్ణి వెలేసి గుడికి తాళం పెట్టేయాల షిందే."! విష్ణుభట్టుగారే పుల్లట్లు తిన్నంత గట్టిగా పట్టుబట్టాడు కావశాస్త్రి.

మనవడు చేసిన తప్పుకి విష్ణుభట్టుని వెలేయడం సబబు కాదు. అయినా ఈ విషయం హిందీలో విష్ణుభట్టుతో వాదించే ముందు ప్రాయశ్చిత్తం ఏదైనా ఉందేమో తెలుగులో మరెవరినైనా అడిగి చూద్దాం అంది యూనియన్.

"సరే, అన్ని శాస్త్రాలూ క్షుణ్ణంగా తెలిసిన ఘనాపాటి అగ్నిహోత్రావధానులుగారిని అడుగుదాం, పదండి", అన్నాడు కావశాస్త్రి.

"ఆయనిప్పుడు నిష్ఠలో వుంటారు. ఎవరితోనూ మాట్లాడరు. సంధ్య వార్చుకోవడానికి రోజూ ఉదయం రేవుకి వెడతారు. రేవక్కడ పట్టుకుందాం", అంది యూనియన్.

మర్నాడు యూనియన్నట్టుకుని రేవుకెళ్ళాడు, కావశాస్త్రి.

రేవంతా గాలించారు. అగ్నిహోత్రావధానులుగారు ఎక్కడా కనబడలేదు.

రావి చెట్టు కింద చుట్టూ పొయ్యిల్ని పేర్చి, పెనాలెక్కించి, దించిన తల ఎత్తకుండా అట్లు వేస్తోంది పుల్లమ్మ.

ఎడతెరిపిలేని గాజుల స్వర సందడికి లయగా వివిధ స్థాయిల్లో పెనాలమోత, అట్లు చుయ్ చుయ్‌లు, చింపుతున్న విస్తరాకుల పరపరలు, వాటిలో ఆ అట్ల దట్టింపు, పచ్చడి ముంతలో కర్ర గరిటెల దేవుకోడాలు, ఖాళీ అవుతున్న పిండి గిన్నెల డింకీలు, కొత్తగా పులుస్తున్న పిండి బుడబుడలు, కొరకంచుల ఎగసెగల చిటపటలు, ఎట్టకేలకు అట్లు అందుకుంటున్నవారి నిట్టూర్పులు, ఎంతకూ అట్లు అందనివారి ఆవులింతలు, వివిధ భంగిమల్లో పుల్లమ్మ బిలబిలలూ, చెట్లపై పక్షుల కిలకిలలూ, మధ్య మధ్యన రైలు వంతెన దభ దభలూ, వీటన్నిటికీ శృతి కలుపుతూ గోదావరి గలగలలూ వింటూ జలతరంగం వాయిస్తున్నట్లు పుల్లమ్మ హస్త విన్యాసాన్ని, దానికి మించిన చేయి తిరుగుడు చూస్తుంటే "పుల్లట్లు వేయుట" అన్న ప్రక్రియ పాక కళాస్వరూపంలో సాక్షాత్కరించిందా అనిపించింది

ఆ యూనియన్‌కి. నాలిక చప్పరిస్తూ మనసులోనే పుల్లమ్మ నభినందించారు యూనియన్ తాలూకు పూజార్లు.

యజ్ఞానికి హాజరైనట్లు ఊళ్ళో పెద్దమనుషులు చుట్టూ మెట్లమీద కూర్చుని, పొయ్యి మంటలకేసి చూస్తూ అట్లకోసం పడిగాపులు కాస్తున్నారు.

ఎవరో పట్టుశాలువా ముసుగేసుకొని అట్లు అందుకోడానికి పుల్లమ్మకేసి ఒక అడుగు ముందుకేశారు.

అనుమానం వేసి అటు చూసింది యూనియన్.

కాలికి తగిలించిన గండపెండేరం తళుక్కుమని మెరిసింది.

"అదిగో అవధానిగారు" అంది యూనియన్ ముక్కుమీద వేలేసుకుంటూ.

నీరుగారిపోయారు కావశాస్త్రిగారు- సాక్షాత్తూ అగ్నిహోత్రావధానులుగారే పుల్లట్లకోసం అలా దిగజారిపోయినందుకు.

అట్లందుకొని, పచ్చడి ఒలికిపోకుండా తామరాకుని ఒడుపుగా పట్టుకొని మడిగా తిందామని కాస్త ఇసుంటాపచ్చిన అవధాన్లుగారికి యూనియన్ సభ్యులు ఎదురయ్యారు. కాస్త గతుక్కుమన్నా ఇట్టే తమాయించుకొని, "అందరూ ఇలా వచ్చారు ఏమిటి" అంటూ ఠీవిగా అడిగారు చిరునవ్వు చిందిస్తూ.

"అయ్యా! మీరు నిష్టాగరిష్టులు, ఊర్లో పేరుమోసిన ఘనాపాటి అయ్యుండి ఈ రేవులో పుల్లట్లు తిండం సబబేనా," అని అడిగింది యూనియన్.

"అందుకే మ్మన కుక్కల ప్రతిష్ట ఇల్లా బజారు పాలయింది. అంటుంపా" అన్నారు కావశాస్త్రిగారు గింజుకుంటూ, అక్షరాలన్నిటికీ లేనిపోని వత్తులెట్టేసి.

"పిచ్చివాళ్ళల్లారా! నేనీ విషయంలో శాస్త్రాలన్నీ తిరగతోడాను. ఇంత శుచి, రుచిగా వేస్తున్న పుల్లట్లు తినడంలో నాకు దోషం ఎక్కడా కనబడలేదు." అన్నారు అవధానిగారు తీరుబడిగా మెట్లమీద చతికిల పడుతూ.

"కులం తక్కువది వేసిన అట్లు తినొచ్చా?" అడిగింది యూనియన్.

"పునిస్త్రీ వేసిన అట్లకి కులప్రధానం లేదని తెలియదటోయ్ మీకు?" విసుక్కుంటూ అన్నారు అవధానిగారు.

"పిండి పులిసిందిక్కడా! పులిసిన పిండి మధువుతో సమాన మంటారు. దీనికే మంటారు?" సంజాయిషీ అడిగారు కావశాస్త్రి.

"పిండి పులిసినా పెనంమీద పడగానే అగ్నిహోత్రుడు దోషా న్నంతా దహించేస్తాడు. ఈ మాత్రం తెలియదా!" అని కళ్ళెర్రజేశారు అవ ధానిగారు.

ఇంత చిన్న విషయం తెలుసుకోకుండా అలాంటాయన మీద విరు చుకుపడ్డందుకు నాలిక్కరుచుకుంది యూనియన్.

"మరి పచ్చడి స్సంగతెమ్మంటారూ, దానికి అగ్ని సోకలేదుగా మరీ?" సమాధానం వుండదన్న ధీమాతో నిలదీసి అడిగారు కావశాస్త్రిగారు.

"తామరాకు. అది పవిత్రమైంది. దానికే మైలా అంటదు. అందులో పడ్డ ఏ వస్తువైనా క్షణంలో పవిత్రమైపోతుంది. అందుకే తామరాకుతో తిండం. అయినా ఇందులో మీకొచ్చిన మీమాంస ఏమిటో నాకర్థంగావటం లేదు" చివాట్లేసినట్లన్నారు అవధానిగారు- సిల్కు అట్టుకు అంటుకున్న అల్లప్పచ్చడి జుర్రుతూ.

బుర్ర గోక్కుంటూ అవధానిగారి పక్కనే మెట్లమీద చతికిల

బడింది యూనియన్. రుసరుస లాడుతున్న కావశాస్త్రిని జబ్బట్టుకు కుదేసి, "నువ్వూ తిందూగాని కూర్చో!" అన్నారు అవధానిగారు.

అలా ఆనాడు అవధానిగారిచ్చిన భరోసాతో కుల, మతవర్గ, ఆంక్షలు లేకుండా సర్వం జగన్నాథంగా పుల్లమ్మట్లు వూరంతా చెలామణీ అవ్వసాగాయి.

* * *

పుల్లమ్మ పుల్లట్లేస్తుంది తప్ప కాఫీ టీలు ఇవ్వదు. ఆ మాటకొస్తే, మంచి నీళ్ళు కూడా ఇవ్వదు. దాహమేస్తే గోదాట్లో నీళ్ళే తాగాలి.

అందుకోసం అరడజను ఇత్తడి రేకు గ్లాసులకు పొడుగాటి పురు కొసలు బిగించి, చెట్టుకు కట్టేస్తుంది. ఎవరైనా గ్లాసు వదిలేస్తే తాడు లాగ డంతో గ్లాసు మెట్లమీద పల్టీలు కొడుతూ చెట్టు చేరిపోతుంది.

రెండు దుక్కల్ని అప్పనంగా తినడంకోసం రోజూ తెల్లారకుండా ఒక జంగందేవర తన కంచుగంటతోపాటు రివాజుగా యీ గ్లాసుల్ని కూడా తళతళ మెరిసేలా తోమేస్తాడు. కనుక ఈ గ్లాసులకి సొట్టలున్నా అవి శుచి, శుభ్రతతో ఉంటాయి.

కాఫీ, టీలు కావలసిన వాళ్ళు మండపం వారే వెలసిన ఈశ్వరయ్య టీ కొట్లో తీసుకుంటారు. కొందరు టీ కోసం కాకపోయినా అట్లు తిన్న ప్పుడు డెక్కుతుందేమోనని భయపడి నీళ్ళకోసం గ్లాసులు ఎరువుచ్చుకొని అట్లు తిన్నాక మొహమాటంకొద్దీ ఈశ్వరయ్య పోసిన టీ అనబడే వేడి నీటిని కాస్త చప్పరించి డబ్బులిచ్చేస్తారు.

దాంతో ఈశ్వరయ్య టీ కొట్టుకి కూడా డిమాండు పెరిగిపోయింది.

ఒకప్పుడు పిప్పిపన్నుతో బాధపడుతూ, నీరసంగా మూలుగుతూ నాచుపట్టిన ఫ్లాస్కుల్లోని కాఫీ, టీ లమ్మేవాడు ఈశ్వరయ్య.

పుల్లమ్మకొట్లో మూడో పొయ్యి పెట్టకముందే పిప్పిపన్ను పీకించి బంగారం పన్ను కట్టించి కాఫీ, టీలకు బాయిలర్లు కొనేశాడు నెమ్మదిగా ఈశ్వరయ్య.

ఒక పొయ్యి కాలంలో పుల్లమ్మకు రోజుకు ఐదు రూపాయలు మిగిలేవి. పొయ్యిల సంఖ్య ఎంతగా పెరిగినా పుల్లమ్మ కిప్పటికీ ఆ ఐదు రూపాయలే ఆదాయం. ధరలన్నీ ఆకాశాన్నంటినా అట్లధర పెంచకపోవడమే దీనికి కారణం.

తను వేసిన అట్లు ఎవటివాడు తిండం చూస్తుంటే పుల్లమ్మకి గొప్ప తృప్తిగా వుండేది. ఆ తృప్తి వ్యసనంగా మారడంతో సంపాదన మీద ఆశకన్నా నలుగురూ తన అట్లు తింటుంటే చూడాలన్న ధ్యాసే ఎక్కువయ్యింది.

అందుకే పుల్లట్లను చచ్చినా పార్శిలు కట్టదు. అట్లు మరిగిన జనం అంతా తన దగ్గరే కూర్చుని తినాలి.

వానాకాలం వచ్చినా పుల్లమ్మ వ్యాపారానికి అంతరాయం ఉండదు. పొయ్యికొకటి చొప్పున తాటాకు గొడుగుల్ని చెట్టునుండి వ్రేలాడ దీయించి పెనాలు చల్లారిపోకుండా ఏర్పాటుచేస్తుంది.

వానాకాలంలో తిన్న పుల్లట్లు మరీ రుచిగా ఉంటాయిట. తడుస్తున్న కొరకంచుల ఆవిరి వాసన, తాటాకు గొడుగు మీంచి కారే తుంపర వాసన. మెట్లమీద బురద వాసన, తడిసిన రోడ్డు దుమ్ము వాసన, అట్ల వేడికి ఉమ్మ గిల్లిన తామరాకు వాసన, అన్నీ కలిసి చిత్రమైన వాసనేస్తుంది. అప్పుడు గొడు గట్టుకుని నిలబడి అట్లు తింటుంటే మహాప్రభో చెప్పలేం అంటారు అలవాటు పడ్డవారు.

*　　　　*　　　　*

పుల్లట్లు రుచి మరిగిన వాళ్ళెందరో అవి తినడానికి ఏదో వంకన రాజమండ్రి వస్తూంటారు. నిజానికి బాపూ రమణలు యీ పుల్లట్లు మరిగే ఎన్నో సినిమాలు గోదాట్లో తీశారు. అంతెందుకు ఓ.యన్.జి.సి ఆఫీస రొకాయన పుల్లట్లు రుచిచూసి అవి రోజూ తినొచ్చనే గోదావరిప్రాంతంలో పెట్రోలు తవ్వకం మొదలు పెట్టించాడట.

అలా పుల్లమ్మ వేసే ఆ పుల్లట్లు యీ ప్రాంతానికి ఎంతో ప్రాము ఖ్యత చేకూర్చాయి.

చుక్కపొడిచేలోగా సరంజామాతో రేవు చేరిపోతుంది పుల్లమ్మ. పొయ్యిల్ని అలికి ముగ్గుపెట్టి, వాటికి హారతిస్తూ గంట వాయించడంతో గూటిపడవలోని కోడి మేల్కొని తొలికూత కూస్తుంది. పొయ్యిమంటలకి రేవు ఎర్రబడుతుంది. అది చూసి మలికోడి కూస్తుంది. అది విని జనం నీడల్లా రేవులోకి దిగి గోదాట్లో పుక్కిలించి పుల్లమ్మ చుట్టూ చేరిపోతారు.

ఈ సందడి అలా కొన్ని గంటలు సాగుతుంది.

పొద్దు నెత్తికెక్కగానే టంచనుగా దుకాణం సద్దేస్తుంది పుల్లమ్మ.

పెనాన్ని దింపగానే పుల్లమ్మకు నీరసం ఆవహిస్తుంది. కాళ్ళు తిమ్మి రెక్కిపోతాయి. నడుం లాగేస్తుంది. జబ్బలు పులిసి పోతాయి, మెడ లాగు తుంది. వొళ్ళంతా చిరాకేస్తుంది.

బరువుగా అడుగులేస్తూ గోదారి చేరుతుంది. గోదాట్లో ఒక మునుగు మునగ్గానే దేహంలో ఏదో తెలియని శక్తి ప్రవేశిస్తుంది. దాంతో అలసట పటాపంచలయిపోతుంది.

ఛాతీలోతు నీళ్ళల్లో, అలవాటైన ప్రవాహంలో గంటలతరబడి ఉండి

పోయి ఆ రోజు జరిగిన విషయాలని నెమరువేస్తూ గోదారితో ముచ్చ టిస్తుంది, పుల్లమ్మ.

*　　　*　　　*

నెలరోజులుగా టీ కొట్టు మూసేసిన ఈశ్వరయ్య పుల్లమ్మ కొట్టు కట్టే సమయానికి ఓ పేకెట్టు చంకలో పెట్టుకొచ్చాడు ఓనాడు.

"ఏటి మావా? ఇన్నాళ్ళూ ఏమైపోనావు. ఒంటో బాగోనేదా ఏటి?" అని పలకరించింది పుల్లమ్మ- తనకోసం పెట్టుకున్న దుక్కల్లో రెండింటిని మర్రాకులో వేసి అందిస్తూ.

"నాకు బానే ఉంది. ఇంద ఇది తీసుకో ముందస్తిగా" అంటూ పేకెట్టు అందించాడు ఈశ్వరయ్య.

పుల్లమ్మ ఆత్రుతగా పేకెట్టు విప్పింది.

అందులో చెంగావి చీరని చూసింది.

"ఏటి మావా! టీ కొట్టు ఎత్తేసి సీరల ఏపారం పెట్టావేంటి?"

"లేదు! ఆ చీర నీకోసమే తెచ్చా" అన్నాడు అట్టుముక్క నోట్లో పెట్టుకుంటూ.

"ఏటి కత" అంది అనుమానంగా చూస్తూ.

"కోటగుమ్మం సెంటరు కాడ కాఫీ హోటేలు పెట్టా. నిన్నే మూర్తం చేశాం."

"అందుకోసమా ఈ బహుమతి" అంది చీర మడత విప్పి చూస్తూ.

"నువ్వు నాకు దెట్టిన దేవతవి. నీ అట్ల దుకాణమే లేకపోతే నేనింతోన్ని అయేవాడినా సెప్పు?"

ఆ సంగతి పుల్లమ్మకి తెలుసు. అయినా ఆమెప్పుడూ ఎదుటివాడు బాగుపడి పోతున్నాడని ఈర్ష్యపడే రకం కాదు.

ఒకప్పుడు డొక్కులా వుండే ఈశ్వరయ్య నాలుగురాళ్ళు సంపాదించుకుని ఓ మనిషయ్యాడు. ఎప్పుడూ నీరసంగా మూలుగుతుండే అతనికి డబ్బుతో బాటు కండలు తిరిగిన ఒళ్ళు చేసింది. మనిషిలో దర్జా పెరిగింది. ఊళ్ళో పలుకుబడి సంపాదించుకో గలిగాడు.

"అయితే ఈ రేవొగ్గేసి ఆ కాఫీ హోటేలు కాడే కూకుంటావన్న మాట ఇకమీద."

"ఆ హోటేలు నా బామ్మరిది చూసుకుంటాడు. రేపటి నుంచీ మామూలే. నిన్ను చూసుకుంటూ ఈ రేవుకాడే వ్యాపారం చేసుకుంటా."

మాటల్లో కాస్త జోరు పెరిగిందేమిటి చెప్మా అనుకుంది పుల్లమ్మ.

"ఆ హోటేలు కిదే హెడ్డాఫీసు" అన్నాడు ఆకు ఊద్చేసి వేళ్ళు చప్పరిస్తూ.

"ఊళ్ళో గొప్ప హోటేలు ఎట్టుకొని ఈ సెట్టుకింద కూకుంటానంటావేటి యిడ్డూరం."

"నీ కోసమే." కాస్త జంకుతూ అన్నాడు తనలోతను అనుకుంటున్నట్టు.

"ఎవరైనా ఇంతే నవ్విపోతారు" విసురుగా అంది- సరంజామా సద్ది మెట్లు దిగుతూ.

"అవును పుల్లమ్మా, నిన్ను చూడకుండా వుండలేను. ఇక రేవు నొక్కక్షణం వదలను" అన్నాడు తనూ మెట్లు దిగుతూ.

గోదాట్లో మూడు మునుగులూ మునిగి నీళ్ళు పుక్కిలిస్తూ అంది.

"నువ్వు గొప్పోడి వయ్యావని సంబరపడాలో, ఎదవ బుద్దులొచ్చాయనీ జాలిపడాలో తెలియడం లేదు నాకిఁకాల."

"చూడు పుల్లమ్మా నీకెవ్వరూ లేరు. నీ పెనిమిటి ఎప్పుడో నిన్నొది లేశాడు. ఎలాగా తిరిగి రాడు" అని ఏదో చెప్పబోయాడు.

"ఓహో! అందుకే నేనలుసై పోనానన్న మాట."

"ఛ ఛ! అదికాదు. నువ్వు వంటరిగా ఎన్నాళ్ళని వుంటావు."

"నా పాణం పోయేదాకా."

"ఐదురూపాయల సంపాదన కోసం నువ్విలా కష్టపడుతూ వయసు కర్చు చేసేసు కుంటావా పుల్లమ్మా."

"మరేటి సేయమంటావు. జమిందారేదైన దొరకుతాడేమో సూసుకొని కట్టుకోమంటావా?" అంది వెటకారంగా.

"నువ్వు నాతో సెయ్యి కలిపితే ఏడాది తిరక్కుండా నిన్నే జమిం దారిని సేసేత్తాను. నువ్వు నాతో వుండిపో పుల్లమ్మా."

పుల్లమ్మ నిర్ఘాంత పోయింది. ఈశ్వరయ్య ఇంతిలా తెగిస్తాడను కోలేదు.

"మరి నేను నీతో కూకుంటే, నువ్వు కట్టుకున్నావే అది, అది ఏడ కూకుంటుంది?" సూటిగా అడిగి చూసింది.

"దాని సేతిలోహోటలెట్టేసాగా, అది అక్కడే కూచుని వ్యాపారం చూసుకుంటుంది. ఇక నా జోలికి రాదు."

"కనుక నేను నీతో లంజరికం ఉండాలంటావు."

"ఛ ఛ! అలా అనకు. నిన్ను సుఖపెడతా. బతికినన్నాళ్ళూ ఇద్దరం కలిసుందాం."

"నాకూ ఓ పరువంటూ వుంది. నేను సాటుమాటు ఎవ్వారాలు సేయను. నీ ఆలి తన తాళి తెంపి సాయంగా నీ సేత నాకు కట్టిస్తుందేమో, అడిగిసూడు అప్పుడాలోసిద్దారి." అంది బుడుంగున మునిగి దూరంగా ఈదుకుంటూపోతూ.

నిజానికి పుల్లమ్మ ఉన్న పరిస్థితిలో ఎవరికైనా కావలసింది ఒక మగాడి అండ. కాని అట్లు వ్యాపారం ద్వారా సంపాదిస్తున్న పలుకుబడి ఆమెకి బోల్డంత అండగా నిలిచింది.

పుల్లమ్మ నుంచుకొని సుఖపడాలన్న కోరిక మరింత గట్టిపడి రోజూ సమయంచూసి కాళ్ళావేళ్ళా పడసాగాడు ఈశ్వరయ్య.

అర్థంలేని మందహాసం, కొరకొర చూపులు, కాండ్రించిన ఉమ్మి ఈశ్వరయ్యకు పుల్లమ్మ ఇచ్చే సమాధానాలు.

ఎప్పటికయినా సూర్యుడు పడమరన ఉదయించకపోతాడా అన్న ఆశతో రేవులోనే దేవుళ్ళాడుతూ పట్టువిడవని విక్రమార్కుడిలా పుల్లమ్మ కోసం ప్రయత్నిస్తూనే ఉన్నాడు ఈశ్వరయ్య.

* * *

ఒకనాడు రైల్లో ప్రయాణం చేస్తున్న జిల్లా ఆఫీసరుగారికి గోదావరి బ్రిడ్జిమీంచి పుష్కరాల రేవు కనబడింది.

ఆయనతోబాటే నగర ఆఫీసరు, పొలిమేర ఆఫీసరు కూడ ప్రయాణం చేస్తున్నారు. వీరంతా పన్నులు వసూలుచేసే టాక్సు డిపార్టుమెంటువారు.

నగరంగారూ, పొలిమేరగారూ గోదారిస్టేషన్లో దిగిపోవాలి. కనుక పెట్టె. బేడ సర్దుకుంటున్నారు.

జిల్లాగారు మట్టుకు కాకినాడలో దిగాలి. నిద్రపొద్దై వీళ్ళతో పాటే ఆయనా లేచి కూర్చున్నారు.

ఎదాలాపంగా రైల్లోంచి చూస్తే అలా పుష్కరాల రేవు కనబడింది.

చటుక్కున పుల్లట్లు జ్ఞాపకం వచ్చాయి.

"రేవులో పుల్లట్ల దుకాణం ఇంకా ఉందా?" అని అడిగాడు ఆ ఇద్దర్నీ జిల్లాగారు.

"ఉంది సార్!" అన్నారు నగరంగారు.

"మునుపటికన్నా అట్ల రుచి మరింత పెరిగింది సార్." అన్నాడు పొలిమేరగారు.

"మీరిక్కడ దిగి, పుల్లట్ల రుచి చూడండి సార్. తరువాత నా జీపులో కాకినాడ వెళ్ళొచ్చు" అని మొహమాటానికి సలహా ఇచ్చాడు నగరం గారు.

జిల్లాగారు అదివరలో పుల్లట్లు మరిగిన బాపతు. కనుక జిహ్వా లాగేయడం మొదలెట్టింది.

స్టేషన్‌లో రైలాగింది.

ఆ ఇద్దరూ దిగిపోయారు. వెళ్ళివస్తాం సార్ అంటూ కంపార్టు మెంటులోకి చూశారు.

జిల్లాగారు అక్కడ లేరు.

చుట్టూ వెతికారు.

తమకన్నాముందే ఆయన సూటు, బూటు తగిలించుకుని రైలు దిగిపోయారని తెలుసుకొని ఆశ్చర్యపోయారు. ఆయన్ని ప్లాట్‌ఫారం మీద చూసి,

జిల్లాగార్ని రేవు పక్కనే ఉన్న మూడంతస్తుల హోటల్లో దించి, "ఎనిమిది కొట్టగానే వస్తాం. పుల్లట్లు తెస్తాం" అని ధీమాగా మాటిచ్చి శెలవు పుచ్చుకున్నారు నగరంగారూ, పొలిమేరగారూ.

"మీరు కూడా నాతోబాటు ఇక్కడే తిందురు కాని, రండి" అప్పనంగా ఆహ్వానించారు జిల్లాగారు.

'సై' అంటే 'సై' అంటూ రేవుకేసి పరుగెత్తారు. ఆ ఇద్దరూ అట్ల కోసం అడ్వాన్సు బుకింగుకి.

వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు తమ డిపార్టుమెంటు జూనియర్ సిబ్బంది యావత్తూ రేవులోనే కనబడింది పుల్లట్లు తింటూ. దాంతో అడ్వాన్సు బుకింగు బాదరబందీని సిబ్బందికి అప్పగించేశారు నగరంగారు, పొలిమేరగారు.

ఎనిమిదైంది.

ఆఫీసర్లందరూ హోటల్ గదిలో సమావేశమయ్యారు.

టాక్సు డిపార్టుమెంటు యావత్తూ తన హోటల్లో దిగడంతో లోన భయం పీకుతున్నా, పైకి హుందాగా అరడజను ట్రేలతో టిఫెన్లు పెట్టించి జిల్లాగారి గదిలోకి వచ్చాడు హోటలు ప్రొప్రయిటరు.

"ఇవేమీ వద్దు. జిల్లాగారు పుల్లట్లు రుచి చూస్తారుట. తరువాత కాఫీ పంపు మరుగాని" అన్నారు నగరంగారు.

ఇంద్రభవనంలాంటి హోటల్లోని సరకు కాదని రోడ్డు మీద పుల్లట్ల కోసం దిగజారిపోయినందుకు ప్రొప్రయిటరు ఆశ్చర్యపడి, చిన్న బుచ్చుకున్నాడు.

ఆయనతో బాటూ ట్రేల్లో టిఫెన్లు గూడా చిన్న బుచ్చుకున్నాయి.

"ఆ పుల్లట్లేసే అమ్మిని మీ హోటల్లో వంటలక్కగా కుదుర్చుకో గూడదూ. పుల్లట్లు ఈ హోటలుకి నావర్టీగా ఔతాయి" అని సలహాయిచ్చారు జిల్లాగారు.

"నాకూ అదే ఐడియావచ్చి యిదివరలో ఓసారి అడిగి చూశానండి. ఎయిర్ కండిషన్ డైనింగ్ హాల్లో ఎత్తుగా అరుగు కట్టిస్తే దానిమీద పొయ్యిలు పేర్చి అట్లువేసి పెడతానందండి. మరోలా కుదర్దందండి. హోటలంతా పొగచూరి పోతుందని భయమేసి ఆ జోలికి పోలేదండి," అని వెళ్ళిపోయాడు ప్రొప్రయిటరు.

ఎనిమిదిన్నరైంది.

"ఇంకా అట్లు రాలేదేంటి చెప్మా" అని పొలిమేరగారు ఆదరా బాదరా రేవులోకి వెళ్ళారు.

తొమ్మిదైంది. అట్లు ఇంకా రాలేదు.

నగరంగారికి కాళ్ళాడలేదు. ఈ వెళ్ళినవాడు ఏమైపోయాడు చెప్మా అంటూ కిటికీగుండా రేవులోకి చూశారు.

పుల్లమ్మ చుట్టూ పొయ్యిలమధ్య సూర్యకిరణాల్లా తమ సిబ్బంది యావత్తూ సాష్టాంగ పడివుంది.

"నెగండి బాబులూ, నెగండి, మీరు లచ్చ సెప్పండి ఆ గోదారమ్మ తల్లి దిగొచ్చి అడిగినాసరే నేను పార్శిలు కట్టనంటే కట్టను. మీ ఆఫీసర్లు గొప్పోరు, అంటున్నారు కనక ఆరికి నా కొంగు పరిసి, మర్యాదసేసి, డబ్బడక్కుండా పుట్టినే అస్లేసి పెడతా. వేగి రమ్మనండి."

"మహాతల్లీ! మమ్మి కాపాడు. నువ్వు పార్శిలు ఇవ్వకపోతే మా ఉద్యోగాలకు ఎసరు పెట్టినదానవవుతావు. మా పిల్లపాపల ఉసురు నీకు

అనవసరంగా తగులుతుంది. కనీసం ముక్కలైనా సరే ప్రసాదించి కటాక్షించు." అని వేడుకుంది సిబ్బంది.

"లాభం నేదు బాబులూ, మీరు నాకాడెట్టిన అరువంతా ఒగ్గేయ మంటే ఒగ్గేత్తాను. కాని పార్శిలు మటుకు కట్టను" అంటూ చేయెత్తి దణ్ణం పెట్టింది పుల్లమ్మ.

నిజానికి పుల్లమ్మ ఇంతవరకూ ఎవరి కోసం పుల్లట్లు పార్శిలు కట్ట లేదు. ఒకే ఒకసారి తన జీవితంలో విజయం సాధించిన అపూర్వ సంద ర్భంలో నాలుగు పుంజీల పుల్లట్లు పార్శిలు కట్టిన మాట మాత్రం నిజం. అదే మొదటిసారి, ఆఖరిసారి.

ఆనాడు ఉప్పొంగిన ఉత్సాహంతో అన్నగారికి ఓటేసి ఆయనే నెగ్గా లని ఆశించింది పుల్లమ్మ.

ఆశించినట్లే ఆ ఓటుతో ఆయన నెగ్గి పుల్లమ్మకి మనోఫలసిద్ధి గావిం చారు.

అలా తన జీవితంలో మొట్టమొదటిసారి అనుకున్నది అనుకున్నట్లు వెంటనే జరగడంతో అన్నగారి మీద అమిత గౌరవాభిమానాలు పెరిగి పోయాయి పుల్లమ్మకి.

అన్నగారి కోసం కట్టింది ఆ పార్శిలు.

హడావిడిగా కొట్టుమూసేసి ఎలక్షన్లలో పోలింగు బూతు నిర్వ హించిన స్థలానికి వెళ్ళి అన్నగారికోసం వెతికింది.

ఆయనిక్కడుండరు, హైదరాబాదులో ఉంటారు. కావాలంటే 'చండశాసనుడు' సినిమా కుమారిటాకీసులో ఆడుతోంది 'వెళ్ళి తెరపై ఆయన దర్శనం చేసుకోవచ్చు,' అన్నారు అక్కడివారంతా.

పరుగు పరుగున కుమారిటాకీసు కెళ్ళి బ్లాకులో టికెట్టుకొని హాలు లోకి దూరిపోయింది.

తెరమీద అన్నగారు ఒకేసారి రెండు పాత్రలలో కనబడ్డంతో రెట్టింపు ఆనందోత్సాహాలతో పుల్లమ్మ వొళ్ళు జలదరించింది.

అభిమానం ఉప్పొంగింది.

భక్తి పుట్టుకొచ్చింది.

చటుక్కున లేచి హాలుమధ్య రేకు కుర్చీ మీద నుంచుంది

కుడిచేత్తో పొట్లాన్ని పట్టుకొని మరో చేత్తో హారతిస్తున్నట్టు పొట్లాన్ని గిరగిరా తిప్పి తెరకు చూపించి నైవేద్యం పెట్టి కళ్ళకద్దుకుని అన్నగార్ని అంటుకోమంటూ పొట్లాన్ని గిరగిరా తిప్పి సాచి తెరమీదకి విసిరేసి చటుక్కున కూర్చుంది. ఇప్పటికీ హాల్లో తెరమీద అట్లమరక లున్నాయి.

ఆ అపూర్వ అట్లహారతి సంఘటన మినహా పుల్లమ్మ పార్శిలు మరెప్పుడూ కట్టలేదు.

జిల్లాగారికి, నగరంగారికి కడుపులో రైళ్ళు పరుగెత్తసాగాయి.

సిబ్బంది అయిపూ పత్తా లేరు.

నగరంగారి సహనం చచ్చింది. స్వయంగా తామే రేపుకి వెళ్ళాలని గది తలుపు తీశారు. గుమ్మం బయట ఓడిపోయిన సేన ముఖాలు వేళ్ళాడేసు కొని కనిపించింది.

విషయం గ్రహించారు, జిల్లాగారు.

వణికిపోతున్న సిబ్బందిని చూసి, "కంగారు పడకండి" అని అభయమిచ్చారు. ద్రాక్షపళ్ళలా పుల్లట్టు ఈపాటికి మరీ పులిసిపోయి

ఉంటాయి. కనుక అవి బాగుండవు అని మనసు కుదుట పరచుకుని, "ఇక మీరెళ్ళి మీ డ్యూటీ చేసుకోండి," అని అందర్నీ పంపించేశారు, నగరంగార్ని మటుకు ఉండమని.

హోటలు వాడికి ఫోను కొట్టి వడా, ఇడ్లీ పంపించమన్నారు జిల్లా గారు.

"సారీ సార్! టిఫెన్ సెక్షన్ కట్టేశాం. కాఫీ పంపిస్తున్నాం" అన్నాడు హోటలువాడు.

మండిపోతూ కిటికీకేసి నడిచారు జిల్లాగారు.

"ఇదిగో నగరం, ఇలా వచ్చి చూడు."

నగరంగారు కిటికీలోంచి చూశారు.

"ఇప్పుడా రేవులో ఎంతమంది ఉన్నారంటావ్."

"ఏభైకి తక్కువ కాకుండా ఉంటారండీ."

"రోజో ఎంత మందొస్తారు అక్కడికి!"

"సుమారు నాలుగొందలు పై మాటేనండి."

"ఒక్కొక్కడు ఎన్నట్లు తింటాడు మామూలుగా?"

"సగటున నాలుగు చూసుకోండి."

"అంటే రోజుకి పదహారు వందల అట్లన్నమాట."

"మరే!" అంటూ బుర్రగోక్కున్నాడు నగరంగారు.

"అట్లు ఒక్కింటికీ చచ్చు పావలా వేసుకున్నా రోజుకి నాలుగు వందల రాబడి కనుక నెలకెంతైంది?"

"పన్నెండు వేలు."

"ఏడాదికి?"

"నూట నలభై నాలుగు వేలు."

"అంటే లక్ష దాటిందన్న మాట. మరి టాక్సు ఎంత వసూలు చేస్తున్నారు?"

నీళ్ళు నమిలారు నగరంగారు.

సర్రుమని లేచిపోయారు జిల్లాగారు "యాభై వేలు దాటిన వ్యాపారానికి టాక్సు వేయాలన్న జ్ఞానం మీకు లేదా ? మీ ఆఫీసు ముందరే ఇలా లక్షలమీద వ్యాపారాలు జరిగిపోతుంటే కళ్ళు మూసుకు కూర్చుంటున్నారన్నమాట. నేను కాకినాడ ప్రయాణం మానేశాను. మీ ఆఫీసు ఇప్పుడే చెక్ చేస్తాను పదండి."

"అయ్యబాబోయ్, అంతపని చేయకండిసార్. ఏదో పిల్లలుగల వాళ్ళం. మీ కెందుకు సాయంత్రంలోగా పుల్లమ్మ వ్యాపారానికి ఎసెస్ మెంటు చేయించి ముక్కుపిండి టాక్సు వసూలు చేయిస్తాను" అని గారంటీ యిచ్చి జిల్లాగారిని శాంతపరచారు నగరంగారు.

♦ ♦ ♦

పుల్లమ్మ కొట్టు సర్దేసి వొళ్ళు విరుచుకుంది.

ఈశ్వరయ్య పుల్లమ్మ వొళ్ళు విరుపుల్లోని సొయగాలు దొంగచాటుగా చూస్తున్నాడు.

చంకలో ఫైల్సు, చేతిలో రికార్డులు పట్టుకుని టాక్సు ఆఫీసు సిబ్బంది పుల్లమ్మ ఎదురుగా ప్రత్యక్షమయింది.

"ఏటిబాబు? ఆఫీసరుగోర్ని నాకొట్టుకాడకి తీసుకొస్తున్నారా? దుక్కపండే మిగిలింది. మీరు సై అంటే పొయ్యంటించి యేత్తాను కూకోండి."

"మేం కూర్చోడానికి రాలేదు. నీ కొట్టుమీద పన్నేయడానికి వచ్చాం."

"ఇంటీకి సున్న మేత్తాం, రంగులేత్తాం, అంటూ తిరిగేవోళ్ళని సూసానుగాని, కొట్టుకి పన్నేత్తాం అనోళ్ళడ్ని సూళ్ళేదు, పన్నేయడమంటే ఏటి సేత్తారు బాబు?"

"పన్నంటే టాక్సు. నీ పుల్లట్ల మీద టాక్సు పడింది."

"ఏటి? పొద్దుగాల మీరు తిన్నట్లమీదే పడిందా బాబు. టాక్సు అంటే కాకి రెట్టన్నమాట. ఈ సెట్టునిండా ఎదవకాకులే. మొన్నిలాగే వో గేటు కీపరుగారి అట్టులో కాకి రెట్టేసినాది. "ఏటి పుల్లమ్మ. పచ్చళ్ళో సున్నం గాని కలిపావా, మా సెడ్డ గాటుగా వుంది" అన్నాడండి. నా కప్పుడే అరద మయింది. కాని అసలు యిసయం సెప్పేత్తే వోంతి సేసుకుంటాడని ఆ అట్టాగేయమని యింకో అట్టు పుత్తినే ఏసాను బాబు. మీ కట్టా జరిగిందని ఎరుకలేదు నాకు—రేపు సెరోఅట్టు మదరా యిస్తానులెండి."

ఈశ్వరయ్య వీళ్ళందర్నీ చూసి ఏదో గొడవయ్యేలాగుందని చెట్టు చాటున నక్కాడు.

"నీ వ్యాపారం సాలుకి లక్షరూపాయలు దాటింది, కనుక నువ్వు గవర్నమెంటుకి కొంత సొమ్ము కట్టాలి. అది కట్టించుకోడానికే వచ్చాం!"

"అయ్యబాబోయ్, నా యాపారం ఏటి? లచ్చ ఏటి? మీరు సెప్పేది నాకర్థమవడంలేదు బాబు. పోనీ నేనే మీ ఆఫీసుకాడకొచ్చి అక్కడే పొయ్యెట్టి అట్లేసెత్తా పదండి బాబూ."

"అక్కర్లేదు, నువ్వో పారంలో సంతకం పెట్టి పదిహేను రూపాయలు కట్టు. నీ కొట్టు రిజిష్టరు చేస్తాం. ఆనక నీ చిట్టా ఆవర్జాను మాకు పంపితే లెక్కలు కట్టి టాక్సువేసి నీ దగ్గర డబ్బులు వసూలు చేస్తాం."

"ఈ కూలిదానికాడ పారాలు సేసుకోడానికి డబ్బు లేడుంటాయి బాబు. రోజూ ఈ ముంతలో పడ్డ సిల్లర్లో అయిదు రూపాయలే తీసి

కొంగున ముడేసుకుంటున్నాను. మిగతా సొమ్మంతా పిండికి, నూనె నెయ్యికీ, పుల్లలకి సరిపోతుంది. ఎప్పుడైనా పైసిల్లర మిగిత్తే గోదారితల్లి పేర్సెప్పి ఆ గోపాలసామి డబ్బీలో ఏసేత్తున్నా" లబోదిబోమంది పుల్లమ్మ.

"లక్ష పైచిలుకు వ్యాపారం చేస్తున్నదానికి సగంపైగా మిగలాలి. నువ్వు కూలిదాని వెట్టా అవుతావు!"

"మీరన్నట్టు సంపాదించుంటే ఈ పాటికి పొయ్యికో అంతస్తుకాడికి షేడ లేపుండేదాన్ని బాబు! నా గుడిసె కాడ కొచ్చి చూడండి. తాటాకు మార్చి ఎన్నేళ్ళయిందో."

"నువ్వు కట్టకపోతే నీ కొట్టు మూయించేయాల్సొస్తుంది."

"అట్టా సేత్తే మీకు డబ్బులొత్తాయా బాబు."

"రాకపోవచ్చు. కాని టాక్సు ఎగపేయడం నేరం. అందుకే ఆ శిక్ష"

"నన్ను సదువురాని దాన్ని సేసి, నాకన్నాయం సేత్తారా బాబు. మా పేట్లో మంగాయమ్మ పొగాకు కంపెనీలో పనిసేసి రోజుకి పదిహేను తెచ్చుకుంటుంది. అది కట్టని సొమ్ము నేనెందుకు కట్టాలి బాబు! నా మీద ఇలా కచ్చ తీర్చుకుంటారా బాబూ!" అంటూ భోరుమంది.

కొంపతీసి పుల్లమ్మ ఈ దెబ్బకి దుకాణం ఎత్తేస్తుందేమోనన్న అనుమానం వేసింది సిబ్బందికి. మళ్ళీ ఇలాంటట్లు దొరకవేమోనని భయం కూడా వేసింది. దాంతో కాస్త తగ్గారు.

"చూడమ్మా! నువ్వు ముందుగా ఈ కాగితంమీద సంతకం పెట్టు. డబ్బు సంగతి మేం చూసుకుంటాం. ఆనక నీ బాకీలో మినహాయించుకోవచ్చు. నీ వ్యాపారాన్ని రిజిష్టరు చేయకపోతే మాకు మాటొస్తుంది."

"బాబుగారు, నాకు తెలీక అడుగుతా, ఈ కూలి డబ్బుల్లో వాటా గవరమెంటు ఏం సేసుకుంటుంది బాబు."

"నీలా అందరూ ఇచ్చే రూపాయిలతోనే ఈ దేశం నడుస్తోందమ్మా. నువ్వు కట్టిన రూపాయిలో ప్రతి పైసా మళ్ళీ నీ కోసమే ఖర్చు పెడుతుంది గవర్నమెంటు"

"అయితే నా డబ్బులు నాకిచ్చేత్తారా బాబూ."

"నీకు రోగం వస్తే నయం చేసుకోడానికి ధర్మాసుపత్రి నీకు రక్షణ కల్పించడానికి పోలీసుశాఖ, నీ కన్యాయం జరిగితే న్యాయం చేకూర్చడానికి కోర్టులు వగైరాలు అన్నింటికీ నువ్విచ్చిన పైసల్నే ఖర్చుచేస్తుంది గవర్నమెంటు."

"రోగంవస్తే సచ్చినా ధర్మాసుపత్రికి పోను, పోలీసోళ్ళ వూసంటేనే నాకు భయం. నాయంకోసం ఈ జనమలో కోర్టుకెల్లను. నన్నొగ్గేయండి బాబూ."

"ఈ చుప్పనాతి వాద్దింపులు కట్టిపెట్టి ఈ కాగితం మీద సంతకం పెట్టు."

"నన్నాలోసించుకోనీండి బాబూ."

"సరే! సాయంత్రం నాలుగు గంటలదాకా టైమిచ్చాం. బాగా ఆలోచించుకో. నీ వ్యాపారం సాగాలంటే ఈ కాగితంమీద సంతకం పెట్టాలి. నాలుగ్గంటలకి మళ్ళీ ఇక్కడికొస్తాం" అంటూ కదిలింది సిబ్బంది.

పుల్లమ్మ అయోమయంలో పడింది. ఏమీ తోచక రావిచెట్టు చపటా మీద చతికిలబడింది.

చెట్టు వెనకాలే నక్కిన ఈశ్వరయ్య పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ పుల్లమ్మ దగ్గర కొచ్చాడు.

"చూడు పుల్లమ్మా, నువ్వు ఈళ్ళతో అనవసరంగా గొడవెట్టుకున్నావు. ఇప్పుడు నీ కొట్టు రిజిస్ట్రీ సేత్తే అణాపైసలతోసహా యీళ్ళకి

లెక్కలు సెప్పాలి. అది నీకెట్టా సాధ్యం. ఇంకానయం వాళ్ళకన్ను నామీద పళ్ళేదు. రేపోమాపో నన్నుగూడా పట్టుకుంటారు. ముక్కుపిండి డబ్బులు గుంజుతారు. ఇక నేనీ రేవుకి రాను. ఇన్నాళ్ళూ నీకోసం వచ్చాను. నువ్వు ఎప్పటికయినా 'ఊఁ' అంటావేమోనని ఆశపడ్డాను. చూడు పుల్లమ్మా, సాయంత్రం నాలుగ్గంటల్లోగా నాకు తేల్చిసెప్పేయి. నువ్వు నాతో వుంటావో ఈళ్ళ లావాదేవీల్లో యిరుక్కుంటావో" అని ఖచ్చితంగా చెప్పేసి కదిలాడు ఈశ్వరయ్య.

పుల్లమ్మ భారంగా లేచింది. ఎదురుగా గోదావరి కనబడింది. బరువుగా అడుగులేస్తూ మెట్లు దిగింది.

గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ గోదాట్లో కాలు పెట్టింది.

*　　*　　*

పుల్లమ్మకి తన పుట్టు పూర్వోత్తరాలు తెలియవు. పుట్టి బుద్ధెరిగాక తనకి తెలిసిన వ్యక్తులు పెంచిన రాజయ్య, రత్తాయమ్మ, తనతో పెరిగిన సారిగాడు.

"గోదాట్లో కొట్టుకొచ్చిందీ పిల్ల. బొబ్బరలంకకాడ ఒంటరిగా కూకుని ఏడుత్తుంటే సేరదీసి, మేం పెంచుకుంటున్నాం" అని రత్తాయమ్మ అంటుంటే వినడం మినహా, తనగురించి మరేమీ తెలియదు పుల్లమ్మకి.

పుల్లమ్మని చేరదీశాక రాజయ్య దశ మారింది. అద్దెరిక్షా బదులు సొంతరిక్షా కొన్నాడు. మురికిపేటలో తను అద్దెకున్న గుడిసె, కంచెవేసిన స్థలం తన సొంతమయింది. ఈ అదృష్టమంతా పుల్లమ్మే తెచ్చిపెట్టిందని రత్తాయమ్మ నమ్మింది. పుల్లమ్మని తన సారిగాడికిచ్చి కోడల్ని చేసుకోవాలనుకుంది.

పుల్లమ్మకి ఎప్పుడూ ఏదో వ్యాపకం వుండాలి. చిన్నప్పుడు తన

ఈడు పిల్లల్ని పోగేసి ధర్మాసుపత్రిగేటు దగ్గిర, కోటిపల్లి బస్టాండులోను, గుమ్మం సెంటరులోను పశుజాలం బాపతు పేడ పోగేసి పుష్కరాల రేవుకి పట్టించి కనబడ్డ రాయి రప్ప, చెట్టు చేమల మీద పిడకలద్దించేది.

పిడకలమ్మగా వచ్చిన డబ్బుని అందరికీ సమానంగా పంచేది.

ఆ రోజుల్లో హీరోల సినిమాలు రిలీజైనప్పుడు పేడకి బాగా గిరాకీ వుండేది. అన్ని అభిమాన సంఘాలకీ పుల్లమ్మ ముఠాయే హోల్ సేల్‌గా పేడముద్దలు సప్లై చేసేది.

అలాగే అప్పుడప్పుడూ, వాల్పోస్టర్లకి పేడకొట్టే కాంట్రాక్టు గూడా తీసుకుంది.

సంక్రాంతి రోజుల్లో సినిమాలక్కీ, భోగిపిడకలకే గాక, గొబ్బెమ్మలకి గూడా పేడకావాలి గనుక పేడకి గిరాకీ మరీ ఎక్కువుండి రాబడి పెరిగేది. ఆ డబ్బుతో ముఠా యావత్తుకూ కొత్తబట్టలు వచ్చేవి. అలాగే తనతో బాటుగా సారిగాడికి గూడా కొత్తబట్టలు కొనేది.

అలా పుల్లమ్మకు చిన్నప్పటినించీ ప్రయోజకత్వం అలవడింది.

పుల్లమ్మకి పవిటీడు రాగానే పంచకళ్యాణి ఎదిగిపోయింది. ఈడుకి తగ్గ జోడుగా సారిగాడు కూడ ఎదిగాడు.

రాజయ్య రిక్షాకి గవర్నమెంటు ఉద్యోగంలా స్థిరమైన రాబడి వుంది. బాబూరావనే కానిస్టేబులు రాజయ్య రిక్షాని నెలవారీగా కుదుర్చుకున్నాడు.

బాబూరావుకి చాల ఖచ్చితమైన మనిషని పేరు. ఎప్పుడూ దేనికీ చేయిచాచేవాడు కాదు.

ఊరిలో రెండువందలకి పైగా బ్రాకెట్టు కంపెనీలున్నాయి. సాయం

కాలం నాలుగు వీధులూ తిరిగితే సులాగ్గా బాబూరావు రోజూ రెండు వందలు రాబట్టుకోవచ్చు. కాని అలాంటి పరువు తక్కువ పనులు చేయడు.

చీకటి పడగానే రాజయ్య రిక్షా ఎక్కి ప్రతి బ్రాకెట్టు కంపెనీకి వెళ్ళి, రూపాయి లగాయితూ పదిరూపాయలు దాకా అప్పెట్టి ఆ అప్పుతోనే వాళ్ళ దగ్గరే బ్రాకెట్టు కాసేస్తాడు. నోటికొచ్చిన నెంబర్లు అన్ని చోట్లా కాసేయడంతో రెండో ఆట విడిచేలోగా ఎక్కడో ఏదోతగిలి, అప్పుతీరగా రోజుకి అయిదువందలు తక్కువ కాకుండా చేతిలోకి వచ్చేది అతనికి.

పోలీసు స్టేషన్లో ఏదైనా ఖర్చువుంటే దానికి బాబూరావే రాజ పోషకుడు. కనుక స్టేషన్‌లో అతనికున్న పలుకుబడి మరి ఎవరికీ లేదు.

కొన్నాళ్ళకి డ్యూటీ దిగ్గానే శ్రమ పడి రోజూ యిలా స్వయంగా తిరగడం దండగనిపించి తను చేయవలసిన పని యావత్తూ రాజయ్యకే అప్పగించేశాడు. అలా బాబూరావుకీ రాజయ్యకీ అవినాభావ సంబంధం ఏర్పడింది.

అది కాస్త ముదిరి బాబూరావు, రత్తాయమ్మ మధ్య కూడా మరో రకమైన సంబంధానికి దారితీసింది.

అలా రాజయ్యని బ్రాకెట్టు డ్యూటీకి పంపేసి, ఇలా చాటుగా రత్తాయమ్మ గుడిసెలోకి దూరిపోయేవాడు బాబూరావు.

ఈ విషయం పసిగట్టిన పుల్లమ్మ తన గౌరవానికి భంగం రాకుండా సూసుకోవడానికి అక్కడే మరో గుడిసె తనకోసం అద్దెకి తీసుకుంది.

ఆ పంచనే సారిగాడు కూడా ఉంటున్నాడు.

సారిగాడికి కాబోయే పెళ్ళాంలా వాడి బాగోగులు పుల్లమ్మే చూసుకుంటుంది.

అలాగే పుల్లమ్మకు కాబోయే మొగుళ్ళా సారిగాడు దానిమీద పెత్తనం చెలాయిస్తున్నాడు.

సారిగాడు కోడి పందాలంటే పడిచస్తాడు. ఎక్కడయినా పందెం జరిగితే చాలు, పుల్లమ్మను బెల్లించి చిల్లరట్లుకు పోయేవాడు.

కాకి, డేగ, పర్ల, నెమలి లాంటి జాతికోళ్ళసూ, బెరస, జింగిణీ, అసిళ్ళాంటి పిరకోళ్ళని ఎప్పటికయినా సంపాదించి పెంచాలన్నదే వాడి జీవితాశయం.

పగటిపూట తండ్రి రిక్షా ఖాళీ ఉన్నప్పుడల్లా తొక్కి, నాలుగు రాళ్ళు పోగేసి, మామూలు పుంజుల్ని కొన్నాడు. వాటిని బాగా మేపి, బానల్లో బంధించి పెట్టాడు. అలా బంధిస్తే కోళ్ళకి పౌరుషం పెరిగి బాగా దెబ్బలాడతాయిట.

కాబోయే పెళ్ళాం దగ్గరున్నా, సారిగాడి దృష్టంతా కోళ్ళ పెంపకం మీదే.

కాబోయే మొగుడు దగ్గరున్నా పుల్లమ్మ దృష్టంతా పిడకల వ్యాపారం మీదే.

పొగాకు కంపెనీలో పనిజేసే మంగాయమ్మ అనే మిసమిసలాడే ఓ పడుచు, సీజను అయిపోయాక పురికిపేట సెంటర్లో గానగ చెట్టుకింద కొత్తగా పుల్లట్ల దుకాణం పెట్టింది.

దాంతో పేటలోని యువజనాభా యావత్తూ రోజూ పొద్దున్నే, ఆ కొట్టు మీదకి ఎగబడసాగారు.

వాళ్ళతో బాటే సారిగాడు కూడా ఆ కొట్టుని మరిగాడు.

ఎప్పుడూ నవ్విస్తూ సరసాలాడుతూ ఉంటాడని సారిగాడి కప్పిచ్చి అట్లు పెట్టేది మంగాయమ్మ.

సారిగాడు ఆ మంగాయమ్మ ఉచ్చులో పడిపోతున్నాడన్న భయ మేసింది పుల్లమ్మకి.

అందుకోసం పోటీగా తనూ ఓ పుల్లట్ల కొట్టు అక్కడే పెట్టింది. తన కొట్టులోనే అట్లు తినమని శాసించింది సారిగాణ్ణి.

పుల్లట్లే బాగున్నాయి అంది పేట జనాభా.

సారిగాడు కూడా ముప్పొట్లా ఆ అట్లే తిన మరిగాడు.

సారిగాడు ఒకరి జోలికి పోడు. తన కోళ్ళ వ్యవహారం మినహా మరో ప్రపంచంతో పనిలేదు వాడికి.

మంగాయమ్మ బరితెగించిన బాపతు. ఇష్టపడితే అయిస్కాంతంలా ఆకర్షింపచేస్తుంది ఎవరినైనా.

మంగాయమ్మ కళ్ళు వాడిమీద పడ్డాయేమోనన్న భయంతో సారి గాడినే అంటిపెట్టుకుని వాణ్ణి తన గుప్పెట్లో వుంచుకోడానికి సతమత మవుతోంది పుల్లమ్మ.

*　　　　*　　　　*

రత్తాయమ్మ కేదో రోగమొచ్చి ఒకరోజు ఉన్నట్టుండి హఠాత్తుగా హరీమంది.

దాంతో రాజయ్య వంటరి వాడై పోయాడు.

వాడి తిండీ తిప్పలు చూడ్డానికి పుల్లమ్మ తిరిగి రాజయ్య పంచన చేరింది.

కొన్నాళ్ళు గడిచాయి.

ఓ సారందరూ పుల్లమ్మను చుట్టుముట్టి, నీకు ఈ రేతిరికే పెళ్ళని చెప్పారు.

పుల్లమ్మ తబ్బిబ్బైపోయింది.

గుడిసె బైటకి రావడానికి సిగ్గేసింది.

బయట అంతా సందడిగా వుంది.

బాబూరావు పెళ్ళేర్పాట్లన్నీ చూస్తున్నాడు.

గుడిసె ముందు షామియానా వేశారు.

మైకుపెట్టి పేటంతా హోరెత్తించేశారు.

దడివారే గాడి పొయ్యి తవ్వించి, గుండిగ లెక్కించేశారు.

వీధి బల్లలు తెప్పించి చుట్టూ పరిచారు.

రామడోలు మేళంవాళ్ళు ఓ దరువేసి హాజరు వేయించుకొని ఓ మూల చతికిలబడ్డారు.

ఎదిగిన పిల్లలు చంటి పిల్లల్ని చంకనేసుకుని విడ్డూరం చూడ్డాని కొచ్చేశారు.

వీధిలో కుక్కలు హడావిడి చేస్తున్నాయి.

ఎక్కడ చూసినా పెళ్ళి సందడి.

ఇవన్నీ చూసిన పుల్లమ్మకి వొళ్ళంతా పులకరించింది.

సారిగాడు కనబడ్డేమిటి చెప్మా, మట్టిగోడల్లో చిల్లు పెట్టి, పొంచి పొంచి చూసింది గుడిశెబయట ఎక్కడైనా కనబడతాడేమోనని.

ఆడికీ పెళ్ళిగదా. సోకు సేసుకోడానికి పోయుంటాడు. సారి గాడెంతో బాగుంటాడు. ఆడంత కైపుగాణ్ణి మనువాడ బోతున్నానని ఎప్పుడూ కుళ్ళి సచ్చేది మంగాయమ్మ. ఈయాళ తేలిపోతుంది. ఆడెంత ....సీ! పాడు అని చేతుల్తో కళ్ళు కప్పేసుకుంది పెళ్ళికూతురులా సిగ్గు పడుతూ.

పొద్దుకూకేలోగా పేట జనాభా అంతా గుడిసె చుట్టూ మూగేసింది.

పొరుగింటి పున్నమ్మ, పక్కింటి పకీరమ్మ, వీధిచివర వరాలమ్మ పుల్లమ్మని తీసుకెళ్ళి తలంటోసి తీసుకొచ్చారు.

మంగాయమ్మ పుల్లమ్మని ముస్తాబు చేసింది.

పుల్లమ్మలాంటి చక్కని చుక్కకు ముస్తాబో లెక్కకాదన్నారు ముస్తాబు చేస్తున్న అమ్మలక్కలు.

ఈ గుడిసెలో నిలువుటద్దం ఉంటే బాగుణ్ణు చూసుకోడానికి, అనుకుంది పుల్లమ్మ.

వీళ్ళంతా బయటకి పోతే బావుణ్ణు బొట్టు పెట్టెలో వున్న అద్దంలో చూసుకోవచ్చు.

గుమ్మంలో రామడోలు మోగింది.

మైకులో మంత్రాలు వినబడ్డాయి.

బయటంతా హడావిడిగా ఉంది.

బాబూరావు కంజాయింపు కేకలు వినబడుతున్నాయి.

మొగుడొదిలేసిన కాసులమ్మ నైలాను చీరతో సింగారించుకొని గుడిసెలో కొచ్చింది. "నెగండి, నెగండి ప్రైమె పోనాది. పుల్లమ్మ సెల్లిని పీటమీద కూకోపెట్టాలి" అంటూ తైతక్కలాడింది.

పుల్లమ్మకు సిగ్గు ముంచుకొచ్చి ముడుచుకు పోయింది.

బలవంతాన ఇద్దరమ్మలక్కలు లేవదీసి నడిపించారు.

తలొంచుకుని పెళ్ళికూతురిలా నడిచింది.

దభిమని పొట్టి గుమ్మాన్ని ఢీ కొట్టింది.

తల దిమ్మెక్కి నుదుటి మీద బొప్పికట్టింది.

"సంసారం సైబోతున్నావు. సూసుకుని నడాల, అడుగడుక్కి ఇలాగే బొప్పిలు కడతాయి మరి" స్వానుభవం చాటి నవ్వేసింది కమలమ్మ.

అది విని అమ్మలక్కలు నవ్వారు.

అందరితో బాటు తనూ నవ్వింది పుల్లమ్మ- నెప్పిని ఖాతరు చేయ కుండా.

రామడోలు మేళం మనస్సును మరింత పెళ్ళిమయం చేసింది.

నేలనే చూస్తూ అడుగులేస్తూ పీట చేరింది.

వయ్యారంగా చతికిలబడి, పమిట సర్ది కొంగు బిగిస్తూ రెప్పపాటు ఇటూ, అటూ చూసింది.

తన ముందొక తెర వుంది.

తెర అవతల సారిగాడు.

చుట్టూ అరివేణి కుండలు స్తంభాల్లా వున్నాయి.

షామియానా అంతా మామిడాకు తోరణాల్తో నిండిపోయి వుంది.

పక్కనే గాస్‌లైట్ వెలుగుతోంది.

దడివారే వార్చిన గుండిగల్లోంచి ఆవిరి సెగలు వస్తున్నాయి.

ఇంతలోనే అన్ని ఏర్పాట్లు ఎలా జరిగాయూ అని ఆశ్చర్యం వేసింది పుల్లమ్మకు.

తన పెళ్ళి ఇంత ఘనంగా జరుగుతుందనుకోలేదు.

తననూ, సారిగాణ్ణి కలపడానికే యీ సంబరం.

వొళ్ళు జలదరించింది.

సిగ్గు ముంచుకొచ్చింది.

దించిన తల ఎత్తకుండా కాలికంటిన పారాణిని గెలుకుతూ కూర్చుంది.

మంత్రాలు, వాటితోపాటు రామడోలు తారస్థాయి నందుకున్నాయి.

సారిగాడు తన ముందు నుంచున్నాడు.

కొత్తజోడు, తెల్లపైజమా మెరిసిపోతున్నాయి.

'వీడిసోకు యిద్దై పోను.,' నవ్వొకుంది.

తెల్లలాల్చీ చేతులు ముందుకొచ్చాయి.

బంగారు తాళి కంట్లో మెరిసింది.

క్షణంలో భుజంమీద కితకితలు.

మెడమీద వేళ్ళ గిలిగింతలు.

మూడు ముళ్ళూ పడ్డాయి.

ధైర్యం చేసి మొగుడి ముఖంలోకి చూసింది.

పిడుగు పడ్డట్టు కొయ్యబారింది.

తనకు తాళికట్టింది సారిగాడు కాదు.

సాక్షాత్తూ రాజయ్యగాడు.

దవళ్ళు జారిపోయి గుడ్లప్పగించి చుట్టూ చూసింది.

దూరంగా సారిగాడు మంగాయమ్మ భుజంమీద మోచెయ్యి ఆనించి, తనకేసి చూసి నవ్వాడు.

ఇందాక తగిలిన బొప్పిలాంటి వేయిబొప్పలు ఒకేసారి కట్టినట్టయింది.

తల దిమ్మెత్తి స్తబ్ధురాలైంది.

గోదావరి ప్రవాహాన్ని చూస్తేజాలు వూహాలు మరో ప్రపంచంలోకి వెళ్ళిపోతాయి. ఆ చల్లదనాన్ని, పచ్చి గాలిని అనుభవిస్తే ఎంతో ప్రశాంతత చేకూరుతుంది. మనసు విచక్షణతో ఊరడింపులో కుదుట పడుతుంది. ఎన్నో సమస్యలకు పరిష్కారాలు, ఎన్నో ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. అలాంటి శక్తినిస్తుంది ఆ నది.

పుల్లమ్మ బాల్యం నుంచీ గోదారికి సన్నిహితురాలు. రేవులో పిడకలు ఎండుతున్నంత సేపు తానూ నీళ్ళలో నానుతూ వుండేది. హుషారు పుడితే గోదారిలో ఆడుకునేది. కష్టం కలిగితే గోదారితో ఆత్మీయత పెంచుకుంది. ఇన్నాళ్ళూ గోదారే తనకు అండగా నిలిచింది. అందుకే పరిస్థితులకు రాజీపడి అతిత్వరలోనే మామూలు మనిషయ్యింది.

ఒకప్పుడు సారిగాణ్ణి కోరుకుంది. వాడే తన సర్వస్వం అనుకుంది. అలాంటిది రాజయ్య తన మెడలో వుచ్చు బిగించి, అన్యాయం చేశాడు. ఈ విషయంలో రాజయ్య కన్నా సారిగాడిదే తప్పు. ఘోరం జరిగి పోతుంటే ఏమీ పట్టించుకోలేదు. ఇప్పుడు వాడంటే ఆమెకి పరమ అసహ్యం.

పుల్లమ్మ గుండె రాయి చేసుకుంది. అసలేమీ జరగనట్టే రాజయ్య పంచలోనే ఉంటూంది. తనని పెంచాడన్న మమకారం మినహా అతనితో ఏ బంధుత్వం లేదు. రెండు మెతుకులు వండి పడేయటం మినహా వారిద్దరి మధ్యా ఏ అనుబంధం లేదు.

ఎడమొగం పెడమొగంగా సాగుతోంది ఆ సంసారం.

రాజయ్య తప్పు చేసిన వాడిలా తప్పించుకు తిరుగుతున్నాడు. పుల్లమ్మని చూస్తేనే భయం, మాట్లాడాలంటే వణుకు, దడ.

నిజానికి బాబూరావు బలవంతం మీద ఈ పెళ్ళి చేసుకున్నాడే కాని

తన వయసులో పెళ్ళామన్నది శుద్ధదండగ. అందుకే పడుచుపెళ్ళాం మొగుడిలో రావలసిన మార్పులేమీ రాజయ్యలో రాలేదు.

కొత్త పెళ్ళి కొడుకెలా ఉన్నాడని అడగడానికి అప్పుడప్పుడు బాబూరావు పుల్లమ్మ దగ్గరికి వచ్చేవాడు. అతని నీడని చూస్తేనే అస హ్యించుకునే పుల్లమ్మ పెళుసుగా జవాబిచ్చి పంపించేసేది.

రాత్రిళ్ళు బ్రాకెట్టు డ్యూటీ ముగించి కొంపచేరే సరికి పుల్లమ్మ విడిగా చాపేసుకుని పడుకుంటుంది. ఆమె ఎక్కడ లేస్తుందో అన్న భయంతో మెల్లగా తన మంచంమీద వాలి ముసుగేసుకుంటాడు రాజయ్య రోజూ.

ఒకనాడు అర్థరాత్రి రాజయ్య గూడు చేరేసరికి పుల్లమ్మ గుడిసెలో లేదు. కంగారు పడిపోయాడు. పేటంతా వెదికాడు. పుల్లమ్మెక్కడా కన బడలేదు. అనుమాన మొచ్చి సారిగాడి గుడిసెకేసి వెళ్ళాడు. ఏం అఘా యిత్యం చూడవలసి వస్తుందేమోనని భయపడుతూనే సారిగాడి గుమ్మం తడికె తోయబోయాడు.

గుడిసెలో గాజుల చప్పుడు, గుసగుసలు వినబడ్డాయి.

తడికె తీసి ఆ దృశ్యం చూడ్డానికి దడ పుట్టుకొచ్చింది. వొళ్ళు చెమ టలు పట్టాయి.

ఖూనీ జరగడం చూసినట్టు ఒణికిపోతూ తన గుడిసెకెళ్ళి పోయి, మంచంమీద చతికిలబడిపోయాడు.

ఇలాంటి అఘాయిత్యం ఎప్పుడో ఒకప్పుడు జరుగుతుందన్న భయం అతన్నిన్నాళ్ళూ పీకుతూనే వుంది.

అది కాస్తా జరిగిపోయింది. ఈ ఘోరాన్ని భరించలేక పోతు న్నాడు.

కోపాగ్ని తలకెక్కింది.

సారిగాడి తొడలు నరికేయాలనిపించింది.

పుల్లమ్మ పీక పిసికేయాలనిపించింది.

ఇలా మంచం మీద చతికిలబడిన మరుక్షణంలో పుల్లమ్మ గుమ్మంలో కొచ్చింది.

పుల్లమ్మని చూసే ధైర్యం లేకపోయింది. అతనికి క్షణంలో కోపం భయంగా మారిపోయింది.

"ఏడకెళ్ళావు", గుటకేస్తూ అడిగాడు.

"గోదాట్లోకి", గుడ్డి దీపం పెద్దది చేస్తూ అంది.

వోరగా చూశాడు. నిజమే అయ్యుండాలి. పుల్లమ్మ భుజం మీద తడి సీరుంది.

"నువ్వు సారిగాడి గుడిసె కాడి నుంచొత్తున్నావా?" తడిచీర కొసల్ని నిట్రాటకి, చూరుకి మధ్య కడుతూ అడిగింది.

తను వేయవలసిన ప్రశ్న పుల్లమ్మే వేసినందుకు ఆశ్చర్యపోయాడు రాజయ్య.

ఇప్పుడు వారి యిరువురి మధ్య తడి చీర తెరగా వెలిసింది.

"నువ్వాడి కెళ్ళలేదా?" ధైర్యం చేసి అడిగాడు.

"ఎడితే తప్పా?" అంది చాప పరుస్తూ.

"కొడుకుతో ఎబిచారం చేత్తే పురుగులట్టుకుపోతారు."

నిర్ఘాంత పోయింది. "నేనా గుడిసెలో తొంగున్నానని సూడ్డాని కెళ్ళావన్న మాట" సూటిగా అడిగింది.

రాజయ్యకు ఏమనాలో తోచలేదు.

"వయసయ్యాక మనువాడినోడికి ఇంతకన్నా మించి ఆలోసన్లు ఏడొత్తాయి." అంటూ చాపమీద చతికిలబడింది. సారిగాడి గుండెసెలో మంగాయమ్మ వుంది కాబోసు. అదే తను అనుకుని ఇట్టైపోతున్నాడు ముసలాడు అనుకుంది.

"ఎనకటికి ఈ ఊర్లో రాజు పాలించాడట. ఆడి పేరేదో వుండాలి" తెర వెనుక ధైర్యం పుంజుకుని అన్నాడు రాజయ్య.

"ఆడి పేరు రాజయ్య గామోసు" అంది వ్యంగ్యంగా.

"ఆ, రాసరాసనరేంద్రుడు, ఆడికో పెళ్ళాముండేదిట."

"అవును, దాని పేరు సిత్రాంగి, కాదు కాదు పుల్లమ్మ."

"ఏలాకోలం సెయ్యమాక ఇను".

"నాకు తెలుసు, ఆడికో కొడుకు ఉండేవాడు. ఆడిపేరు సారిగాడు" అంది పుల్లమ్మ చెప్పబోయే కథలో సారాంశం ఇట్టే గ్రహిస్తూ.

"కాదు, సారంగదరుడు",

"ఊ, సెప్పు", వాడితోనే చెప్పిద్దామని ఊకొట్టింది.

వాడు చెప్పుకుపోతున్నాడు. "సిత్రాంగికి సారంగదరుడి మీద కన్నడింది. రాజు అది సయించలేక పోయాడు. దాంతో సారిగాడి తొడలు నరికించేశాడు."

"తప్పు, తప్పు—సారంగదరుడివి."

"సిత్రాంగి పీక పిసికేశాడు."

"ఓరి రాజయ్య మావా, నువ్వొట్టి పిచ్చాడివి, ఆ రోజుల్లో అట్టా సెల్లింది. నువ్విగాని సెయిసేసుకుంటే నిన్ను కటకటాల్లోకి తోస్తుంది, సట్టం."

"నువ్వు సారిగాడి జోలికి పోవద్దు. నేను సయించలేను. కాదూ కూడదంటే నేను గోదాట్లో పడి సత్తా. అప్పుడు నీకిట్టం వచ్చినట్టు సేసుకో."

పుల్లమ్మకు కోపంతో వొళ్ళు మండిపోయింది. కానీ ఎంత కోప మొచ్చినా ఆవేశపడదు. సమయస్ఫూర్తితో వ్యంగ్యంగా సూటిపోటి మాట లతో చిత్రహింస పెడుతుంది. లేపోతే కోపం దిగమింగి కార్యరూపంలో పగ తీర్చుకుంటుంది.

"మనువాడిన మొగుడు ముసుగేసి తొంగుంటే, ఆ పెళ్ళాం మరేటి సేత్తుందో తెలేదా నీకు. కాటికి పోయేవాడివి పడుసుపిల్లని ఎందుకు కట్టు కున్నావు?" మనసులోని మాట అనేసింది.

"నువ్వంటే బాబూరావు పడిసత్తున్నాడు" తనలో తననుకున్నట్టు అన్నాడు.

నిర్ఘాంతపోయింది.

"నువ్వు రిహ్చా తొక్కమాక, నెలకింతని ఉత్తినే ఇచ్చేత్తాను. మీరిద్దరూ కాలిమీద కాలేసుకుని బతకండి అని గొడవ సేత్తన్నాడు బాబూ రావు."

చెవులు రిక్కించి వింటూంది.

"ఆడు పోలీసోడు. ఆడేం సేసినా ఆ డిపార్టుమెంటుకి ఎవరికీ దమ్ము ల్లేవు. అట్టాంటాడితో పోయినా పరవాలేదు."

పుల్లమ్మకి పూర్తిగా పరిస్థితి అర్థమైపోయింది. బాబూరావు తన జీవితంతో చదరంగ మాడుతున్నాడన్న మాట. ఆ ఆటలో రాజయ్య ఒక పావు మాత్రమే. తను ఈ ఆటలో ఒక పావు అవకూడదు. తనకు జరి

గిన పెళ్ళి అసలు పెళ్ళే కాదు. ఇది తన మీద పన్నిన కుట్ర అని గ్రహించింది.

ఆ రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు.

తనకి జరిగిన అన్యాయాన్ని నలుగురికీ తెలియజేసి ఈ పెళ్ళిని ఎలాగో అలా రద్దు చేయించాలని నిశ్చయించుకుంది. ఈ పెళ్ళి రద్దయితే నలుగురి పెద్దలతో సంప్రదించి సారిగాణ్ణి కట్టుకోవచ్చు.

ఇన్నాళ్ళూ సారిగాడి గురించి తను పట్టించుకోలేదు. వాడెలాపోతే తనకేం అన్నట్టు ఊరుకుంది. ఇప్పుడు వాడు మంగాయమ్మ కాతాలో పడ్డాడు. వాణ్ణి ముందు దక్కించుకోవాలి.

మంగాయమ్మ టక్కులమారి. అదేం మందు పెడుతుందో కాని అందరూ అదంటే పడి చస్తారు. ఈడు, జోడు—వావి, వరస కాతరు చేయకుండా, రోజుకో రంకు మొగుడుగా సాగిపోతోంది దాని కాపురం.

సారిగాణ్ణి దాని ఉచ్చులోంచి తప్పించాలంటే తాను వాణ్ణి ఆకట్టుకోవాలి. దానికొకటే ఉపాయం. వాడికో మంచి జాతి పుంజును కొనిస్తే చాలు. ఇట్టే దానిసైపోతాడు.

ఈ ఆలోచనతో తెల్లారిపోయింది.

ఇన్నాళ్ళూ తను గడించిందీ, వెనకేసిందీ పోగేస్తే వేయి రూపాయల పైగా తన వద్దుంది. ఆ డబ్బు తీసి కొంగులో ముడేసింది.

రాజయ్య అలా గోదారికేసి పోవడం చూసి, తిన్నగా సారిగాడి గుడిసెకేసి వెళ్ళింది పుల్లమ్మ.

సారిగాడు బానలెత్తి కోళ్ళకి మేతవేస్తూ, పుల్లమ్మ నెగాదిగా చూశాడు.

"ఏటే? మనువాడాక కనుమరుగై పోనావు. మా అయ్య నిన్ను కూడా యిలా బానలో కట్టి పడేశాడేంటి?" వెటకారంగా అన్నాడు.

"నీ అయ్యకా దమ్ము లేడేడిసినాయిలే. అది నీకే సెల్లింది. పొద్దత్తమానం బానల్లో కోళ్ళెట్టడం, రేత్రిళ్ళ గుడిశెలో గుంటల్ని దాయడం."

"మళ్ళీ కుయ్, ఇప్పుడు కూసింది."

"పేటంతా యినపడే కూతలే యివి, ఎప్పుడైనా యినచ్చులే. అయి ప్పుడెందుకూ, నాకో మంచి పుంజుని కొనిపెట్టు, పందెంలోకి పెట్టాలని ఉంది."

"ఓర్నీయవ్వ! ఈ పేట్లో ఆడాళ్ళకి పుంజుల మీద పడింది మోజు."

"నేనేగా అడిగాను. పేట్లో ఆడోళ్ళందర్నీ కలుపుతావెందుకు?"

"మాంచి నిద్దట్లో తొంగుంటే, నిన్నరేతిరి నన్ను లేపి ఓ పుంజు కొనాలెంతవుద్దీ అనడిగింది."

అందుకా, మంగాయమ్మ నిన్న రాత్రి వీడి గుడిసె కొచ్చిందీ అనుకుంది.

"నువ్వు కోడిపేత గట్రా సూసుకో, నేను నిన్ను సూసుకుంటూ యీడే వుంటానంటూ రేత్రంతా మారం సేసింది."

సరిగ్గా తనూ ఆ పనే చేయాలనుకుంది. కనుక మంగాయమ్మ పుంజును కొనబోవడం లోని అంతరార్థం యిట్టే గ్రహించ గలిగింది పుల్లమ్మ.

"దవిళేశ్వరంల్లో పుల్లలడితి షావుకారుకాడ బొబ్బిలి సుంజుంది. ఎనిమి

దొందలు సెపుతున్నారు. కొంటావేటి? బాగా మేపితే వచ్చే ఏటికి పందెంలో దింపచ్చు అనడిగాను."

"ఒప్పుకుందా?" వళ్ళుమండిపోతూ అడిగింది పుల్లమ్మ.

"ఆ డబ్బెడితే వంద పెట్టలను కొని రోజూ కోసుకు తినవచ్చు. వద్దులే అంది."

"ఆ పుంజుని నేను కొంటాను. బేగెళ్ళి ఈ డబ్బిచ్చి యియ్యాలే పట్రా," అంటూ కొంగు ముడి విప్పి నోట్లు లెక్కెడుతూ అంది పుల్లమ్మ ఆలస్యమైతే మంగాయమ్మ మనసు మార్చుకోవచ్చని భయపడి.

సారిగాడి కాశ్చర్యమేసింది. "పుంజు కొంటే సాల్దు. దానికి రోజూ ఉల్లిపాయ, ఆవకాయ ఏసి మేపి, ఈత గట్రా నేర్పించాలి. సానా కర్చవుతుంది."

"పర్వాలేదు. ఎంత కర్సయినా సరే. ఇంద ఎనిమిదొందలు" అంటూ నోట్లకట్ట వాడి చేతిలో పెట్టింది పుల్లమ్మ.

సారిగాడి కళ్ళు మెరిశాయి. "సరే, నాయాల. ముందేడు సంకురాత్రికి దాన్ని శాండోలా తయారు సేస్తానుండు," అంటూ నోట్లందుకుని మాయమైపోయాడు.

పుల్లమ్మ మనసు కుదటపడి సాఫీగా నిట్టూర్చింది.

సారిగాడు ధవళేశ్వరం పెళ్ళి, షావుకార్ని బేరంలోకి దింపి, ఎట్టకేలకు ఆ పుంజును ఏభై రూపాయలకు తక్కువ చేసి కొని, పేట చేరేసరికి పొద్దు వాలింది.

సారిగాడు తన గుడిసెను చూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు, పెచ్చులూడి పోతున్న మట్టి గోడలు సిమెంటు చేసినట్టు నున్నగా

అలకబడి వున్నాయి. చిందరవందరగా ఉన్న పై కప్పు కొత్త ఆకులతో నేయబడి వుంది. బద్ద లూడిపోయిన వెదురు తడికె స్థానే కొత్త తడికె గుమ్మానికి అమర్చబడి వుంది. గోడమీద, అరుగుల మీద రకరకాల సున్నం ముగ్గులు అందంగా వేయబడి వున్నాయి. గుమ్మాని కిరుపక్కల రంగు రంగులతో చిత్రించిన కోడి పుంజులు అతనికి బాగా నచ్చాయి. ఈ ఏర్పాట్లన్నీ పుల్లమ్మ కొకత్తికే సాధ్యం అని అతనికి తెలుసు. పుల్లమ్మకి మనసులోనే జోహార్లర్పించాడు.

అసిలిజాతి కోడిపుంజు సంపాదించడంతో సారిగాడి జీవితాశయం నెరవేరింది. పుల్లమ్మంటే గౌరవం కలిగింది. దాంతో గతానికి మించిన చనువు వారిద్దరి మధ్య ఏర్పడింది.

పుల్లమ్మ రోజూ సారిగాడి గుడిసెకెళ్ళి వాడి బాగోగులు, ఆ అసిలీ పుంజు మేత గీత తనే స్వయంగా చూస్తోంది.

సారిగాడి గుడిసెకు పుల్లమ్మ వెళ్ళడం బాధ కలిగించేది రాజయ్యకు. అది తలుపుచాటు వ్యవహారానికి ఎక్కడ దిగిపోతుందేమోనని భయపడి పుల్లమ్మ మీద ఒక కన్నువేసి, తనకు ఆమె మీద ఉన్న హక్కు కష్టపడి కాపాడుకుంటున్నాడు.

రాజయ్య దృష్టిలో సారిగాడు పరోక్షంగా ఓ విరోధి.

వాడికి రిక్షాఎరువివ్వడం మానేశాడు.

ఇప్పుడు సారిగాడు వేరే రిక్షా అద్దెకు తీసుకొని తొక్కుతున్నాడు.

సారిగాడు, పుల్లమ్మల దృష్టిలో అసిలి కోడిపుంజు క్షణక్షణానికి అంచనాలు మించి ఎదిగిపోతూంది.వచ్చే సంక్రాంతికి పందెంలో దింపాలని నిశ్చయించుకున్నారు.

*   *   *

సంక్రాంతి రానే వచ్చింది.

కోడి కూసేలోగా కోడి పందాలకి సిద్ధమయ్యారు సారిగాడు పుల్లమ్మ....అంత చలిలోనూ.

రిక్షాని కోటి లింగాల రేవులో వదిలేసి, అసిలీజాతి కోడిని చంక నేసుకుని, నావదాటి తిప్ప చేరేసరికి బాగా తెల్లారింది.

తిప్పంతా తీర్థంలా ఉంది. ఒకటో రెండో పందాలు అప్పటికే మొదలయ్యాయి.

తిప్పలో బలమైన ఇనుప ఊచలు దూర దూరంగా పాతి, వాటికి ఒక్కొక్క కోడిని కట్టారు. కోళ్ళపక్కనే కోళ్ళ యజమానులు గొంతి కూర్చుని ఉన్నారు.

కోళ్ళ అంచనా వేయడానికి పందాలగాళ్ళు కోళ్ళ చుట్టూ కూర్చుని గంటల తరబడి చూస్తూ కోళ్ళ సత్తాను అంచనా వేస్తున్నారు. ఇలాంటి గుంపులు కోడికో గుంపుగా తిప్పంతా ఆక్రమించాయి.

చుట్టూ నాలుగు కల్లు పాకలు, ఒక సారా దుకాణం తిప్ప మీద వున్నాయి. చీకులు, తినుబండారాల కొట్లు వాటి చుట్టూ వున్నాయి. ఇవి కాక కాఫీ హోటళ్ళు, మంచం మిఠాయి కొట్లు బోల్డున్నాయి. కొట్టుకో లౌడు స్పీకరు చొప్పున సినిమా రికార్డులు తిప్పంతా మారుమ్రోగుతున్నాయి.

పొద్దెక్కే కొద్దీ పందెంగాళ్ళకి సారామత్తు పెరిగి పోవడంతో వీరా వేశాలు వచ్చి కోళ్ళ యజమానులను పందాలకి పుసిగొల్పుతున్నారు.

సారిగాడు, పుల్లమ్మ ఒకసారి తిప్పంతా తిరిగి దూరంగా తమ కోడిని ఇనుపరాటకు కట్టి పక్కనే చతికిలబడ్డారు.

తిప్పమీద కోళ్ళని చూశాక వాటితో పోలిస్తే తమ పుంజు బాగా నాసిరకం అనిపించింది వాళ్ళకి.

దీనిని పందెంలో పెడితే ఒక దెబ్బకే చతికిల పడుతుందని భయ పడ్డారు. ఇప్పుడు కాకపోయినా సుబ్బారాయుడి షష్టికి బాగా మేపి పందెంలో పెడదామని కూడబలుక్కున్నారు.

"పొద్దు నెత్తికెక్కిపోనాది, కోడలసి పోతుంది, పోదారెహెస్" అన్నాడు సారిగాడు లేస్తూ.

"ఉండెహెస్, అలిసిపోతే అలసిపోనాది. దాని కెలాగా పందెంలేదు. కాసేపు కూకో", అంటూ చెయ్యట్టుక్కూదేసింది, పుల్లమ్మ.

అలా సారిగాడితో ఒంటరిగా సంబరం మధ్యన కూర్చున్న పుల్లమ్మకి వాడే తన మొగుడన్న అనుభూతి కలిగింది. ఈ అనుభూతి త్వరలో శాశ్వతం కాబోతుందన్న ధీమా వేసింది.

ముచ్చటగా వున్న ఈ జంట చుట్టూ ఓ గుంపు జేరింది, ఈ జంట బాపతు పుంజుని అంచనా వేయడానికి.

కోడి మాటకేంగాని ఈ జంట మా పెద్ద పరువంలో వుంది అను కుని అలాగే వుండిపోయింది ఆ గుంపు.

సింగారంపేట సోగ్గాడొకడు చంకలో పుంజట్టుకు తిరుగుతూ ఆ గుంపు దగ్గరకొచ్చాడు.

ఆ గుంపులో కోడిని బాగా చూసుకుని, బేరానికి వచ్చాడు.

సోగ్గాడి కోడి కాస్త నాసిరకం. అయినా సారిగాడి కోడంత నాసి రకం కాదు.

సారిగాడు కూడ ఆ చంకలో కోడిని బాగా చూసి, బేరంలోకి దిగాలా, వద్దా అని తటపటాయిస్తున్నాడు.

పందెం వంద. పై పందెంలో వాటాలుండకూడదు. కోజాని (ఓడి పోయి చచ్చిన కోడి) గెలిచినవాడికివ్వాలి, ఇవీ నిబంధనలు.

"పందెం వప్పేసుకో", అని సారిగాణ్ణి గిల్లిండి పుల్లమ్మ.

"ఉండెహెస్" అన్నాడు సందిగ్ధంలో ఉన్న సారిగాడు.

"పందిలా మేసింది, ఆ మాత్రం దెబ్బలాడకపోతే దాన్నొగ్గేసి మరో పుంజుని కొందారి. సై అనరా సచ్చినోడ" అంది కొంగు చివర ముడేసిన చిల్లర చేతిలోకి పోసుకుంటూ.

'సై' అనేశాడు సారిగాడు.

"పందెం కుదిరిందిరోయ్!" అన్నారు నలుగురూ.

గుండ్రంగా గిరిగీశారు.

గిరికో పక్కన సారిగాడు తన కోడిని, మరో పక్కన సోగ్గాడు తన కోడిని పట్టుకూర్చున్నారు.

సోగ్గాడు కోడిని వదిలాడు.

పుంజు ఠీవిగా గిరి మధ్య నుంచుంది.

సారిగాడు కోడిని వదిలాడు.

సారిగాడి కోడి దాని చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణం చేసి పారి పోయింది.

సారిగాడు నీరుకారిపోయాడు.

పుల్లమ్మకి చిర్రెత్తింది.

పుంజు మెడ పట్టి ముక్కుమీద చిటికలేస్తూ బాదింది.

పుంజుకి పౌరుషం ఎక్కింది, పింఛాలు విప్పాయి.

పుంజు తోకట్టుకుని సోగ్గాడి కోడిమీదకి బలంగా గిరవాటేసింది.

అది సరిగ్గా అప్పుడే లేస్తున్న సోగ్గాడి పుంజుమీద పడింది.

సోగ్గాడి పుంజు కంగారుపడి గిజగిజలాడ్డంతో సారిగాడి పుంజు కాటా సోగ్గాడి పుంజు కంట్లో గుచ్చుకు పోయింది.

పుల్లమ్మ అలా కోడిని విసిరినందుకు సోగ్గాడి మద్దతువారులు పుల్లమ్మ మీద విరుచుకు పడ్డారు. దాంతో కోళ్ళ దెబ్బలాట కన్నా మద్దతుదారుల దెబ్బలాట చాలసేపు సాగింది.

సోగ్గాడు పుంజుకంట్లో పసరేసి, నోట్లో నీళ్ళోసి చెవిలో ఊది గిరి లోకి పంపాడు.

సారిగాడి పుంజుని తోక గిల్లి పంపుకు గెంటింది పుల్లమ్మ.

రెక్కలు వెనక్కి సాచి అడుగులేసుకుంటూ సారిగాడి పుంజు, సోగ్గాడి పుంజు కెదురెళ్ళింది.

సోగ్గాడి పుంజువాటంగా ఎగిరి దాని చంప ఛెడేలు మనిపించింది. ఊకలాడించి దుమ్ము దులిపేసుకుని పారిపోయి గిరిచుట్టూ తిరిగింది సారి గాడి పుంజు.

ఒంటికన్ను కోడితో పోట్లాడలేని ఊ పుంజూ ఓ పుంజేనా అంటూ సారిగాడి కోడిని బండబూతులు తిట్టారు- దానిమీద పందెం కాసిన నలుగురు.

దాంతో పుల్లమ్మకి పౌరుషం వచ్చింది. గిరి చుట్టూ తిరుగుతున్న పుంజు తనవైపు రాగానే అటకాయించి, దాని ఊకట్టుకు లాగి పీకె పిసికి "చావునంజా!" అంటూ గిరిలోకి గిరవాటేసింది.

దాంతో అది తలకిందులుగా పడి ఊపిరాడక కాళ్ళు గిల గిల తన్నుకోసాగింది.

సోగ్గాడి పుంజు వెంటనే పుంజుకొని, దాన్ని పొట్టలో పొడవ బోయింది. ఒంటికన్నుతో మెడ ఇటూ అటూ తిప్పడంతో గిలగిలలాడుతున్న

కాటాదెబ్బ ఉన్న ఒక్క కంట్లో తగిలింది. దాంతో సోగ్గాడి పుంజుకి కళ్ళు రెండూ పోయాయి.

సారిగాడి కోడి పందెంగాళ్ళు సీమటపాకాయల్లా ఎగిరెగిరి గంతేశారు.

సోగ్గాడి జనాభా తుస్సుమని కూలబడిపోయింది.

సారిగాడి పుంజు మళ్ళీ పుంజుకుంది. గిరగిరా తిరుగుతున్న సోగ్గాడి గుడ్డి పుంజుని ముక్కుతో పొడిచి చంపేసింది.

దాంతో సారిగాడి పుంజు గెలిచినట్టయింది.

నిజానికి కోడికన్నా పుల్లమ్మే ఈ గెలుపుక్కారణం.

డింకీ పందాలు కత్తి పందాలంత త్వరగా అయిపోవు. అలాంటిదీ పందెం ఇట్టే ముగిసినందుకు అందరికీ ఆశ్చర్యం వేసింది.

సారిగాడి పుంజు నాసిగావున్నా, ఆ కొట్టిన రెండు దెబ్బలు గురి చూసి కొట్టింది అని మెచ్చుకున్నారు చాలమంది.

అడవి దున్నపోతులా పౌరషమేగాని, వాటం చూసుకోదీ సన్నాసి పుంజు అని సోగ్గాడి పుంజుని తిట్టుకున్నారు కొందరు.

దెబ్బతో సారిగాడు కనీవినీ ఎరుగని విజయం సాధించి ఆ తిప్ప మీదొక కథానాయకుడై పోయాడు.

చంకలో వీరకోడి నెట్టుకుని తిప్పంతా తిరిగాడు.

ఈ విజయోత్సవాన్ని ఘనంగా జరిపారు సారిగాడు, పుల్లమ్మ ఆ సాయంత్రం.

కోడి మెడలో రిబ్బనుకట్టి, రిక్షాని పువ్వులతో రథంలా అలంకరించి గెలిచిన రూపాయి కాగితాల్ని తోరణంలా కట్టాడు. రిక్షా టాపు బిగించేచట్రం మీద తన వీరకోడిని నిలబెట్టి చచ్చి వాలిపోయిన సోగ్గాడి పుంజుని దానికిందే

వేళ్ళాడదీశాడు. డప్పుల వాళ్ళను కుదిర్చి కోటిలింగాల రేవునుండి మురికి పేటకు ఊరేగింపుగా వెళ్ళాడు.

పందెం నెగ్గిన మద్దతుదారులు రిక్షా వెనకాలే కోడికి జేజేలు కొడుతూ నడిచారు.

రిక్షాలో పుల్లమ్మ వొళ్ళు మరచిపోయి, డప్పులకు లయగా గంతులు వేస్తోంది.

ఆ ఊరేగింపు సీతంపేటకి చేరేలోగా మరికొన్ని రిక్షాలు కలిసి పెద్ద దయింది.

రిటైరైన పోలీసు వెంకటస్వామిగారు లోపాయకారీగా ఒక సొంత పోలీసుస్టేషను కట్టించుకుని సీతంపేట సెంటర్లో ప్రైవేటు ప్రాక్టీసు పెట్టుకున్నారు. అసలు పోలీస్టేషన్లాగే గదికి జేగురురంగు పూయించి ఒక అద్దం, కోటుస్టాండు, తాలూకా పటం గోడకు కొట్టి రెండు తుప్పట్టిన బేడీలు, బిగిలిపోయిన లాఠీ, ఒక పిట్టలుకొట్టే తుపాకి గదిలో అలంకరించి టేబులు, కుర్చీ వేసుకూర్చున్నారు. ఆంబోతులాంటి కొడుకు, చింబోతులాంటి బామ్మర్దిని చేరదీసి వాళ్ళకి పోలీసు నెంబర్లిచ్చారు.

దూరంగా డప్పులు వినబడ్డాయి.

ఏదో నేరం తగలచ్చని బెల్టు బిగించి నెంబరులేని టోపీ తగిలించి హడావిడిగా జేబీపుచ్చుకు వీధిలో కొచ్చేశారు వెంకటస్వామిగారు.

ఊరేగింపు చూశారు.

అసలు విషయం యిట్టే పసిగట్టారు.

రిక్షారథం స్టేషను ముందుకు రాగానే అటకాయించారు.

సారిగాడికి, పుల్లమ్మకి ఒకే జేడి వేసి స్టేషన్ లోనికి నడిపించారు.

వీరకోడి, సోగ్గాడి పుంజు, నోట్లతోరణం వాటంతటవే స్టేషనులో కెళ్ళిపోయాయి.

డప్పుల వాళ్ళతో సహా ఎక్కడజనం అక్కడ పరారయిపోయారు.

వెంకటస్వామిగారు టోపీ తీసేశారు. బెల్టు వదులుచేశారు. కోటు బొత్తాలు విప్పేశారు. మీసాలు దువ్వుతూ కుర్చీలో కూర్చున్నారు.

ఎదురుగా సారిగాడు, పుల్లమ్మ నుంచున్నారు.

టేబులు మీద సోగ్గాడి కోజా వుంది. దాని ప్రక్కనే రూపాయిల తోరణం కుప్ప ఉంది. దూరంగా కిటికీ వూసకి వీరకోడి కట్టబడివుంది.

ఎదురుగా ఉన్న షుద్దాయిల్ని ఎగాదిగా చూశారు వెంకటస్వామి గారు.

"సిలకా గోరింకల్లా వున్నారు. మీకేటిరా ఈ పొయ్యేకాలం. తిప్ప మీద సారా పూటిగా పట్టేశారేంటి?"

లేదంటూ తలూపారిద్దరూ.

"కోడిపంచెం నేరం. అది మీకూ తెలుసు, మాకూ తెలుసు. మనం మడుసులం. కనుక నేరం సేత్తాం. తప్పులేదు. ఆ మాటకొత్తే తిప్పమీద నేనూ కట్టాను పంచెం. అలాగని బరితెగించి డప్పులు వాయిస్తూ మీలా ఊరేగానా?"

"తప్పయి పోయింది సార్! మమ్మల్ని ఒగ్గేయండి", సారిగాడి గోల.

"నోరు మూయవోయ్!"

"ఇంకెప్పుడూ సేయం" పుల్లమ్మ హామీ.

"వయసొచ్చిన దానవు. రిక్షా ఎక్కి తైతక్కలాడావు సిగ్గులేదు మాట్టాడ్డానికి? అంత పిటపిటలాడి పోతూవుంటే మీ గుడిసెకిపోయి ఈ

కోజా నొండుకుతిని సాపేసి ఈడి ఒళ్ళో పెచ్చగా తొంగోక ఊరేగు తావటే? పుండాకోర్!"

"తప్పయి పోనాది అన్నాను గండా. మమ్మల్నొగ్గేయండి బాబు. ఆ పనే సేసి మీ కడుపున పుడతాం."

"ఏరా! నీకోడి ఎదరవాడి కోడిని సంపి పందెం నెగ్గింది, అవునా? నీ కోడి ఆ కోడిని సంపిన నేరానికి శిచ్చ ఏంటో తెలుసా? మూడేళ్ళు."

"బాబుగారూ! ఇయ్యాళింకా కూడు లేదు. గెలిసిన డబ్బులుచ్చేసుకుని మమ్మల్నొగ్గేయండి."

"ఏరా లంచమిస్తావట్రా నాకు, మీకాడ లంచం పుచ్చుకోడానికే ఉందిరా ఈ పోలీసు స్టేషను? రూపాయి లిచ్చేసి కోజా నట్టుకుపోయి జల్సా చేసుకుందారనేగా మీ ఉద్దేశం. సత్తే వప్పుకోను. ఇదిగో టూ నాట్ ఫోర్ నువ్వు డూటీ దిగిపోయి, ఈ సంపేసిన పుంజును ఇంట్లో ఇచ్చి బాగా మసాలా పెట్టి వండమను అమ్మగార్ని."

"ఎస్ సార్" అంటూ కోజా నట్టుకు ఎళ్ళిపోయింది అంటోతు.

"బాబుగారూ, ఆ కోజా నొగ్గేయండి, దానిని మా కోడికి దిష్టి తీయాల, లేకపోతే ఆ పాపం మాకు సుట్టుకుంటుంది." వాపోయింది పుల్లమ్మ.

"ఓ అలాగే, ఆ పని నేనింటికాడ సేయిత్తాలే. ఇదిగో ఫైవ్ ఫిఫ్టీ ఫోర్, ఆ కిటికీలో కోడిని ఇంటికాడ వొగ్గేయి. దానికి దిష్టి తీయాల."

"ఎస్ సార్" అంటూ అంతపనీ చేశాడు ఫింబోతు.

చూస్తూ నీరుకారి పోయారిద్దరూ.

"ఇప్పుడు సెప్పండి, పందెం ఎంతకాశారో ? అయిదొందలా? వెయ్యా!"

"లేదుబాబూ వందరూపాయలే."

"అవునులే, అంతే ఉంటాయి. ఈ తోరణంలో అంతకన్నా ఎక్కువలేవు" అన్నాడు తోరణం జేబులో వేసుకుంటూ.

నిస్సహాయంగా చూస్తూ వుండిపోయారు పుల్లమ్మ, సారిగాడు.

"అవును కాని, ఇవి మీరు నెగ్గిన రూపాయలు, మరి మీరోడిపోతే కట్టాల్సిన రూపాయలేవి?"

"అయ్యబాబూ, మాకాడ డబ్బులెక్కడివండి. ఉత్తినే పందెం కాశాం" అంది చిల్లర మూటకట్టిన చెంగుని వెనక్కి దోపుకుంటూ.

"ఇదిగో సూడు, నేను మామంచి పెద్దోణ్ణి. ఈ లాటీతో పెంకి మీదిస్తే పెంకులూడిపోగలవు."

భోరుమని ఏడ్చేసింది పుల్లమ్మ.

"ఆపాపు, ఏడిత్తే ఇక్కడెవరో మానభంగం చేసేత్తున్నా రను కుంటారు కిట్టనోళ్ళు. ఈ స్టేషనెనకాలే పెద్ద కాళీదొడ్డుంది. అక్కడికి నడవండి. అక్కడ చితకబాత్తాను. అప్పుడు మీరేడిసినా పరవాలేదు, ఎవరికీ ఇనబడదు."

అన్నంత పనీ చేస్తాడు అని కిక్కురు మనకుండా కొంగులో చిల్లర బల్లమీద పోసేసింది పుల్లమ్మ.

పేడీలు వాటంతటవే ఊడిపోయాయి.

"ఈ కోడి పందాల జోలికి పోవని మూడు సార్లనండి"

మూడు సార్లన్నారు.

పోయి పెచ్చుగా తొంగోండి.

భారంగా కదిలారు.

*　　　　*　　　　*

అప్పటికే బాగా చీకటి పడింది పేట చేరేసరికి.

రాజయ్య బ్రాకెట్ల డ్యూటీకి వెళ్ళిపోయాడు.

"మీ అయ్య డూటీకి పొయ్యుంటాడు. నువ్వు నాకాడికిరా పుల్లప్పేస్తా, సేపపులుసు కూడా ఉంది" అంటూ సారిగాడి గుడిసె దగ్గర రిక్షా దిగి తన గుడిసెకేసి పోయింది.

పొయ్యి వెలిగించి, పెనం ఎక్కించింది.

ముఖం కడుక్కుని, కొప్పు ముడేసింది.

చీర మార్చి జాకెట్టు వేసుకుంది.

సారిగాడు రావడం చూసి, వెనక్కి తిరిగి జాకెట్టు గుండీలు పెట్టమంది.

సారిగాడి మనసు బాగోక గుండీలు నొక్కబడటం లేదు.

"పోనీలే. ఒగ్గేయి" అంటూ నులకమంచం వాల్చి కూర్చోమంది.

దిగులుగా కూర్చున్నాడు.

"నచ్చినోడు. అయినకాడికి కోడీ అట్టుకుపోయి డబ్బూ కాజేశాడు" విసుక్కుంటూ అన్నాడు సారిగాడు.

"పోనీలె పోస్, మరోకోడి కొందారి, డబ్బు సిటికలో వస్తుంది. నువ్వుత్తినే యిదవమాక" హుషారెక్కించింది పుల్లమ్మ- సేమ వెండికంచం చేతికిస్తూ.

ఖాళీ కంచం కెలుకుతూ కాసేపు కూర్చున్నాడు.

పెనం మీద అట్టు వేగింది.

సత్తుగిన్నెలో పులుసు కంచంలోకి పోసి, వేడట్టు పడేసింది.

సారిగాడు ఆపురాపురుమంటూ తింటున్నాడు.

పెనంమీద మరో అట్టు తీర్చిదిద్దుతూ అంది పుల్లమ్మ. "ఆ నామాల హెడ్డుగారు మనన్ని సిలకా- గోరింకా అంటుంటే, నాకు మా సిగ్గేసు కొచ్చింది."

ఎక్కిళ్ళొచ్చాయి- సారిగాడికి.

"అప్పుడు నీకేమనిపించింది" గ్లాసందిస్తూ అడిగింది.

నోట్లో గ్లాసెట్టుకుని, ఏమీ అనిపించలేదని తలూపాడు సారిగాడు.

నిరుత్సాహపడింది.

"కోడి మాంసం తిని, చాపేసుకు తొంగో మన్నాడు ఆ హెడ్డు. ఆ మాట లాలకించే తలికి నా కదోలా అయిపోయినాది." అంది నిట్రాటకి వెన్ను ఆనించి, చూరుకేసి చూస్తూ.

'మరో అట్టు వెయ్యి' అన్నట్టు పెనంకేసి చూస్తున్నాడు సారిగాడు.

బరువుగా నిట్టూర్చి, కాలినట్టు తీసి, మరో అట్టు పెనంమీద వేసింది.

కంచం సాచాడు—సారిగాడు.

కాలిన అట్టు అంచులో పడేసి, వాడిపక్కనే మంచంమీద చతికిల బడింది.

"నిన్నూ నన్నూ కలిపి బేడీలేశాడు, ఆ బేడీలెప్పుడూ అనాగే ఉండి పోవాలనిపించింది నాకు, మరి నీకేమనిపించింది?" అంటూ, వాడి భుజం మీద గడ్డం ఆన్చి సుఖంలోకి చూసింది.

"జరిగెహెస్," అంటూ దూరంగా జరిగి, "బేడీ లేసిన సెయ్యి నొప్పెట్టి సత్తుంటే, ఈ యమ్మ గారికి అయ్యలాగే ఉండిపోవాలనిపించిం దట, సోద్యం."

మూతి తుడుచుకుని, లేచి పెనంమీద అట్టు తీసి, మరో అట్టు వేసి, పొయ్యి దగ్గిర చతికిలబడి, మోకాళ్ళ మీద తల ఆనించి, సారిగాడి కేసి తీక్షణంగా చూసింది.

సారిగాడిక చాలన్నట్టు కంచం దించేశాడు.

"ఉండెహెస్, అలా నేచిపోకు, నీతో పనుంది. ఇదికూడ తిను," అట్టకాడ సాచి మరో అట్టు కంచంలో ఏసింది.

కంచం తీసి అట్టు కెకలింటాడు సారిగాడు.

"నన్ను నీకిచ్చి సెయ్యాలనుకున్నారు అందరూ. సెప్పి సేయకుండా మీ అయ్య నాకు తాళి కట్టేసినాడు. అట్టా సేసినపుడు నువ్వు ఎందుకడ్డు తగల్లేదో సెప్పు?"

"మా అయ్యిట్టపడి సేసుకుంటే నాకేటి పుద్దిన?"

"నే నంటే నీ కిట్టం లేదా?" లేచి దగ్గిర కొచ్చింది.

తలదించేసి, అట్టు ముక్కతో కంచాన్నూడుస్తున్నాడు.

"నే నందంగా ఉండనా?" సూటిగా చూస్తూ అడిగింది.

తల మరికాస్త దించి, చిరాకు పడ్డాడు.

"పోనీ, ఆ గుడిసేటి మంగాయమ్మకి తీసిపోతానా?"

"దాని పెనిమిటి వొగ్గేస్తేనే అది గుడిసేటి దయ్యింది." తల యెత్తుతూ అన్నాడు.

"అంటే, నే నిప్పుడు గుడిసేటి దాన్నా?"

"అది నీకే తెలియాలి!"

తోక తొక్కిన త్రాచులా నర్రున లేచి, సారిగాడి చెంప ఛెళ్ళని పించి, "నీయమ్మ గుడిసేటిదిరా, నేను కాను!" అని ఒంగిసబాడిపోయింది.

సారిగాడికి పౌరుషం వచ్చింది. "అవును, మా యమ్మ గుడిసేటిది. మా అయ్య పోరంబోకు. నువ్వూ అంతే. అలా ఇన్నీసుపేట సెంటరు కాడికొస్తే సాచ్చికాలతో నీ సెరిత్రంతా సెప్పిస్తా."

"ఏటిరా, సెప్పిస్తావు? అసలేటి జరిగిందో సెప్పు, ఇప్పుడే యిసయం తేలిపోవాల," అంటూ సారిగాడి భుజాలు కుదిపేసింది.

విదిలించుకు లేచాడు. గుమ్మం దగ్గిరాగి చెప్పాడు. "ఇన్నీసు పేట సెంటరుకాడ నీలంగోడ పెంకుటింట్లో మోహినీకుమార్ అనే డాక్టరు ఎట్టుంటాడో తెలియనోడు ఈ బస్తీలో లేడు. ఆడికి పగలూ రేతిరీ ఒకటే. పవిటకొంగు సూత్తే పడిసత్తాడు. మా స్టాండులో రిక్షాల గిరాకీ సగం ఆడిదే. ఊరిలో పడుచు పిల్లలంతా ఆ కొంపలో సేరేయడం. ఆ యింట్లో మా యమ్మ ఓ వారం పాచిపని చేసింది. నా కప్పుడే అనుమాన మేసింది. అను కున్నట్టే ఓ మద్దినేళ నువ్వూ, మా యమ్మా ఆ కొంపలోకి దూరారు."

గుట్లప్పగించి వింటూంది, పుల్లమ్మ.

"ఆ సందాలే నా సేత రిక్షా కట్టించి, నువ్వూ, మా యమ్మా చెరో సీరే కొన్నారు. నాకు ఓ సెడ్డీ, బనీనూ కొనిపెట్టారు. ఇంతకన్నా సాచ్చికం ఏటి కావాల? కుక్క ముట్టిందాన్ని సేసుకో కూడదని అప్పుడే పైసలు సేసుకున్నా. పేటలో నీ పేరు సెడద్దని యీయాల్టి దాకా యీ యిషయం నాలో ఉంచుకుని గమ్మునూరుకున్నా," అంటూ ఓ అంగలో బయటికి పోయాడు.

"ఓరి నంజాకొడకా! ఎంతపని సేశావురా" అంటూ భోరున ఏడుస్తూ కుప్పగూలిపోయింది, పుల్లమ్మ.

అలా ఎంతోసేపు ఏడ్చింది.

ఎప్పుడొచ్చాడో బాబూరావు, గుడిసెలోకి అడుగుపెట్టాడు.

పెనంమీద అట్టు మాడి బొగ్గయింది.

పొయిలో మంటలారి పొగలొస్తూన్నాయి.

పుల్లమ్మ నులకమంచాన్ని ఆనుకొని వెక్కి వెక్కి ఏడుస్తూంది.

జారిన పమిట నేలమీద పడింది.

విడిన కొప్పు, బోసిగానున్న వీపు మీదుంది.

ఈ వాతావరణం చూసిన బాబూరావు ఇది మొగుడితో మోసా లెత్తుండాలని అనుకున్నాడు. పుల్లమ్మని ఓదార్చడానికి యిప్పుడో నాథుడు కావాలన్న సంగతి ఇట్టే గ్రహించాడు.

చొరవ తీసుకొని, మెల్లిగా తలుపేసి గడియ నొక్కాడు.

నులకమంచంమీద చతికిలబడి, బుజ్జగింపుగా పుల్లమ్మ తల నిమిరాడు.

పుల్లమ్మ తలెత్తి అతణ్ణి చూసింది. సారిగాడి మీద ఉన్న ద్వేషం బాబూరావుని ఆత్మీయుణ్ణి చేసింది. భోరుమంటూ అతని ఒడిలో ఒదిగి పోయింది.

ఇలాంటి అవకాశం కోసం ఎదురు చూశాడు యిన్నాళ్ళు, "ఏడవకు ఊరుకో" అంటూ ఒళ్ళంతా తడిమి ప్రక్కనే కూరోచ్చె పెట్టుకున్నాడు.

"సూడు బాబాయ్! నేను గుడిసేటి దాన్నట!"

"ఎవడా కూసింది?"

"ఇంకెవడు, ఆ సారిగాడు!"

"అసలేం జరిగింది?"

కడుపులో మంట చల్లార్చుకోడానికి జరిగిన విషయం ఏకరువు పెట్టుకుంది.

"రత్తాయమ్మ ఓనాడు నాకాడికొచ్చి, పుల్లమ్మా నా పాణం బాగా నేదు. ఆసుపజేలు ఎళ్ళాలి, సాయం రావే అంది. సరేనని ఎల్లా. గదిలో ఆ డాట్రు సచ్చినోడు మా యిద్దర్నీ కూకో పెట్టాడు. రత్తాయమ్మకి బిళ్ళిచ్చి మింగించాడు."

పుల్లమ్మ ఏం చెప్తోందో అర్థం గావడంలేదు బాబూరావుకి. అర్థం కావడం అనవసరమనిపించింది. పుల్లమ్మని ఒళ్ళోకి తీసికొని, నిలువెల్లా నిమురుతున్నాడు.

"లేసెళ్ళి పోతుంటే, నా సెయ్యట్టుకున్నాడా డాట్రు. ఏమైందో అని సూసేలోగా: అయ్యబాబోయ్, నీ వొళ్ళు కాలిపోతున్నాది, మందేసుకోకుండా ఎలా ఉండగలిగా వింతసేపు, అని భయంపెట్టాడు."

"అయితే, పుల్లమ్మ కూడా మందెయ్యండి బాబూ అంటూ రత్తాయమ్మ నన్నొగ్గేసి బయటకు పోయింది."

"నన్ను ఎత్తి బల్లమీద ఎక్కించాడా సచ్చినోడు." వెక్కిళ్ళాపుకుంటూ, ఓసారి ఊది మళ్ళీ చెప్పుకుపోయింది.

"సెవులో గొట్టంపెట్టి, ఛాతీమీద యీపుమీద తడిమి, రత్తాయమ్మకు యాభై యిచ్చాను, సీకటి పడగానే రా, నేనీడనే ఉంటాను అన్నాడు. అసలు విషయం యిదా అని, సటుక్కున లేసి కూకున్నాను." వెక్కొచ్చి కూసేపాగింది.

"మంచిపని సేశావు" అంటూ కౌగిల్లోకి తీసుకున్నాడు బాబూరావు.

అతని గుండెల్లో తలదాచుకుని చెప్పుకు పోయింది పుల్లమ్మ.

"నీకు మళ్ళీ శాన డబ్బులిస్తాలే అన్నాడా సచ్చినోడు. ఈడి పని పట్టాలని ఎంతిస్తావేటి అనడిగా. ఏభై యిస్తానన్నాడు. సీ, ఎదవ యాభై అన్నాను. సరే వందన్నాడు. సరిపోదన్నాను. నూటయాభై అన్నాడు. సరే,

యియ్యి అన్నాను. మాపటికొత్తావుగా అప్పుడిత్తాను అన్నాడు. అట్టగయితే రానుపో అన్నాను."

"మా మంచి పని చేశావు" మెచ్చుకుంటూ మెడమీద ముద్దెట్టుకున్నాడు బాబూరావు.

"సచ్చి నట్టిచ్చాడు" అంది ముక్కెగదోసుకుంటూ.

"తీసేసు కున్నావా" కంగారు పడిపోయినట్టు నటిస్తూ అడిగాడు బాబూరావు.

"తీసుకున్నా కానీ, ఆడికాడి కెళ్ళలేదు. ఆణ్ణి బాగా మోసంసేసి బుద్దిసెప్పా."

"మంచిపని సేసా" వంటూ బుగ్గమీద ముద్దెట్టు కున్నాడు బాబూరావు.

"రత్తాయమ్మకి గడ్డెట్టి గొడవ సేయాలనుకున్నా, కాని సిన్న బోతుందని ఊరుకున్నా."

"మంచిపనిచేశావు. అనవసరంగా నీపేరు బయటికొచ్చేది" అంటూ గట్టిగా వాటేసుకున్నాడు బాబూరావు.

ఉక్కిరి బిక్కిరై విడిపించుకో బోయింది.

"మరి రత్తాయమ్మ నిన్ను అడగలేదా, నీవు ఆడికాడికెళ్ళావో లేదో అని." అడిగాడు మళ్ళీ మాటల్లో దింపుతూ, మాటల్లో దిగితే ఒళ్ళుమరిచి పోతుందని.

"నా కా సచ్చినోడు డబ్బు లిచ్చాడని సెప్పాను. సందేశే నాకో సీర కొనిచ్చి, కొత్తసీర కట్టుకుని ఆడికాడికి పొమ్మంది."

"వెళ్ళావా?" అడిగాడు కోపం నటించి, మంచంమీదకు వాలిపోతూ.

"నేను ఆడికి టోకరా ఇచ్చి రెంటో ఆట సినిమా కెళ్ళా" అంటూ అతని కేసి చూసింది.

"అమ్మయ్య" అంటూ మనసు తేలిక పడినట్లు పుల్లమ్మని తనమీదకి లాక్కున్నాడు.

ఆ సమయంలో ఓదార్చే నాథుడు మరెవరూ లేకపోవడం చేతనో, సారిగాడి మీద కోప ద్వేషాలు రెచ్చిపోవడం చేతనో, బాబూరావు చేతిలో రబ్బరు బొమ్మలా అంతవరకూ సాగిపోయిన పుల్లమ్మ, నిద్దట్లో ఉలిక్కిపడి మేలుకున్నట్లు చటుక్కున లేచి, చీరకుచ్చిళ్ళు సర్ది, పమిటను సవరించి, కొంగున బిగించ బోయింది.

గోముగా వారిస్తూ చెయ్యట్టుకున్నాడు బాబూరావు.

చెంప చెళ్ళుమంది.

దవడ తడుముకునే లోగా కొరకంచు పుచ్చుకుంది పుల్లమ్మ.

హుంకరిస్తూ లేచి, విసురుగా గుమ్మం తడికెను కాలితో తన్నాడు.

తడికెగిరి అవతల పడింది.

గుడిసెలో హోరుగాలి వీచి దీపం ఆరిపోయింది.

మంచంమీద కూలిపోయిన పుల్లమ్మ, రాజయ్య రాకను గమనించ లేదు.

* * *

నెలలు గడిచాయి.

జరిగిందాన్నో పీడకలగా మరిచిపోయింది పుల్లమ్మ.

పుల్లమ్మంటే కసిపెరిగిన బాబూరావు ఆమెను లోబరుచుకోడం కోసం విశ్వప్రయత్నం చేశాడు. కాని, లాభం లేకపోయింది. అతన్ని మళ్ళీ ఆ పంచలోకి రానీలేదు పుల్లమ్మ.

సారిగాడు కనుమరుగై పోయాడు. ఎప్పుకొస్తాడో ఎప్పుడెళ్తాడో ఎవరికీ తెలియదు.

వాడిని ఎంత మరిచిపోవాలని ప్రయత్నించినా పుల్లమ్మకి సాధ్య పడటం లేదు. వాడు దూరమయ్యేకొలది పుల్లమ్మ మనసు వాడికి దగ్గరవ సాగింది.

సంక్రాంతి రోజులు దగ్గర పడేకొలదీ సారిగాడికి మళ్ళీ కోళ్ళ వ్యాపకం పెరిగింది.

చాటుమాటుగా సారిగాడితో కులుకుతున్న మంగాయమ్మ యిప్పుడు బహిరంగంగానే సారిగాడితో ఉంటూంది.

మంగాయమ్మ అప్పిచ్చి సారిగాడిచేత పుంజుని కొనిపించింది. ఇప్పుడా పుంజుని పందెంలో పెట్టడంకోసం సారిగాడూ, మంగాయమ్మా దానికి తర్ఫీదు యిస్తున్నారు.

ఏపుగా పెరిగిన కోడిని చూసి యిది గేరంటీగా పందెం నెగ్గుతుందని యిరుగుపొరుగు వాళ్ళనుకోడం పుల్లమ్మ వింది.

తన స్థానంలో యిప్పుడు మంగాయమ్మ సారిగాడికి తోడవ్వడం బాధ అనిపించింది పుల్లమ్మకు. అది ద్వేషంగా మారింది.

ఆ పుంజు కాటాలను కోసెయ్యాలనుకుంది. కాటాలు లేని పుంజు చచ్చినదానితో సమానం.

సంక్రాంతి దగ్గర పడింది.

సారిగాడు పొద్దున్నే మంగాయమ్మ కొట్లోకెళ్ళి, అట్లు తిని, అటు నుంచటే రిక్షా స్టాండుకి వెళ్ళిపోతుంటాడు మామూలుగా.

అలా వెళ్ళగా చూసి, వాడి పుంజుని తన గుడిసెలోకి ఎత్తుకొచ్చి, మంచంకోడుకి కట్టేసింది.

కొటాలు తెగ్గొట్టటం కోసం కత్తి వెతుకబోతుంటే గుమ్మంలోకి సారిగాడొచ్చాడు.

వాణ్ణి చూసి అదిరిపడింది.

మంచం కోడికి కట్టిన పుంజుని చూశాడు సారిగాడు.

'స్సే! నియ్యమ్మా!' పుల్లమ్మని తిట్టి తుప్పున ఉమ్మేసి, కోడిని విప్పుకున్నాడు.

పుల్లమ్మ అడ్డుపడి తలుపు కాసింది.

"అడ్డు లెగు," అన్నాడు.

"ఆగు," అంది.

"నీతో నాకేటి ఊసులాట" అన్నాడు.

"నువ్వో మంగాయమ్మ సోవాసం ఒగ్గేయి,"

"దా నూసు నీకెందుకు?"

"పొగాకు కంపెనీ కెళ్ళి అడుగు; దానికాడ తొంగోనోడు ఎవడన్నా ఉన్నాడేమోనని."

"అదెట్టా పోతే నాకేటి అవసరం?"

"నాకు నీ అవసరం ఉంది కనుక,"

"నువ్వు, మాయమ్మతో సమానం,"

"నీ అయ్యాకూ, నాకూ సంబంధం లేదు. నేను నీ కమ్మ నవ్వాను. నీవు మా అయ్యాను మోసం చేసినా నేను సేయలేను,"

"నా కిట్టం లేని పెళ్ళి పెళ్ళి కాదు,"

"సే, నువ్వు మడిసివా—పశువ్వా? సెబితే బుద్ధి నేదూ?" అంటూ, పుల్లమ్మ నోనెట్టునెట్టి, తలుపు గెడ తీశాడు.

పుల్లమ్మ చెయ్యట్టుకు లాగింది.

ఛెళ్ళున లెంపకాయ కొట్టాడు.

పుల్లమ్మకి ఉక్రోషం పెరిగింది. వాడి మెళ్ళో గళ్ళతువ్వాలు బలంగా లాగి, వాడిని తనకేసి తిప్పుకుంది.

దాని జుట్టట్టుకుని చితక్కొట్టాడు.

తనూ ఆ తువ్వాలట్టుకు బాదింది.

వాడు బండబూతులు తిట్టి పారిపోయాడు.

భోరున ఏడుస్తూ కూర్చుంది పుల్లమ్మ.

"ఏటే, అట్టాగున్నావు?" పుల్లమ్మని చూసి జంకుతూ అడిగాడు రాజయ్య.

"నువ్వు మడిసివేనా?"

"ఏటయిందే,"

"కాటికి పోయేవోడివి, నన్నెందుకు కట్టుకున్నావు,"

"అస లేటయిందే నీకు,"

"నేనందరికీ సులకనయిపోయాను,"

"ఎవడేం సేసాడే నిన్ను,"

"నీ కొడుకు ఈ గుడిసెలో కొచ్చి, నన్ను సెరస బోయాడు సూడు," అంటూ గళ్ళతువ్వాలు చూపించింది.

రాజయ్య నిలువెల్లా దహించుకు పోయాడు, ముఖం ఎర్రగా కంది పోయింది. కళ్ళు చింత నిప్పులైనాయి. ఒక్క దూకులో గుడిసె బయటకు పోయాడు.

ఏ అఘాయిత్యం చేస్తాడో అని అనుమానం వేసి అతడి వెంట పడింది పుల్లమ్మ.

పెద్ద పెద్ద అంగలేస్తూ సారిగాడి గుడిసె చేరాడు రాజయ్య.

సారిగాడు ఒక బానని ఎత్తి, కోడికి మేత వేస్తూన్నాడు. రాజయ్య రావడం చూళ్ళేదు.

సారిగాణ్ణి కొట్టేటంత ధైర్యం లేదు రాజయ్యకు. వాడి మీద కసి తీర్చుకోవాలంటే, కోళ్ళ మీదే తీర్చుకోవాలి.

ఉక్రోషం పట్టలేక, ప్రక్కనే పాతిన గునపంలాంటి యినప కర్రని పెకలించాడు.

చుట్టూ ఎన్నో బానలు ఉన్నాయి.

వాటిలో పుంజులు ఉన్నాయి.

దబదబ ఆ బానలన్నీ పగలగొట్టాడు.

కోళ్ళు విజృంభించాయి.

రాజయ్య మీద ఎగిరెగిరి పడ్డాయి.

సారిగాడు కంగారుగా లేచాడు.

రాజయ్యను కోళ్ళు పొడిచేస్తున్నాయి.

వాటిని తరమడానికి గిరగిరా యినప కర్రని తిప్పాడు.

చెమట చేతుల్లోంచి కర్ర జారిపోయింది.

రెప్ప పాటులో అది బల్లెంలా సారిగాడి తొడలో దూసుకుపోయింది.

ఇవన్నీ క్షణంలో పుల్లమ్మ కళ్ళముందే జరిగిపోయాయి.

సారిగాడు నెత్తురు మడుగులో గిలగిలా తన్నుకుంటున్నాడు.

దూరం నుండి చూసినవాళ్ళు యిదేదో ఖూనీకేసులా ఉంది, దీనిలో యిరుక్కోడం దేనికని యిటుకేసి రాలేదు.

రాజయ్యు ఉన్నట్లుండి మాయమైపోయాడు. అప్పుడు మాయమై పోయిన రాజయ్యు జాడ యింతవరకూ తెలియలేదు.

సారిగాణ్ణి చూసి, గుండె కరిగిపోయింది పుల్లమ్మకి.

సారిగాడెంతో యమబాధ పడుతున్నాడు.

ఇనుప కడ్డీని తొడలోంచి లాగింది.

రక్తం చిమ్మి సొమ్మొచ్చి పడిపోయాడు.

ఇప్పుడు సారిగాణ్ణి తక్షణం ఆసుపత్రికి తీసుకెళ్ళకపోతే బతకడని తెలుసుకుంది పుల్లమ్మ.

రిక్షా లాగడానికి ఎవరేనా వస్తారేమో అని చూసింది. పేటలో వాళ్ళు ఏవో సాకులు చెప్పి తప్పించుకున్నారు. ఎవరూ సహాయానికి రాలేదు.

ఏడుస్తూ సారిగాడిని ఎత్తి, రిక్షాలో కుదేసి, తనే రిక్షా లాగి, గుట్ట మీద ఉన్న ధర్మాసుపత్రికి తీసుకెళ్ళింది.

ఆ ఆసుపత్రి ఆవరణలో వార్డులన్నీ విసిరేసినట్లు నాలుగువైపులా వున్నాయి.

ఆ ఆసుపత్రిలో అడుగు పెట్టడం ఆమెకు అదే మొదటిసారి.

ఒక చెట్టు కింద రిక్షానాపి, డాక్టరుకోసం అన్ని వార్డులూ వెదికింది.

డాక్టరుగారు ఏదో ఆపరేషన్ చేస్తున్నారని తెలిసింది.

ఈలోగా ఎంత బ్రతిమాలినా, ఎవరూ సారిగాడి దగ్గరకు రాలేదు. డాక్టరుగారు కేసు అడ్మిట్ చేస్తేనే గాని లాభం లేదన్నారు.

రక్తం ధార కట్టడంతో, సారిగాడికి స్పృహ పోయి, మాట పడి పోయింది.

పుల్లమ్మ ఆసుపత్రి అంతా పిచ్చిదానిలా తిరిగింది.

ఆపరేషను చేసి, డాక్టరు కారెక్కబోవడం చూసింది. అమాంతం కారు కడ్డం పడింది.

డాక్టరుగారు, ఒక నర్సుని పిలిచి, ఇంజక్షను యివ్వమనీ, గాయానికి కట్టు కట్టమనీ పురమాయించారు.

"మరో డాక్టరు వస్తారు, నా డ్యూటీ అయిపోయింది. ఈలోగా యింజక్షను యిస్తారు." అని పుల్లమ్మకి ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు డాక్టరుగారు.

ఇద్దరు వార్డుబోయిలు సారిగాడిని మోసుకొచ్చి వరండాలో పడుకోబెట్టారు.

ఆ వరండాలో అప్పటికే చాలమంది రోగులున్నారు.

గాయం కడిగి, కట్టుకట్టి, యింజక్షను యిచ్చింది నర్సు. "సావు గంటలో. డ్యూటీ డాక్టరుగా రొచ్చేస్తారు, వారిని పట్టుకో రక్తం ఎక్కించి, కుట్టు వేయాలి" అని చెప్పి నర్సు వెళ్ళిపోయింది.

సారిగాడికి స్పృహ పూర్తిగా పోయింది.

కుళాయి నీటిలో కొంగు తడిపి వాడి ముఖానికి అరారా రాస్తూ కూర్చుంది పుల్లమ్మ.

వార్డుబోయి ఒకడటు రాగానే, వరండాలో మరో పేషంట్ల తాలూకు ఆసామి, "బాబూ, మా వోడికి వార్డులో మంచం ఎప్పుడిస్తారు," అడిగాడు.

"వార్డులో చావు కేసొకటుంది, ఓ గంటలో పోతాడు, అప్పుడిస్తారులే- మీ వాడికి" అని సమాధానం చెప్పి వెళ్ళిపోయాడు వార్డుబోయి.

అతని వెనకాలే వెళ్ళి తనూ అడిగింది. "బాబూ-సారిగాడి కూడా మంచం ఎప్పుడిస్తారు."

ఎగాదిగా చూసి"ఆ తొడ కేసేనా? మూడొంతులు అవసరం ఉండకపోవచ్చు." అని వెళ్ళిపోయాడు.

కుట్లు కుట్టి పంపించేస్తారు. కావోసు అనుకుంది.

క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి.

డ్యూటీకి రావలసిన డాక్టరింకా రాలేదు.

పుల్లమ్మ ఆరాటం పెరిగిపోయింది.

రెండు గంటలకు డ్యూటీకి రావలసిన డాక్టరు పొద్దు వాలాక కార్లో దిగి తన గదికి వెళ్ళిపోయాడు.

పుల్లమ్మ గదిలోకి చొరబడింది.

డాక్టరు వారపత్రిక మడిచి వచ్చిన వ్యక్తిని ఎగాదిగా చూశాడు.

పుల్లమ్మ డాక్టర్ని చూసి కొయ్యబారిపోయింది. ఆ డాక్టరు- మోహినీ కుమార్.

"ఇదిగో కూర్చో" అంటూ ముక్కాలిపీట చూపించాడు డాక్టర్ మోహినీ కుమార్.

యాంత్రికంగా కూర్చుంది.

"ఏదీ చెయ్యిచూడనీ" అంటూ చెయ్యట్టుకుని" అబ్బా వళ్ళు కాలి పోతున్నది" అన్నాడు డాక్టరు.

"నా వళ్ళు కాలి మసయిపోయినా పరవాలేదు బాబూ, మా సారిగాడు అదే ఆ రత్తాయమ్మ కొడుక్కి తొడలో యిసపకడ్డీ దిగిపోనాది. సావు

బతుకుల్లో ఉన్నాడు. ఆడికి రక్తం ఎక్కించి, కుట్లేయ్యాలిట బాబూ, ముందస్తుగా ఆడిని కాపాడండి."

"అమ్మయ్య, యిప్పటికి గుర్తుకొచ్చింది. నిన్నెక్కడ చూశానా అనుకుంటున్నా ఇందాకట్నించి. నువ్వు ఆ టోకరా యిచ్చిన కేసు కదూ?"

"బాబూ తప్పయిపోనాది. మీరు మళ్లీ ఎప్పుడు రమ్మంటే అప్పుడొత్తా. గోదారి తల్లి సాచ్చిగా వత్తా. సారిగాణ్ణి బతికించు బాబూ" అంటూ కాళ్ళమీదపడి ఏడ్చింది.

"వస్తానని రాకపోతే, ఎదటివాడు ఎంతిదై పోతాడో నీకేం తెలుసు? ఆనాడు నీవు టోకరా యిచ్చాక, వారం రోజులు నా మనసు కరాబయిపోయింది. కసిగా నీకోసం గాలించా. మళ్ళీ దొరక్కపోతావా అని వదిలేశాను. చూశావా, యిప్పుడు దొరికిపోయావు."

"బాబుగోరూ, సారిగాడు సావుబతుకుల్లో ఉన్నాడు. మీరు బేగి రావాలి. నామీద నమ్మకం లేపోతే యిప్పుడే మీ యిట్టం వచ్చినట్లు బేగి సేసెయ్యండి." అంటూ లేచి తలుపుకు గడియేసింది.

"ఇంకా నయం. ముందా తలుపు తీయి" అంటూ అతనే తలుపు తీసి, "సరే, యిలా చేద్దాం. వార్డులో చాల సీరియస్ కేసులు ఉన్నాయి. ముందవి చూస్తేనేగాని కొత్తకేసు చూడకూడదు. అవన్నీ చూసేసి మన కేసు చూస్తా. అందాకా వెనకగేటు పక్కనే పెద్దమామిడిచెట్టు ఉంది చూడూ, దానివారే ఒక పెంకుటిల్లుంది. అదే స్పెషల్ వార్డు. నువ్వక్కడుండు. నేనక్కడికి వస్తా. అక్కడ కాసేపుండి, మీ సారిగాడి దగ్గర కెడదాం."

"కాదు బాబూ. యిప్పుడే ఆడిని చూడండి. ఆలీసమయితే ఆడు బతకడు. ఆడు నేకపోతే నేనూ బతకను."

"చెప్పానుగా. వాడికేం పరవాలేదు. నువ్వు చీకటి పడ్డాక అక్కడికొచ్చేయి" అని నడుం పుచ్చుకుని గుమ్మందాకా సాగనంపాడు.

గుర్తుకొచ్చిన దేవతల నందర్నీ తలచుకొని మొక్కుకుంటూ వరండా చేరింది.

సారిగాడికి ఎగశ్వాసా, దిగశ్వాసాగా ఉంది.

పాదాలు అరిచేత్తో రాయమని పక్కవాళ్ళు అంటే, అలా చేస్తూ కూర్చుంది.

చీకటిపడి చుట్టూ దీపాలు వెలిగాయి.

వరండా కటిక చీకటిగా ఉంది.

కొంగులో చిల్లరవేసి, దాన్నో వార్డుబోయి చేతిలో పెట్టి "బాబూ సారిగాడిని సూస్తూ ఉండు. నేను పెసలువార్డుకెల్లి యిప్పుడే వత్తాను" అంది.

"అక్కడ నీకేటి పని? ఓహో డాక్టరుగారు రమ్మన్నా రేంటి— వెళ్ళు, వెళ్ళు నీపని బేగయి పోతుంది" అని నవ్వుతూ చిల్లర అందుకున్నాడు.

డాక్టరు చెప్పిన పెంకుటిల్లు చేరింది. అది స్పెషల్ వార్డు. దానిలో రెండు గదులున్నాయి. అవి ఎప్పుడూ ఖాళీగా ఉంటాయి. కనక వాటిని డ్యూటీ డాక్టర్లు విశ్రాంతి గదులుగా ఉపయోగించుకుంటారు.

రెండుగదులూ చీకటిగా ఉన్నాయి. వరండా స్తంభాన్ని ఆనుకుని చీకటిలో నిలబడింది.

దూరంగా వార్డులన్నీ కనబడుతున్నాయి. మోహినీకుమార్ ఒక్కొక్క వార్డే తాపీగా చూస్తున్నాడు.

గంటలు గడిచాయి.

కొళ్ళు పీకి స్తంభం వారే చతికిలబడింది.

పుల్లమ్మ మనసు మొద్దుబారిపోయి ఉంది. దేహం అలసిపోయింది. తొమ్మిదికొట్టి మున్సిపాలిటీ సైరను గావుకేక వేసింది.

ఉలిక్కిపడి లేచి చూసింది.

డాక్టరు తనకేసి వస్తున్నాడు.

ఊపిరి బిగపట్టింది.

డాక్టరు తన కెదురుగా నుంచున్నాడు.

"ఇదిగో అమ్మీ, ఆ తొడకేసు పేషంటు యిప్పుడే చచ్చిపోయాడు. త్వరగా రా" అన్న వార్డుబోయి కేకలు చీకట్లోంచి వినపడ్డాయి.

"సీ. కక్కుర్తి నాయాలా" అంటూ కాండ్రించా డాక్టరు మీద ఉమ్మేసి పరుగెత్తుకు పోయింది పుల్లమ్మ.

*　　　*　　　*

సారిగాడి దినం ఘనంగా చేసింది పుల్లమ్మ.

గంగానమ్మ గుడిలో వాడు పెంచిన కోడిపుంజులను బలేయించింది. వాడి కిష్టమైన పుల్లట్లని పేటలో అన్ని గడపల్లో పంచిపెట్టింది. వీటి కోసం రాజయ్య సొంతరిక్షా అమ్మేసింది.

మంగాయమ్మ, కాసులమ్మ, పకీరమ్మ వగైరాలు పుల్లమ్మకి ఈ విషయంలో సాయం చేశారు.

ఇప్పుడు పుల్లమ్మ కెవరూ లేరు. ఏకాకి అయ్యింది. చావలేక బతికుంది. బతకడానికి గానుగ చెట్టుక్రింద రోజూ ఓ గంట పుల్లట్లేసి ఆ వచ్చిన రాబడితో కాలం గడుపుతూంది.

పుల్లట్లను తినే వాళ్ళని చూస్తుంటే సారిగాడిని చూసిన అనుభూతి కలుగుతుంది పుల్లమ్మకి.

బాబూరావు ఎన్నోసార్లు పుల్లమ్మ కోసం ప్రయత్నించాడు. కాని లాభంలేక పోయింది.

బాబూరావుకి ప్రమోషనొచ్చింది. ఆ సంగతి పుల్లమ్మకి కూడా చెప్పాలనిపించింది.

"నేను యిప్పుడు హెడ్డునయ్యాను. కోటిపల్లి బదిలీ చేశారు. నువ్వీ వూరు వదిలేసి కోటిపల్లి వచ్చేయి. అక్కడ నీతో బ్రాకెట్టు కంపెనీ పెట్టిస్తాను. నువ్వక్కడ హాయిగా బ్రతకచ్చు" అంటూ పుల్లమ్మకి సలహా యిచ్చాడు.

"ఆ బ్రాకెట్ కంపెనీ ఏదో మీ ఆవిడచేతే పెట్టించుకోవచ్చుకదా" అని పొగరుమోతు సమాధానం చెప్పి పంపించేసింది పుల్లమ్మ.

వెళ్ళేలోగా దాని పొగ రెలాగైనా అణచాలని పంతం పట్టాడు బాబూరావు.

బాబూరావు హెడ్డయాడని స్టేషన్లోని కుర్ర కాని స్టేబుళ్ళు అతనికో మందుపార్టీ యిద్దామనుకున్నారు.

ఎవరైనా చూస్తే బాగుండదు వద్దన్నాడు బాబూరావు- ముఖ్యంగా తన పెళ్ళానికి జడుస్తూ.

"రేపు పౌర్ణమి. బోల్డంత వెన్నెలుంటుంది. గోదారి తిప్పమీద పార్టీ చేసుకుందాం ఎవరికంటా పడకుండా" అని ఖరారు చేసేశారు.

తిప్పైతే మందుపార్టీ ఏం కర్మ, మేజువాణీ కూడా పెట్టొచ్చు అని వాళ్ళకి ఆలోచన తట్టింది.

"పేజువాణీ గట్రా వద్దు కాని, మీకు ఛావుంటే మురికి పేటలో పుల్లమ్మ అని పొగరుబోతు ఉంది. అది నా పాతకేసు. దాన్ని తిప్పమీదకి తీసుకురండి చూద్దాం." అని ఛాలంజి చేశాడు బాబూరావు.

ఓస్. ఇంతేకదా సై అన్నారు అందరూ.

గురువుగారికి పార్టీ చాలా ఘనంగా చేయాలని సంకల్పించింది శిష్య బృందం.

ఆ రోజు మధ్యాహ్నం ఓ కుర్ర కానిస్టేబులు పేటలో వాకబుచేసి పుల్లమ్మ మకాం దగ్గర కొచ్చాడు.

పుల్లమ్మ గురించి అడగగానే సారిగాడి ఖూనీ కేసేమోనని భయ పడి ఎవరి గుడిసెల్లోకి వాళ్ళు దూరిపోయారు పేటవాళ్ళు.

కానిస్టేబుల్ని చూసి పుల్లమ్మ కొస్త కంగారు పడ్డా తమాయించు కుంది. గుమ్మం ముందర మంచం వాల్చి గౌరవించి కూర్చోమంది. గ్లాసుతో మంచినీళ్ళందించింది.

పుల్లమ్మ ఇంత మర్యాదస్తురాలైతే పొగరుబోతు అంటాడేంటి గురుడు అనుకున్నాడు కానిస్టేబులు.

సూటిగా విషయానికొచ్చేశాడు "బాబూరావుగారు మా గురువు. రేపు వెన్నెట్లో గోదారి తిప్పతాడ వారికి గొప్ప పార్టీ ఇస్తున్నాం"

ఇందులో ఏదో తిరకాసుందని గ్రహించింది పుల్లమ్మ.

"ఛావ వుంటే ఆ పార్టీకి పుల్లమ్మని తీసుకురండని మాతో సవాలు చేశారు గురువుగారు. మరి మీ యిద్దరి మధ్య ఏం గొడవుందో మాకు తెలియదు. కాని నువ్వు మట్టుకా పార్టీకొచ్చి మమ్మల్ని నెగ్గించాలి."

పుల్లమ్మకి కోపం ముంచుకొచ్చింది. సమయస్ఫూర్తితో వెంటనే

తమాయించుకుని బాబూరావు మళ్ళీ ఈ జన్మలో తన జోలికి రాకుండా చేయాలనుకుంది.

పుల్లమ్మ ముఖంలో రంగులు మారడం కనిపెట్టేడు పోలీసు.

"ఉట్టినేకాదు, నీ రేటుకి రెండింతలిస్తాం!"

నిర్ఘాంత పోయింది పుల్లమ్మ. వీళ్ళకో పాఠం చెప్పాలనుకుంది.

"నా రేటెంతని సెప్పారు మీ గురూగారు"

"ఇంత, అని చెప్పలేదు కానీ, నువ్వెంతంటే అంతిస్తాం."

"నేనిట్టా వుండడానికి మీ గురువుగారే కారణం. అందుకే మీ గురువుగారంటే నాకు సానా గౌరవం. నే వుత్తినే వత్తాన్లెండి. ఎట్టా రావాలో సెప్పండి."

"చీకటి పడ్డాక నీకో రిక్షా పంపిస్తాం, గుప్‌చుప్‌గా ఎక్కెయి. ఆ రిక్షావాడు లాంచి రేవులో నిన్నో నావలో ఎక్కిస్తాడు. పావుగంటలో తిప్ప చేరిపోతావు. తిప్ప మీద కాస్త నడిస్తే మేమంతా అక్కడే వుంటాం."

"అలాగే బాబు, ఎల్లిరండి."

అది నిజంగా వస్తుందా అన్న సందేహం వేసింది కుర్ర కానిస్టేబులికి. బజానా ఇస్తే బాగుంటుందను కున్నాడు.

"ఇదిగో ఈ పది ఉంచుకో, మల్లెపూలు గట్రా కొనుక్కొని ముస్తాబయిరా. రిక్షా వాడికి నువ్వేమీ ఇవ్వద్దు."

ఎంతో వినయంగా తలూపుతూ నోటందుకుంది.

"ఇదిగో చూడు, నీ కష్టం ఊరికే పోనివ్వం. పార్టీ బాగా జరిగితే మేమంతా చందా లేసి నీకో సిలుకు చీర కొనిస్తాం." ఇంకా మానమేసి అనుమానమేసి ఆశ చూపించాడు.

"ఆ సీరేదో ముందుగా యిస్తే, కట్టుకుని మీ గురువుగారి కాడకొస్తే బాగుంటుందేమో సూసుకోండి."

"అవును, అదీరైటే, రేపీ పాటికి చీరట్టుకొచ్చి ఇస్తాను." అన్నాడు అలా చేస్తే గ్యారంటీగా వస్తుందని.

"లేత మబ్బు రంగు మీద కాకి నలుపు అంచంటే ఆరికి సాన యిట్టం. అయినా నేనన్నానని ఈ సంగతారికి సెప్పకండి."

"అమ్మో, మా గురువుగారి పట్లన్నీ నీకు తెలుసన్న మాట."

"ఎంత తెలిస్తే యేం బాబు. నేనారితో కోటిపల్లి వచ్చేసి బ్రాకెట్టు కంపెనీ పెడతానంటే, సీ పొమ్మన్నారు, మీ గురూగారు. ఈ సంగతి ఆరికి సెప్పకండి యిదౌతారు."

"క్రాస్త సెటిలయ్యాక తీసికెడతారులే. అందాకా మేమంతా వున్నాంగా" అని భరోసా యిచ్చి కదిలాడు ఆ కుర్ర కానిస్టేబులు.

* * *

వెన్నెట్లో తిప్పంతా పొగడపూల పాన్పులా మెరిసి పోతూంది. బాబూరావు, అతని శిష్యులు తిప్ప మీద ఇష్టాగోష్టి జరుపుతూ మందూ, విందూ ఆరగిస్తున్నారు.

బాబూరావు మనసంతా పుల్లమ్మ మయమయిపోయింది. గారంటీగా వస్తుందని శిష్యులు హామీ యిచ్చినా నూటికి తొంభైపాళ్ళు రాదని ఒక పక్క పీకుతూనే వుంది.

గడియ గడియకి గోదారికేసి చూస్తున్నాడు, నావేదయినా వస్తుందేమోనని.

గ్లాసు దింపితే, గ్లాసు నింపేస్తున్నారు శిష్యులు. దాంతో లెక్క

తప్పి అలవాటుకి మించి పుచ్చేసుకుంటున్నాడు మందు. దూరం నుండి తొమ్మిది గంటలకు సైరన్ మ్రోగింది.

ఇక రాదులే అని వాలిపోయాడు బాబూరావు. ఇంకా రాలేదని శిష్యులంతా కంగారుపడి తిప్పచివరి కెళ్ళి గోదారంతా కళ్ళతో వెదికారు.

అదిగో నావోస్తోంది అన్నాడొకడు.

అవును అది మనదే అన్నారు అందరూ.

లేత మబ్బు చీర, కాకి నలుపు అంచులతో సింగారించుకున్న శాల్తీని చూశారు. ఆ, అది పుల్లమ్మే అని ఖరారు చేసుకున్నారు. నావ తిప్ప చేరే లోగా గురువు గారిని లేపారు. చుట్టూ పరచిన గ్లాసులూ, పళ్ళాలూ వగైరాలను ఎవరిని వాళ్ళు తీసుకొని దూరంగా పోయి మరోచోట కూర్చున్నారు.

నావ తిప్పజేరింది.

శిష్యులటు చూశారు.

పుల్లమ్మ తిప్ప మీదకి దూకింది.

చేతిలో ఏదో పొట్లం పట్టుకొచ్చింది. పొట్లాన్ని కుడ్డెట్టి ఇటూ అటూ చూసింది.

దూరంగా కనబడ్డాడు.

అటుకేసి నడిచింది.

"పుల్లమ్మేదో తామరాకు పొట్లం తెచ్చిందిరోయ్" అన్నాడొకడు.

"పుల్లట్లన్నా" డింకొకడు.

"వాసన చూసిందిగా, అవి మల్లెపూలే" అన్నాడు మరొకడు.

"పుల్లమ్మని గురుడు చూశాడురోయ్"

"ఇంక వాళ్ళ మానాన వాళ్ళ నొదిలేద్దాం. అందరూ యిటు తిర గండి" అంటూ గోదారికేసి తిరిగి కూర్చున్నారు.

అక్కడ బాబూరావు చీర రెపరెపలకు మేల్కొని మత్తు చీల్చు కుంటూ మిడిగుడ్లతో కైపుగా చూశాడు.

గుండెలో బాంబు పేలింది.

ఎదురుగా ఉన్నది సాక్షాత్తూ తన పెళ్ళాం గజలక్ష్మి.

మత్తెగిరి పోయింది.

చేతులూ, కాళ్ళూ వణికాయి.

గజలక్ష్మి పొట్లం విప్పింది. అందులోంచి చట్టమైన పిడితో వున్న కంచీ తీసింది.

"అయ్యబాబోయ్" అని గావుకేక పెట్టాడు.

"అరవమాక వాళ్ళిటు చూస్తారు. ముందస్తుగా బడితెపూజ చేస్తాను. తరువాత తెల్లార్లూ సరసాలాడు కోవచ్చు ఇంచక్కా" అంటూ కంచీ ఛళ్ళు మనిపించింది.

"చచ్చానురోయ్" అన్నాడు.

ఇవతల గుంపులో ఒకడు అనుమానమేసి అటు చూశాడు. ఏదో అనబోతే అందరూ చీవాట్లెట్టారు- గురువుగారు జల్సా చేసుకుంటున్నారు అటు చూడద్దని.

బాబూరావు వొళ్ళంతా తట్టు రేగిపోయింది. శవంలా పడుకున్నాడు.

కంచీ మరోసారి ఝుళిపించి శిష్యబృందంకేసి నడిచింది.

అందరూ గ్లాసులట్టుకుని గోదారికేసి తిరిగి కూర్చున్నారు.

వెనుకనే వెళ్ళి కంచీ ఛళ్ళుమనిపించింది.

ఉలిక్కిపడి అందరూ ఇటు చూశారు.

కొరడా ఎత్తి చూపించింది.

"అమ్మ బాబోయ్!" అంటూ పులిని చూసినట్టు ఎక్కడి వక్కడే వదిలేసి ఆ తిప్పమీద చెల్లాచెదరుగా పారిపోయారు.

మరునాడు కీలుకో కట్టుగా వాళ్ళంతా కట్టు కట్టించుకుని, బదిలీ అయిపోయినా పనికట్టుకుని స్టేషను కెళ్ళి తన్నలా అవమానించినందుకు శిష్యబృందాన్ని బండబూతులు తిట్టాడు.

ఎంతో ప్రయాస పడి, గురువుగారి కిచ్చిన పార్టీ యిలా రసాభాస చేసినందుకు పుల్లమ్మమీద కక్ష సాధించి తీరాలని తీర్మానించుకుని త్వరలో అమలు పరచాలని నిశ్చయించుకుంది శిష్యబృందం.

* * *

గుడ్డిదీపం వెలుతురులో పిండి రుబ్బుతోంది పుల్లమ్మ.

దబదబ ఎవరో తలుపు తట్టారు.

ముంజేతితో ముంగురు లెగదోసుకుంటూ తలుపు తీసింది.

గుమ్మంలో పోలీసు గుంపు కనబడింది.

క్షణంలో బేడీలు వేయడం ఆ బేడీలకు గొలుసు కట్టడం, పుల్లమ్మని ముందుకి నెట్టడం జరిగి పోయినాయి.

పేటంతా నడిపించి వ్యానులో ఎక్కించి స్టేషనుకు లాక్కెళ్ళి, లాకప్‌లో పడేశారు.

తన నేరమేమిటో చెప్పమని పుల్లమ్మ ఎంతో గోడు పెట్టింది.

ఎవరూ ఆమెను పట్టించుకోలేదు. ఆమెకేసైనా చూడలేదు.

డ్యూటీ దిగిపోయే హెడ్ కానిస్టేబులు ఆవులిస్తూ "ఏటమ్మా? నీకు జామీనిచ్చే వాళ్ళెవరూ లేరా ? పోనీలే యిక్కడే కూర్చో. రేపు ఆదివారం కనుక ఎల్లుండి కోర్టులో నీ కేసెడతాం." అన్నాడు.

పుల్లమ్మ గోడు అరణ్యరోదనం అయింది.

నిస్సహాయంగా గంటలు లెక్కెడుతూ కూర్చుంది.

ఎట్టకేలకు తెల్లారింది.

స్టేషను గార్డులు బెల్టులు వదులుచేసి వందుం పుల్లలు నోట్లో పెట్టుకుని బయటకి పోయారు.

ఆలుగడ్డల్లాంటి కాకీ సంచిలో రెండు ఫ్లాస్కులు చంకకు వేళ్ళాడేసుకుని పిప్పిపంటి కోసం దవడకి రాసిన సున్నం బెల్లం పట్టీ ఆరిపోయి జారిపోకుండా ఓ చేత్తో పట్టుకొని కాఫీ,టీ అంటూ నీరసంగా మూలుగుతూ స్టేషను లోపలికొచ్చాడు ఈశ్వరయ్య. కటకటాల వెనకాల చతికిలపడ్డ పుల్లమ్మను చూసి, "ఏటి తల్లీ! రాత్రంతా వుండిపోనావు. నీకు జామీనివ్వడానికెవ్వరూ లేరా?" అంటూ కటకటాల ముందు తనూ చతికిలబడి అడిగాడు ఈశ్వరయ్య.

"నాకెవ్వరూ లేరు బాబూ. ఈడ నుంచి తప్పించు కోడానికి ఏం చెయ్యాలో సెప్పు".

"ప్లీడర్నెట్టుకుంటే నీకు జామీనిత్తాడు, కాని శానా కర్సవుతుంది."

ఈ గండం ఎలాగైనా గడిస్తే చాలనుకుంది. మెళ్ళో తాళిబొట్టు విప్పేసి, "దీన్ని ఏడయినా తాకట్టెట్టి ప్లీడరు గోరిని కుదుర్చు బాబూ, నీ సాయం జనమలో మరిసిపోను." అని వేడుకుంది.

"కోర్టుకాడ నరమామిడి చెట్టుకింద కూర్చునే ఆచారి ప్లీడరు గారు న్నారు. ఆరయితే తక్కువ తీసుకుంటారు. ఆరినే తీసుకొస్తా" అని తాళి బొట్టందుకున్నాడు.

బాగా పొద్దెక్కాక ఆచారి గారిని తీసుకొచ్చాడు ఈశ్వరయ్య.

ఆచారిగారు హెడ్డుగారితో మాట్లాడి కేసు విషయాలు తెలుసుకుని సంతకాలు పెట్టారు.

పుల్లమ్మని రమ్మని ఆమెని కూడా సంతకం చెయ్యమన్నారు.

సంతకం అంటే ఆలస్యమవుతుందని నిశాని చేసింది పుల్లమ్మ.

స్టేషనులోంచి బయట పడేసరికి పొద్దు నెత్తికెక్కింది.

మామూలు ప్లీడరుకి, చెట్టుకింద ప్లీడరుకి గొప్ప తేడా వుంది. మామూలు ప్లీడర్లు క్లయింట్లను వాళ్ళ ఇళ్ళకి రప్పించు కుంటారు. చెట్టు కింద ప్లీడరు క్లైయింటు ఇంటికే వెళతాడు.

"ఇక నువ్వెళ్ళమ్మా, చలబడ్డాక నీ ఇంటికొచ్చి కేసు వివరాలు తెలుసుకుంటా, ఈ కుర్రాడితో రిక్షా పంపించు" అని వెళ్ళిపోయారు ఆచారి గారు.

ఏళ్ళ తరబడి శిక్ష అనుభవించిన ఖైదీలా సుఖం చాపేసుకుని జరిగిన అవమానానికి కృంగిపోతూ అడుగెయ్యడానికి బెదిరిపోతూ కొంప చేరుకుంది పుల్లమ్మ.

పుల్లమ్మ రావడం చూసిన మంగాయమ్మ, కాసులమ్మ పరిగెత్తి వచ్చారు.

పుల్లమ్మ నోదార్చి, నాలుగు మెతుకులు తినిపించి, మామూలు మనిషిని చేశారు.

పొద్దు వాలేలోగా ఆచారిగారిని ఈశ్వరయ్య పేటలోకి తీసుకొచ్చాడు.

ఎరువు తీసుకున్న పుక్కాలిపీట గుమ్మం ముందేసి ఆచారిగారిని కూర్చోమంది పుల్లమ్మ.

తిప్పమీద పార్టీ లగాయితు జరిగినవన్నీ ఏకరువు పెట్టుకుంది ఆచారిగారితో.

"చూడు తల్లీ. నువ్వు నేరం చేయలేదని నాతో వాదించక్కర్లేదు. ఆ పని నేను కోర్టులో చేస్తాను. ఇప్పుడు నువ్వు చేయవలసిందల్లా నువ్వు నేరం ఎలా చేశావో ధైర్యంగా నాతో చెప్పడం. నాకు అసలు విషయం ఎంత బాగా తెలిస్తే ఆ విషయాన్ని అంత బాగా కప్పిపుచ్చి నువ్వు నేరం ఎలా చేయలేదో కోర్టువారికి రుజువు చేస్తా. కనుక మన మధ్య వాదోపవాదాలు, అధిక ప్రసంగాలు వుండకూడదు. జరిగింది జరిగినట్టు నాతో చెప్పెయ్యి."

"బాబుగారు, నేను సెప్పింది మీరే ఆలకించకపోతే కోర్టులో నా మాటెవరు వింటారు సెప్పండి."

"నిన్నరాత్రి సరిగ్గా ఏడూ ముప్పయి నిముషాలకు నువ్వు వీధరుగు మీద నుంచుని, పల్లెక్కగా విటుడి కోసం, అంటే పాసింజరుకోస మన్న

మాట. జుగుప్సాకరంగా దారేపోయే వాళ్ళను పిలుస్తుండగా నిన్నరెస్టు చేశారట పోలీసులు. సప్రెషన్ ఆఫ్ ఇమ్మోరల్ ట్రాఫిక్ ఇన్ వుమెన్ అండ్ గరల్స్ ఏక్టు ప్రకారం నీమీద కేసు నమోదు అయింది. నువ్వు నిన్నరాత్రి వీధరుగుమీద ఎందుకు నుంచున్నావమ్మా?"

"బాబుగోరు, అసలీ గుడిసెకి అరుగులే లేవు చూడండి. చుట్టూ మట్టిగోడలు బోసిగా వున్నాయి" మూలుగుతూ అన్నాడు ఈశ్వరయ్య.

ఆవారిగారు పెయ్యికళ్ళెట్టి చూశారు. ఆ గుడిసెకు అరుగుల్లేవు. "మరి చెప్పవేం తల్లీ, మీ గుడిసెకు అరుగుల్లేవని; అరుగులే లేకపోతే కేసేలేదు. కేసు కొట్టేయించడానికి ఆ ఒక్క పాయింటు చాలు. పది గంటల కల్లా కోర్టు దగ్గరుండు."

తాకట్టు బాపతు మిగిలిన చిల్లరనోట్లు లెక్కెట్టి పుల్లమ్మ కియ్యబోయాడు ఈశ్వరయ్య.

"నీకాడే వుంచు, రేపు నెక్క సూసుకుందారి" అంది పుల్లమ్మ.

"ఉత్తి పున్యాన్ని నేరంమోపే వాళ్ళు ఇల్లుపీకి పందిరేసేరకాలమ్మా, కాస్త జాగర్తగా మసులుకో" అంటూ వెళ్ళిపోయాడు ఈశ్వరయ్య.

మరునాడు కోర్టులో అసలు పాయింటు మరుగున పడి వాదోపవాదాల్లో పుల్లమ్మ గుడిసెకు అరుగులున్నాయా లేవా అన్నది ముఖ్యాంశమైంది.

ఉన్నాయని పోలీసుల వాదన.

లేవని ఆచారి ప్రతి వాదన.

ఇందులో నిజానిజాలు తెలుసుకోడానికి ఇద్దరు ప్లీడర్లని మధ్యవర్తులుగా నియమించి కేసు మరునాటికి వాయిదా వేసింది కోర్టు.

"రేపు కోర్టుకి వెళ్ళేముందు నీ గుడిసె చూడ్డానికి మధ్యవర్తులొస్తారు. అరుగులున్నాయా లేవా అని చూస్తారు. నేనూ కాస్త ముందుగానే వస్తాను. రేపిదేదో తేలాక నీ కేసు గ్యారంటీగా కొట్టించేస్తాను తల్లీ" అని కోర్టు నుండి పుల్లమ్మను సాగనంపారు ఆచారిగారు.

పెద్ద మనుషులొస్తున్నారని ఆ సాయంత్రం గుడిసె చుట్టూ శుభ్రపరచి పేడతో అలికి ముగ్గులెట్టింది పుల్లమ్మ.

మరునాడు ముస్తాబై కోర్టు కెళ్ళడానికి ఆచారిగారి కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

ఈసురోమంటూ ఆచారిగారు వచ్చారు. హమ్మయ్య అంటూ గుమ్మం వారే కూర్చున్నారు.

అరగంట గడిచింది. మధ్యవర్తులింకా రాలేదు. కోర్టుకి పైమై పోతుందని విసిగి పోతున్నాడు ఆచారిగారు.

ఆయన ఆరాటం చూసి, గుమ్మానికి అవతల ప్రక్కన నిలబడి ఎదురు చూస్తోంది పుల్లమ్మ.

ఆకాశం నుండి దిగివచ్చినట్టు అరక్షణంలో మధ్యవర్తులు, పోలీసులు గుడిసె ముందు వాలారు.

"అదిగో మొన్న అక్కడే ఆ అరుగు మీదే అలాగే ఎదురు

చూడఁగా షేం పట్టుకుని అరెస్టు చేశాం" అన్నారు పోలీసులు ముక్త కంఠంతో.

అదిరిపడి ఒక్క గెంతేసింది పుల్లమ్మ. తను యిప్పటిదాకా నుంచు న్నది అరుగుమీదే.

కొయ్యబారిపోయి ఇటూ అటూ తడిమి చూసుకున్నారు ఆచారిగారు. తను యింతవరకూ కూర్చున్నది అరుగుమీదే.

గుమ్మానికి ఇటూ, అటూ అడుగెత్తు, గజం వెడల్పులో నున్నఁగా అలకబడిన అరుగులున్నాయి.

పోలీసువారు వాటిని ఠీవిగా చూపించారు మధ్యవర్తులకు.

మధ్యవర్తులు వాటిని గుడ్లప్పగించి చూశారు.

ఆచారిగారి నోట మాటరాలేదు. "హమ్మ, ఈ పోలీసులు ఎంతకైనా సమర్థులు" అని నాలిక సాచి ముక్కుమీద వేశేసుకున్నాడు.

"నా కొంపముందు సచ్చినోళ్ళెవరో రేత్రికి రేత్రే అరుగు కట్టేసి నా కొంప ముంచినారోయ్" అంటూ లబోదిబో మంది పుల్లమ్మ.

పోలీసుల్ని చూసి వీళ్ళే అయివుండాలని బండబూతులు తిట్టింది.

"ఆగుతల్లీ! ఆగు! నువ్వు వారినలా తిడితే నీ నేరం రెట్టింపై జరిమానా బదులు జైలుశిక్ష పడుతుంది. ఆ అరుగులు నిన్న లేవని నువ్వూ, నేను చెబితే కోర్టు నమ్మదు. చుట్టుప్రక్కల వాళ్ళని పిలువు, వాళ్ళతో చెప్పిస్తాం" అంటూ ఆచారి గోలెట్టాడు.

మంగాయమ్మ, పకీరమ్మ, కాసులమ్మ వగైరాలను అందరినీ బల

వంతంగా ఈడ్చుకొచ్చింది పుల్లమ్మ. వాళ్ళందర్నీ లైనులో పెట్టి "ఇక్కడ అరుగులుండేవా." అని ప్రశ్నించారు ఆచారిగారు.

"ఉన్నాయి కదండీ".... మంగాయమ్మ.

"కనబడుతున్నాయి కదండీ"....పకీరమ్మ.

"అవి అరుగులు కాదేటండి"....కాసులమ్మ.

"ఇప్పటి సంగతి కాదమ్మా. నిన్నటి సంగతి చెప్పండి" ఇక్కడరుగులుండేవా లేవా? బాగా ఆలోచించుకు చెప్పండి" అడిగాడు ఆచారి గారు ప్రాధేయపడుతూ.

"నాకెరిక లేదండి" మంగాయమ్మ.

"ఉండే ఉంటాయండి" పకీరమ్మ.

"ఉండేవి కామోసండి" కాసులమ్మ.

పేటలో ఎవర్నడిగినా ఇలాటి సమాధానాలే చెప్పారు.

అలా అబద్ధమాడినందుకు అందరినీ ఆడిపోసుకుంది పుల్లమ్మ.

నిస్సహాయస్థితిలో మధ్యవర్తులకేసి ఓరగా చూశారు ఆచారిగారు.

అందుకే నువ్వింకా ఈ చిల్లరకేసుల్లోనే పడి చెట్టుక్రింద ప్లీడరుగా ఏడుస్తున్నావు అన్నట్టు క్రూరంగా చూశారు మధ్యవర్తులుగా వచ్చిన ప్లీడర్లు.

నీరుగారిపోయారు ఆచారిగారు.

అనవసరం దావా పారేసి, అరుగులున్నాయన్న నిజాన్ని నిరూ

చేసిన మధ్యవర్తుల ఫీజు బాపతు యాభై, కాక పోలీసులను దుర్భాషలాడిన పాపానికి మరో యాభై వెరసి నూట పాతిక రూపాయలు జరిమానా, సదరు జరిమానా కట్టని పక్షంలో నెల్లాళ్ళు జైలుశిక్ష అని తీర్పిచ్చింది కోర్టు.

తాకట్టెట్టిన తాళి పూర్తిగా అమ్మేసి, ఈ రొచ్చులోనించి బయట పడింది పుల్లమ్మ.

అరుగు విషయంలో ఇరుగుపొరుగుతో పేచీ పెట్టుకుని తన పుల్లట్లు వ్యాపారం పుష్కరాల రేవుకి మార్చేసింది.

అదీ పుల్లమ్మ కథ.

*　　*　　*

అడుగడుగునా జీవితంలో ఎన్నో కష్టనిష్ఠూరాలకి, అపహాస్యాలకు, అపనిందలకు గురయింది పుల్లమ్మ.

ప్రజాహిత కార్యాలను చేపట్టటానికి ప్రభుత్వం ఎన్నో శాఖలను నెలకొల్పి వాటి నిర్వహణకై మంచి మార్పులాన్ని నియమించింది. అమృతంలో విషబిందువులా ఆ సంస్థ బజారు కెక్కుతుంది. గతంలోకి చూస్తే పోలీసులు పెట్టిన అల్లరి, ధర్మాసుపత్రిలోపడ్డ క్షోభ, న్యాయస్థానంలో జరిగిన అవమానం ముందుగా గుర్తుకొస్తాయి పుల్లమ్మకు. అందుకే ఆ సంస్థలంటే ఆమెకు అసహ్యం.

గోదాట్లో దిగి తన గతం మరోసారి నెమరు వేసుకుంది. అలా ఎంత సేపో ఉండిపోయింది.

ఎదురుగా మెట్ల మీద ఒకవైపు సంతకాలు చెయ్యమంటూ టాక్సు యినస్పెక్టర్లు, మరోవైపు తనతో ఉండి హెమ్మని ఆశగా చూస్తున్న ఈశ్వరయ్య కనపడ్డారు.

అంటే అప్పటికే నాలుగయిందన్నమాట.

చీర పిండుకుంటూ మెట్లెక్కింది.

ఇటు టాక్సు ఇనస్పెక్టర్లు, అటు ఈశ్వరయ్య ఉన్నారు.

వారిద్దరి మధ్య ఆగింది.

ఎదురుగా మనస్సాక్షి త్రాసు పట్టుకు నిల్చుంది.

ఒకవైపు అట్లమీద టాక్సు, మరోవైపు ఈశ్వరయ్యతో వ్యభిచారం.

త్రాసు ఎటూ వాలక అటూ ఇటూ ఊగిసలాడుతూంది.

ఒకవైపు సంతకం చెయ్యమని హుకుం చేస్తున్న గుంపు.

మరొకవైపు ప్రాధేయ పడుతున్న ఈశ్వరయ్య.

ఒకవైపు పన్ను కడతావా, కొట్టు మూస్తావా అనేవాళ్ళు.

మరోవైపు కొట్టు మూస్తావా, నన్నొదులుకుంటావా అనేవాడు.

ఒకవైపు సారిగాడిని పొట్టనెట్టుకున్న ఆసుపత్రిలోని ధర్మం.

మరోవైపు ఈశ్వరయ్యకు ఉంపుడుగత్తెగా ఉండవలసిన ఖర్మం

ఒకవైపు పోలీసులు పెట్టిన హింస.

మరోవైపు ఈశ్వరయ్య ఇస్తానంటున్న అండ.

ఒకవైపు న్యాయంలేని న్యాయస్థానం.

మరోవైపు కపటం లేని స్వార్థం.

పుల్లమ్మ మనసు ఎటూ తేల్చుకోలేక ఊగిసలాడింది.

చాలాసేపు అలా ఉండిపోయింది.

అసలిది సంతకం పెడుతుందా లేదా అని టాక్సు డిపార్టుమెంటు సిబ్బందికి సందేహం వచ్చింది.

అసలిది తనమాట వింటుందా లేదా అని ఈశ్వరయ్యకు సందేహం వచ్చింది.

కొంపతీసి కొట్టుమూసేస్తుందేమో అని సిబ్బందికి గాబరా పట్టుకుంది.

కొంపతీసి సంతకం పెడుతుందేమో అని ఈశ్వరయ్యకి గాబరా పట్టుకుంది.

ఇక పుల్లట్ల మీద ఆశ వదిలేసుకోవాలేమో అని భయమేసింది సిబ్బందికి.

ఇక పుల్లమ్మ మీద ఆశ వదిలేసుకోవాలేమో అని భయపడ్డాడు ఈశ్వరయ్య.

పుల్లమ్మ ఒక నిర్ణయానికి వచ్చింది.

చకచకా రావిచెట్టుకేసి నడిచింది.

క్షణంలో యింకా ఆరిపోని పొయ్యల్ని రాజేసింది.

ఇట్టే పెనాలు వేడెక్కాయి.

చుయ్, చుయ్ శబ్దాలు సెగలు పొగలతో చుట్టూ ఆవరించాయి.

టాక్సాఫీసు బాపతు సిబ్బంది కళ్ళు మెరిశాయి.

దూరంనుంచి చూస్తున్న ఈశ్వరయ్య నీరుకారిపోయాడు!

సిబ్బందికేసి కలయజూసింది.

గుటకలేస్తూ పెనాలకేసి చూస్తున్నారు అందరూ.

అట్లు కాలినాయి.

కమ్మని వాసన నోరూరించింది.

పుల్లమ్మ చేతిలో అట్లకాడ స్తంభించుకు పోయింది.

దోరగా కాలిన అట్లు చూస్తుండగా నల్లగా మాడిపోయాయి.

సిబ్బందికి ఆశ్చర్యం వేసింది. "ఏటలా సూత్తన్నారు." పొయ్యల మధ్య భద్రకాళిలా లేచింది పుల్లమ్మ.

టాక్సు వసూలుకు వచ్చిన సిబ్బంది గుడ్లప్పగిస్తూ చూస్తుండి పోయింది.

"సూడండి బాబు. ఇన్నాళ్ళు పీకదాకా మెక్కిన అట్లు ఎలా మాడి మసైపోతున్నాయో, బాగా చూసుకోండి. నాకాడ కూకొని నా ఎదురుగా అట్లు తింటున్నవోడు దొరైనా, దొంగైనా ఆడిలో నా సారిగాడు కనబడు తుంటాడు. ఆడికి పుల్లట్లంటే పాణం. అందుకే నేనేసిన పెతి అట్లోను సారి గాడు వున్నాడు. రెక్కలు ముక్కలు సేసుకుని అట్లేసి వాణ్ణింకా నాలో బతికించుకుంటున్నాను.

పిండి, పులుసు- పుల్లా, పుడక ధరలు మండిపోయినా అట్లరేటు పెంచకుండా కిట్టుబాటు లేకపోయినా యీ ఎర్రిబాగుల్ది ఎలా ఏసి పెడు

తుందన్న సంగతి మీరెప్పుడైనా ఆలోసించారా. డబ్బు మీద ఆశుంటే అట్టుకి అరపైసా పెంచి మీరడిగిన పన్ను కట్టి మీ ఆఫీసునే కొనగల్ను బాబూ. కానీ, నా సంపాదనలో ఓ సిల్లిగవ్వైనా పన్ను కట్టడానికి నా మన సొప్పడం లేదు.

ఎందుకో తెలుసా, ఆ డబ్బుతో పోలీసోళ్ళని, ధర్మాసువత్రుల్ని, కోర్టుల్ని నడుపుతారని మీరు సెప్పారు గనుక.

నా మీద కుట్రసేసి, నా సారిగాణ్ణి నాకు దక్కకుండా మునలోణ్ణి కట్టబెట్టి నా జీవితాన్ని నాశనం సేసింది, వొక పోలీసోడు బాబూ. ఏ పాపం ఎఱగని నన్ను గుడిసేటి దాన్ని సేసి, బోనులో పెట్టించింది కూడా ఆ పోలీసోళ్ళే.

నా వుసురు తగిలి, అళ్ళిలాగే మాడి మసయిపోవాల" అంటూ పెనం మీద అట్టుని తీసి గిర్రుమని తిప్పుతూ గోదాట్లోకి విసిరేసింది పుల్లమ్మ.

గుటకేసి చూస్తుండి పోయింది సిబ్బంది.

"నా సారిగాడి పాణాలు కాపాడమని కాళ్ళా ఏళ్ళా పడితే, సెడితే గాని సెప్! నా వల్లకాదని మొండికెత్తి నాడా యదవ నాయాలు. అలాంటి డాట్టర్లుండే ఆ ఆస్పత్రికోసం నా సంపాదనలో వో పైసా గూడా కర్సవడం నాకిట్టంలేదు బాబు.

ఆలాంటి డాట్టర్లకి నా సారిగాడి ఉసురు తగిలి యిలాగే మసయి

పోవాలి." అంటూ మరో అట్టు తీసి గిరగిరా తిప్పుతూ కసిగా గోదాట్లోకి విసిరేసింది పుల్లమ్మ.

స్తబ్ధులై వింటూ వుండిపోయింది సిబ్బంది.

"నలుగురిలో నన్ను బోనెక్కించి తప్పుడు సాచ్చికాలు విని యిది వట్టి గుడిసేటి నంజ అని తీర్పిచ్చిన కోర్టు నడపడం కోసం నా డబ్బులే కావల్సొచ్చాయా బాబూ. ACC NO. 12230

సత్తే ఇవ్వను. అట్లాంటి సాక్షికాలు ఇచ్చినోళ్ళు యిలాగే మాడి మసైపోవాల" అంటూ మరో అట్టుని తీసి రివ్వుమని గోదాట్లోకి విసిరేసింది. 8948133 RAM

ఇంకో అట్టు పెనం మీద మిగిలుంది.

"ఏటి ఈశ్వరైమావా, ఓ పుల్లమ్మ తల్లీ, నువ్వే సాచ్చాత్తూ కూడెట్టిన దేవతవు అని కూసిన నోటితోనే నా పంచన సేరి నాతో యబిచారం సేయవా? అని అడుగుతావా?" US 200

ఈశ్వరయ్య గజగజ వణికిపోయాడు- ఈ భద్రకాళి తన మీద ఎలా విరుచుకు పడబోతుందో అని.

"భయపడకు మావా! ఆ పోలీసోళ్ళ సేతిలో పడకపోయినా యబిచారినైపోనాను. సారిగాణ్ణి ఆస్పత్రిల్లో బతికించుకోలేక యబిచారి నయ్యాను. అబద్దం సాచ్చికాలు యిన్న కోర్టులో వోడిపోయి యబిచారి నయ్యాను. నన్నిన్ని సార్లు యబిచారిని సేసినోళ్ళకోసం పన్ను కట్టడం కన్నా నీ

పంచన చేరి నీతో లంజరికం సేయడమే తక్కువ యబివారం. నాలో యింకా ఆడతనమంటూ వుంటే ఆదియ్యాల యిలా మసై పోవాల" అంటూ ఆ మిగిలిన అట్టును తీసి గోదాట్లోకి విసిరేసింది.

"ఇదిగో ఈశ్వైమావా, ఈ గోదారి తల్లి సాచ్చికంగా సెప్పుతున్నాను. నేనీ జనమలో సచ్చినా పుల్లట్లు ఏయను. రా పోదారి", అంటూ ఒక్క అంగలో ఈశ్వరయ్యను చేరి చెయ్యట్టుకు బరబరా రేవు లోంచి బైటకు లాక్కుపోబోయింది.

"నా సెయ్యొదులు పుల్లమ్మా! నువ్వొంటరిగా ఈ యాపారం చూసుకోపడం సేతగాక కేవలం ఓ గుప్పెడు సిల్లరకోసం గొడ్డుచాకిరీ సేస్తున్నావని నిన్ను నాతో ఉండి పొమ్మన్నది ఎందుకనుకున్నావ్, ఇక్కడ కాకపోయినా మరోచోటైనా నీతో అట్ల దుకాణం పెట్టించి బాగా సంపాదించాలని, దాంతో బాటే నిన్ను సుఖపెట్టాలని. కానీ, నాకేటి పని సెప్పు" అని మెల్లగా చేతులు విడిపించుకుని మాయమై పోయాడు ఈశ్వరయ్య.

పుల్లమ్మ నిర్ఘాంతపోయి గోదాట్లోకి చూసింది.

తను ఆఖరిసారిగా వేసిన అట్లు గిరగిరా తిరుగుతూ కొట్టుకు పోతున్నాయి ప్రవాహంలో.

